# THE
# ANDHRA PRADESH LEGISLATIVE ASSEMBLY
# DEBATES

[*Part II—Proceedings other than Questions and Answers*]

## OFFICIAL REPORT

---

*Thirty-fourth Day of the Fifth Session of the Andhra Pradesh Legislative Assembly*

---

## ANDHRA PRADESH LEGISLATIVE ASSEMBLY

*Friday, the 19th July,* 1957.

The House met at Half Past Eight of the Clock

[ *Mr. Speaker in the the Chair* ]

## QUESTIONS AND ANSWERS

(SEE PART I)

## LEAVE OF ABSENCE TO SRI G. JAGANNADHA RAJU

శ్రీ పి. నరసింగరావు (హుజూరాబాదు): అధ్యక్షా, విధానసభ నియమావళి యందలి 265 వ నియమమును అనుసరించి ఆంధ్ర ప్రదేశ్ విధానసభ సభ్యుడు శ్రీ గొట్టుముక్కల జగన్నాధరాజుకు అనారోగ్య కారణమువల్ల ప్రస్తుత సమావేశమునకు హాజరు కాలేనందుకు యీ సభవారు అనుమతించవలసిందని కోరుతున్నాను.

*Mr. Speaker:* The question is:

"That under Rule 265 of the Assembly Rules, leave of absence be granted by this House to Sri Gottumukkala Jagannadha Raju, Member, Andhra Pradesh Legislative Assembly, for his absence during the present meeting on the ground of ill health."

The motion was adopted.

## BUDGET — DEMANDS FOR GRANTS.

*DEMAND No. I — Land Revenue* *Rs. 1,42,22,800*

*DEMAND No. XI — District Administration and Miscellaneous* *Rs. 3,22,51,500*

*DEMAND No. XXXVI — Compensation to Zamindars* *Rs. 20,70,000*

*శ్రీ డి. వి. సుబ్బారావు (పెద్దాపురం) : అధ్యక్షా, మన రివెన్యూమంత్రి గారు రమారమి అయిదుకోట్ల రూపాయలు Land Revenue, Compensation to Zamindars, District Administration and Miscellaneous అనే Heads క్రింద సభవారిని ఆమోదించవలసిందిగా కోరారు. Revenue Department అనేది ఎటువంటిదంటే ప్రభుత్వములో ఉన్న అన్ని డిపార్టుమెంట్లకు తల్లివంటి డిపార్టుమెంటు అన్నమాట. అంటే ప్రతి డిపార్టుమెంటుమీద కొద్దో గొప్పో అధికారము చలాయించటానికి, ఆ డిపార్టుమెంట్ల జుట్టు తనచేతిలో పెట్టుకున్న డిపార్టుమెంటు యీ రివిన్యూ డిపార్టుమెంటు. ఉదాహరణకు పోలీసు డిపార్టు మెంటుతీసుకోండి. దానికి D. S. P. ఉన్నారు. ఆయనపోలీసు డిపార్టుమెంటులో జిల్లాకంతటికి అధికారి. Collector and District Magistrate అని రివిన్యూ డిపార్టుమెంటులో జిల్లాఅధికారిగా ఉన్నవారికి యీ పోలీసు సూపరింటెండెంట్ మీద అధికారము ఉన్నది. Police Standing Orders లో ఉన్న మొదటి వాక్యము అదే. ఎక్కడైనా ఒక యింటికి నిప్పు అంటుకుంటే, అది చల్లార్చ టానికి Fire Department వారు Fire Engines తీసుకునిపోవాలి. ఆ fire ఇంజను ముప్పది మైళ్ళు దాటిపోవలసివస్తే, దానికి, ఆ కలెక్టరు పర్మిషన్ యిస్తేగాని, అక్కడికి వెళ్లటానికి వీలుండదు. ఆ యిల్లు తగలబడిపోయిననుసరే, కలెక్టరు ఎక్కడ ఉంటే అక్కడికి వెళ్లి పర్మిషను తీసుకుంటేనే అక్కడికి వెళ్ల టానికి వీలుఅవుతుంది. లేకపోతే లేదు. ఇలా ఉంది రెవిన్యూవారి అధికారము. ఇకపోతే P. W. Department ఉన్నది. Second crop కు నీరు అవసరము. దానికి నీరు యివ్వటానికి పర్మిషను Executive Engineer ఆపైన Superintending Engineer ఇస్తారు. ఆ నీరు యివ్వకుండ ఆపుచేయాలంటే, డిప్యూటీ కలెక్టరు చేయవచ్చు. ఇక్కడ P. W. D. వారి మీద యీ విధముగా జుట్టు చేతిలోపెట్టుకున్నారు. ఈవిధముగ ప్రతిడిపార్టుమెంటు మీదకూడ కొద్దిగానైనా రెవిన్యూ డిపార్టుమెంటువారు అధికారము పెట్టుకున్నారు. అందువల్ల దీనికి తల్లిడిపార్టుమెంటు అంటున్నారు. ప్రతి డిపార్టుమెంటుకు పునాది అన్నమాట. ఇటువంటి డిపార్టుమెంటును మన శ్రీ వెంకట్రావుగారు మంత్రిగా నిర్వ హిస్తున్నారు. వారు చాలా మేధావులు. రమారమి అయిదుకోట్లు అడుగు తున్నారు. అయితే యీ రెవిన్యూ డిపార్టుమెంటు ఎంత అధికారము

చలాయిస్తున్నదో అంతకు వెయ్యిరెట్లు ఆలస్యముతో కూడ ప్రజల పనులు చేయిస్తున్నది. ఈ డిపార్టుమెంటులో ఏ పని తలపెట్టినా, ఏ పిటిషను యిచ్చినా, అది హైటికి రావడమంటూ లేదు. చివరకు జవాబు కూడ రావడమనేది ఉండదు. ఇకపోతే సబ్‌రిజిస్ట్రారువారి ఆఫీసుకు వెళ్లితే, ఆయన వద్ద ఏ క్రయదస్తావేజు అయినా రిజిష్టరు చేయాలంటే, ఒడంబడికలు కూడ అక్కడ దాఖలుచేస్తేగాని, ఆ దస్తావేజును ఆయన చేత బట్టడు. అసలు తలకూడ ఎత్తి చూడడు. ఒడంబడికలు దాఖలుచేయడముతోటే, పట్టా transfer form వారు ఒకటి యివ్వాలి. అది ఎవరికి వెళ్లాలి అంటే, తహశీలుదారుకు వెళ్లాలి. మళ్లీ యిక్కడ రెవిన్యూ డిపార్టుమెంటు తగులుతున్నది. తహశీలుదారుకు ఆ పట్టా transfer ఫారము పంపితే, దానికి చివరికి పట్టా ట్రాన్సుఫరుచేయకపోగా దానికి అతీగతీ ఉండదు. పోనీ, వారికి జ్ఞాపకముచేద్దామని వారి వద్దకు వెళ్లితే, Court Fees Act ఏూర్చారు. దాని ప్రకారము ఒక రూపాయిబిళ్ల కట్టాలి, కట్టండి అంటారు. నేను దీనిని వ్యతిరేకించాను. ఇంతకు వారు చేయవలసిన పనిని నేను జ్ఞాపకము చేద్దామనిపోతే వారిపనికి నాకు రూపాయ వదిలింది. ఒకవేళ ఆ రూపాయ నేను కట్టకపోతే, అది బుట్టదాఖలు అయినట్లే. మరల పెట్టమంటే దానికి యింకొక రూపాయి కట్టాలి అన్నమాట. ఈ విధముగా వారానికి ఒక 0-4-0 చొప్పున చార్జిచేస్తారేమో యీ కాంగ్రెసు ప్రభుత్వము అని నాకు అనుమానముగా ఉన్నది. ఈ విధముగ ప్రతిదానికి విశేషమైన ఆలస్యములు యీ రెవిన్యూ డిపార్టుమెంటులో జరుగుతున్నవి. ఇలాంటి ఆలస్యములు జరుగుతునే ఉంటవని మన రెవిన్యూమంత్రిగారికి తెలియకపోలేదు. కాని ఇలాంటి ఆలస్యముల వల్ల రైతాంగానికి గాని, మామూలు ప్రజానీకానికి గాని ఎంత యిబ్బంది పెడుతున్నారో, యిలాంటి డిపార్టుమెంటుమీద ప్రజలకు ఏమి నమ్మకము, గౌరవము ఉంటుందనుకుంటారో మంత్రిగారే గుర్తించాలి.

జమాబంది ఉన్నదనుకోండి. పూర్వం 30,40 ఏళ్ళ క్రిందట జమాబంది time లో భోగం మేళాలు పెట్టేవారట. ఇప్పుడు అవి లేవనుకోండి. కాని పెద్ద సంతర్పణలు, విందులు జరుగుతునే ఉంటాయి. అయితే జమాబందీ Officer గారు T. A. లు D. A. లు పూర్తిగా draw చేస్తారు. Village Officer లు కూడా రిజిష్టర్లనీ పట్టుకొచ్చి 10 రోజులు 15 రోజులు అక్కడ ఉంటే వారికేమి ఇస్తున్నారు ? రోజుకు రూపాయి పావలా ఎంతో ఇమ్మని G. O. pass అయినదే గాని దాని ప్రకారం ఇస్తున్నట్లు ఎక్కడా కనపడడం లేదు. ఆయన అక్కడ 15 రోజులు ఉంటే ఏమౌతుంది ? ఆ డిప్యూటీ తాసిల్దారు గారు Revenue Inspector గారు ఏ పెద్ద రైతునో తలగొట్టి పోగుచేస్తూ ఉండడం, తరువాత వాళ్ళకి వాళ్ళకి obligations ఏర్పడడం జరుగుతుంది. Government లోనే contingency fund అని ఎన్నింటికి డబ్బు వసూలు చేయడం లేదు ? Legal గానే కేటాయింపు చేయవచ్చు. అలా చేసియున్నట్లయితే చాలా చక్కగా

ఉండేది. Land Revenue వసూలు చేయడానికి గాని, అసలీ Revenue Depertment అంతకీ పునాది రాయి ఎవరు ? Village Officers. వారికీ ప్రభుత్వానికీ అట్టే పొసగడం లేనట్లుగా పేపర్లలో తెలుస్తున్నది. వారితో విరోధపడితే ప్రభుత్వానికి చాలా కష్టమని ప్రభుత్వం గుర్తించాలి. ఎంత చిన్న ఉద్యోగస్థులు అయినప్పటికి వారియొక్క సహాయం, సహకారం లేకుండా ప్రభుత్వం నడుపుదామని అనుకోవడం చాలా పొరపాటు. అయితే వాళ్ళుగాని రాజీనామా యిచ్చినట్లయితే B. A. pass అయినవాళ్ళే వస్తారు అంటే ఏమి ఉద్యోగం లేక దీనిలోనే ఉండి రెండు చేతులా సంపాదిద్దామనే ఉద్దేశంతో B. A. pass అయిన వాళ్ళు వస్తే రావచ్చు. Minister ఉద్యోగం చేయడానికి అయినా School final pass కానక్కర్లేదు. అందుచేత B. A. pass అయినవాడు వస్తాడు అనడం అది ఒక జవాబు కాదు. వారియొక్క కోరికలు మనం సానుభూతితో ఆలోచించాలి. ఉత్తరం యిచ్చే Post man కు 70 రూపాయలు Central Government ఇస్తూవుంటే గ్రామాధికారి అని పేరు పెట్టి అనేక పనులు అతని మీద రుద్దుతూ బొత్తిగా 20, 23 రూపాయలు జీతం ఇస్తూ ఉంటే "అయ్యా మాకు ఇది చాలదు. ఎక్కువ చేయండి" అంటే అందులో తప్పేమి ఉన్నది? పాలక వర్గంలో ఉన్న వారికిది చాల సబబుగా కనపడుతోందా ? అడిగితే చిరాకు అడగకపోతే పరాకు; అయితే ఏలాగు ఈ ప్రభుత్వము తోటి ? Land Revenue వసూలుచేసేవారే వారయ్యారు. వారులేనిదే అసలు పని జరుగనే జరుగదు. ఇటువంటి చిన్న ఉద్యోగస్థులతో విరోధపడి వారియొక్క కోరికను సానుభూతితో విచారించకుండా "ఈ demand మాకు కావాలి, వారితో విరోధంగా ఉన్నాసరే, జగన్నాధ రథంలా ప్రభుత్వం నడవకపోతుందా !" అంటే అది చాలా పొరబాటు అభిప్రాయం. వారి కోరికలను సానుభూతితో విచారించాలని మనవి చేస్తున్నాను. "ఆర్థికపరిస్థితి బాగుపడ్డ తరువాత చూస్తాము. మాకు మాత్రం సానుభూతి తక్కువగా ఉన్నదా ! మేము అనుకొంటూనే ఉన్నాము. జీతం ఎక్కువ చేయాలనే సానుభూతి మాకు ఉన్నది" అని అంటే ఇది వట్టి సవతి తల్లి ప్రేమ క్రింద కనపడుతోందే గాని అంతకంటే అందులో నిజాయితీ ఏమి కనబడటం లేదు. ఆర్థిక పరిస్థితి బాగున్న తరువాత చూస్తామంటే ఎప్పుడూ ఆర్థిక పరిస్థితి బాగుగలేనట్లు ఉంటూనే ఉన్నది. ప్రభుత్వం అంటే సంసారం లాంటిదే. ఒకప్పుడు గబుక్కున ఐశ్వర్యం వచ్చిపడిపోతుందా ఏమిటి ? ఉన్నదాంట్లో అనేక ఖర్చులు ఏలా పెట్టుతున్నామో అట్లాగే ఇది కూడా చూడుకోవాలి గాని ఎప్పుడో బాగుపడ్డ తర్వాత చూస్తామంటే "కలిగినవాడి గాదె తీసేటప్పటికి లేనివాని ప్రాణం పోయిందట." ప్రభుత్వము యొక్క దృష్టిచూస్తే అవిధంగా కనపడుతుంది. ఎప్పటికి మీరు చూసేది ? ఇప్పుడే సరైన సానుభూతితో వారి కోర్కెలు కూడా మన్నించవలసి ఉంటుంది. Revenue Department కే అన్ని Department ల మీద కొద్దో గొప్పో పెత్తనం

ఉన్నదని చెప్పాను. ఇప్పుడు Harijan Welfare Officer గారు ఉన్నారనుకోండి. ఆయనకు Department ఉన్నది. స్థలాలు హరిజనులకు ఇవ్వబోయినట్లయితే పని అంతా Revenue Department ద్వారానే జరగాలి. 8 ఏండ్లు 10 ఏండ్లు నుంచి స్థలాలు ఇవ్వకుండా ఆలస్యంచేస్తున్న కేసులు నేనెరుగుదును. ఆఖరికి sanction అయిపోయిందని మా కందరికిచెప్పి ఇంక నేడో, రేపో రాళ్లు పాతేస్తారనే timeకు "వైకుంఠపాళిలో ఆఖరుగడిలోని పెద్దపాము ముందుకు వచ్చినట్లు" ఎవరో గ్రామంలో పెద్దరైతు "దీనిమీద చిన్నమనోవర్తిహామి ఉన్నదనో లేక Geologist వచ్చి దీనిలో minesఉన్నాయని చెప్పారు, కాబట్టి ఈ భూమి కాదు పక్కభూమి ఇవ్వండనో, అడ్డుపెడితె మళ్లీ మొదటినుంచీ వెళ్లవలసి వస్తుంది. ఇలాగ 8 ఏళ్ళు, 10 ఏళ్ళు ఆలస్యమై పోతుంటే ఈ ప్రభుత్వం అంటే ఏమిసానుభూతి గౌరవము ఉంటుందో చెప్పండి. ఏదైన ఒక land ను acquire చేయాలంటే ఎన్ని ఆటంకాలు ఉన్నాయో లెక్క లేదు. ఇవన్నీ నవ రణ చేయాలి. లేకపోతె దానివల్ల అపారమైనటువంటి ఆలస్యం అయిపోతుంది. పంచాయతీ బోర్డ్సుకు 12½% ఇవ్వాలని ఇదివరకు చట్టంలో ఉన్నది. Act ఉన్నప్పటికీ ఇవ్వలేదు అని దావాలు వస్తాయేమోనని కర్నూలు అసెంబ్లీలో ఆ చట్టం రద్దు పరచారు. ప్రతిచోట పంచాయతీ బోర్డ్సును create చేస్తున్నారు. "సన్యాసి పెళ్లికి జుట్టుదగ్గరనుంచి ఎరువు" అన్నట్లుగా వాటికి పెన్సిలులేదు, కాగితం ముక్క లేదు. ఏమి లేనిదే వెంటనే sanction చేయక ఆలస్యం చేయ డానికి కారణం ఏమిటి ? ఇంత అలసత్వం, ఇంత అశ్రద్ధ, ఇంత అజాగ్రత్త ప్రభుత్వంలో పెట్టుకొని మాకు 5 కోట్లు కావాలి grant చేసేయండి అంటే, ఎలా ? అందుచేత ఈ demand ను ఆమోదించడానికి ఎంతమాత్రం వీలులేదు.

కమ్యూనిస్టులు ఊరికే పేదప్రజానీకం, బీద ప్రజానీకం, అని చెపుతూ ఉంటారని చెబుతూ , నిజమైనసేవ మేమే చేస్తున్నామని చెపుతూ ఉంటారు కాంగ్రెసువాళ్ళు. నేనెరుగుదును స్వయంగా. ఒక ఉదహారణ చెబుతాను. పెద్దాపురంకు రెండుమైళ్ళ దూరంలో వడ్లమూరు అనే ఊరు ఉన్నది. అక్కడ 150 సంవత్సరాలనుంచి, పెద్దాపురం సంస్థానం పోయినప్పటినుంచి, సాగుబడిలేని చెరువు ఒకటి ఉన్నది. రామరాజు చెరువు అని అంటారు, అది పేరుకుమట్టుకే చెరువు. అది హరిజనులు దున్నుకుంటూ ఉంటే ఈ సంవత్సరం ఎంత పెనాల్టీ వేశారో రెవెన్యూమంత్రిగారి దృష్టికితెస్తే ఆయన ఆశ్చర్యపోతా రేమోనని నాకు భయంగా ఉన్నది. 3 వేల రూపాయలు పెనాల్టీ వేశారు. కాళ్లవేళ్ల బడి బ్రతిమాలితే సగం తగ్గించారు. అయితే 1500 మాత్రం ఇచ్చు కోగలరా ? ఈ విధంగా ప్రభుత్వంలో అనేక లోపాలు ఉంటే Revenue Department లో ఈ Demand Grant చేయడం ఎలా కుదురుతుంది ?

జమిందార్లకు compensation నిమిత్తం 20 లక్షలో అంతకుపైగానో, మరి ఎంతో చెల్లించాలని ఉన్నది. ప్రభుత్వం డబ్బులేదు, లేదు అని అంటూ ఉంటుంది. పొదుపు ఉద్యమానికి దేశంలో పెద్ద ప్రాముఖ్యం ఇస్తున్నారు. నెహ్రూగారు పెద్దయింట్లోంచి చిన్నయింట్లోకి వెళ్ళారట. అలాగే కేంద్ర మంత్రులు, కొంతమంది M. P లు. M. L. A. లు 100 కి 10 తగ్గించు కొన్నారు. ఈ విధంగా పొదుపుఉద్యమం అని పెట్టారుగదా? జమిందారులకు ఇచ్చే compensation పూర్తిగా ఎగ్గొట్టనక్కరలేదు. కాని కొన్నాళ్ళు వాయిదా వేయడమో, లేకపోతే అందాకా 25% ఇచ్చి మిగతాది దేశానికి, ప్రజానీకానికి ఉపయోగమైన పనులకొరకు ఎందుకు ఖర్చుపెట్టకూడదు? జమిందారులు అంటే ప్రభుత్వానికి ఎంతో పెద్ద అభిమానం లేకపోయినట్లయితే ఈవిధంగా మార్పు చేయక పోవడానికి కారణం ఏమిటి? 15, 20 రోజుల క్రితం loan float చేయడానికి ప్రయత్నించేసినట్లు, దానికి కేంద్రప్రభుత్వం అడ్డుపెట్టబట్టి అది ఆగిపోయినట్లు పత్రికలలోచదివాను. నిజమెంతో, అబద్ధ మెంతో నాకుతెలియదు. ఈ విధంగా Deficit Budget తో డబ్బులేదని అను కుంటున్నపుడు డబ్బు రాబట్టడానికి దేశహితైక కార్యాలకు ఖర్చుపెట్టడానికి తగిన అవకాశం ఉన్నప్పుడు తగినట్లుగా వినియోగించుకోకపోతే ప్రభుత్వం యొక్క లోపం అవుతుందిగాని ఇంకేమి కాదు.

District Administration లోకి వచ్చినట్లయితే, కలెక్టరుగారికి P. A. లు అనేకమంది. మామూలుగా ఒక P. A. అక్కడఉన్న Head Quarters Deputy Collector ఒక P. A. District Board Special Officer ఒక P. A., ఇలా అనేక మంది P. A. లు ఉన్నారు. S. D. M. దగ్గరకువస్తే Criminal work లో relief ఇవ్వడంకోసమని P. As అనండి, Colleagues అనండి, Criminal work కు వారుకూడా సహాయకారులుగా ఉన్నారు. తాసిల్దారు దగ్గరకువస్తే ఆయనకు 5, 6 P. A. లు ఉన్నారు. Head Quarters Assistant Tahsildar, Assignment Tahsildar, Inams Tahsildar, Deputy Tahsildar, Elections Deputy Tahsildar, వగైరా ఎంతోమంది ఉన్నారు. ఇన్నిరకాలుగా ఉద్యోగాలు పెరిగి పోయినప్పటికినీ, కాగితంపడేస్తె దానికి జవాబే రాకుండావున్నది. "తెల్లారిన పొద్దు చింతలదగ్గరేఉంది" అన్నట్టు కాగితం ఎప్పుడు పడేసినా అది అలాగే ఉంటుంది. దానికి జవాబుకొరకు ఎదురుచూస్తే అతీగతీ లేకుండాఉన్నది. ఇలాగ ఉద్యోగస్థులు పెరిగిపోతున్నారు. Revenue Department అపారంగా పెరిగి పోతున్నకొద్దీ, ఆలస్యంకూడా విశేషంగా పెరిగి పోతున్నది. ఈవిషయాలు రివెన్యూ మంత్రిగారు మనస్సులో గుర్తుపెట్టుకొని Paper disposals లో ఆలస్యాలులేకుండా చూసేటట్లయితే చాలా బాగుంటుందని నామనవి. ఇంతే కాకుండా Tenancy Act administration ఒకటి ఇచ్చారు. ఆ Act Pass

అయ్యేటప్పుడుకూడా మాపార్టీవారు వారికి ఇవ్వవద్దని వ్యతిరేకించారు. మాకు Civil Law తెలియదని రివెన్యూ ఆఫీసరే చెప్పుతున్నారు. దీనిలో 50 ఎకరాలు, 100 ఎకరాలకు సంబంధించిన సమస్య ఉంటుంది. ఎవరి పక్షం తీర్పు అన్యాయంగా వచ్చినా వారికి శాశ్వతమైన అపకారం జరుగుతుంది, దీనిపై అధికారం ఒక్క Deputy Collector గారికే ఉన్నది. అది final. ఇక Supreme Court కూడా question చేయడానికి వీలులేదు వారికి law తెలియదు అని వారే public గా చెప్పుతున్నారు. 'As far as possible the Provisions of the C. P. C. will apply' అని rules లో ఉన్నది. Civil Procedure Code లోని నిబంధనలను కూడా apply చేయాలని ఒక Receiver Petition పెట్టాలన్నట్లయితే Receiver అంటే ఏమిటో మాకు తెలియదు. ఇది apply అవుతుందో లేదో మాకు తెలియదు. మమ్మల్ని bluff చేస్తున్నారని మా మీద తిరగబడతారు. వారికి తెలియదు. మేము చెబితే bluff చేస్తున్నామని మా మీద కోపం. పైగా June 15 వ తేదీ లోపలనే పూర్తి చేయవలసిందని Collector గారి దగ్గరనుంచి orders వచ్చాయి. June 15 వ తేదీ లోపలనే ఎలా పూర్తి అవుతుంది? June 10వ తేదీనో, 12వ తేదీనో petition పెట్టామనుకోండి. అవతలవాళ్ళకు notice వెళ్ళాలిగదా. Counter పడేయటానికి కూడా వీలు లేకుండా వాయిదా దగ్గరకు వస్తూ ఉంటుంది. అందుచేత మనిషిని పిలిచేటప్పటికల్లా అతను హాజరు కాకపోతే, 5 నిముషాలు ముందైనా సరే గడియారం త్రిప్పేసి defaulter అని చెప్పి case ను dismiss చేయడం జరుగుతున్నది. ఇవా వారు చేసే disposals? ఇలాగ అనేకచోట్ల అన్యాయాలు జరుగుతున్నాయి. ఇటువంటివన్నీ ఉండగా Revenue Demand ఇన్నికోట్లకు pass చేయడంలో సబబు లేదు. వీటన్నింటికీ వారు తగిన హామీ ఇచ్చినట్లయితే అప్పుడు ఆలోచించవచ్చని మనవి చేస్తున్నాను.

శ్రీ యం. యస్. రాజలింగం (బెల్లంపెర్ల) : అధ్యక్షా, భూసంస్కరణల విషయంలో పలువురుమిత్రులు పలువిషయాలు చెప్పారు. ఈ రోజున భూసంస్కరణలు జరగాలా ; వద్దా అనిగాని, లేకపోతే, ceiling పెట్టాలా, వద్దా అని గాని, కౌలుదారులకు సరైనటువంటి రక్షణ యివ్వడమా; లేదాఅ నేటటువంటి అంశములమీద గాని ఎవ్వరికీ ఏమీ భేదాభిప్రాయాలులేవు. కాని ఈ పరిస్థితులలో ఒక్క విషయాన్ని మాత్రం ప్రభుత్వం దృష్టిలోఉంచుకోవాలని నేను కోరుతున్నాను. భూసంస్కరణలు అనేకచోట్ల కేవలం ఆర్థికసౌష్టవాన్ని కూర్చి ఒక ఆర్థిక విధానాన్ని నిర్ణయించడంకోసమే కాకుండా రాజకీయమైనటువంటి ఒత్తిడివల్ల, లేక రాజకీయమైనటువంటి considerations వల్ల కూడా కొన్ని కొన్నిచోట్ల వచ్చాయి. ఆ రోజులలో ఆ దృష్టిలో రావడానికి పరిస్థితులు ప్రోత్సహించాయా; లేక అవసర ముంటెనా అనే వివాదంలోకి నేను ఇప్పుడు

వెళ్ళదలచుకోలేదు. ఈ వేళ ఉన్నటువంటి శాంతి వాతావరణంలో, మనం ఏప్పటికైనా ఆర్థికంగా పటుత్వమైన విధానాన్ని నిర్మించాలనే పద్ధతిలోనే భూసంస్కరణల విషయం ఆలోచించే అవకాశంమాత్రం కల్గిందని మనవి చేస్తున్నాను.

మేము హైదరాబాదులో భూసంస్కరణలు పెట్టినప్పుడుకూడా కాస్తో, కూస్తో రాజకీయమైన వాతావరణ ప్రభావం దానిమీద పడకపోలేదు. ఈ వేళ కూడ దానిమీద రాజకీయ ప్రభావం పడినా, మనం కనీసం ఆర్థిక దృక్పథాన్ని పునాటగా చూచి, మన విధానాలను మార్చుకొనే వాతావరణంలో ఉన్నాము. అందువల్ల ఈ విషయం జాగ్రత్తగా ఆలోచించాలని నేను కోరుతున్నాను. దీనికి మరొక కారణంకూడా ఉన్నది. భూసంస్కరణలు పెట్టినప్పటినుంచీ, మాకు అనేకచోట్ల కొత్తకొత్త అనుభవాలు వచ్చాయి. ఇప్పుడు నాకు అట్టే time లేదు. కాబట్టిఅవన్నీ చెప్పదలచుకోలేదు. కాని ఒక ముఖ్యవిషయం చెబుతాను. కౌలు దార్లకు రక్షణ యివ్వాలన్నాము. అట్లానే ములుగులో కౌలుదార్లకు రక్షణ ఇచ్చాము. Protected tenants గా declare చేశాము. భూములు అమ్ముకొనే అధికారంలేదని చెప్పాము. మేము రక్షణ ఇచ్చినతరువాత ఎవరికైతే రక్షణ యిచ్చామో అతను ఈ వేళ అక్కడ ఉంటున్నాడా ; భూమి అతనిచేతిలో ఉన్నదా ; దానిని ఎవరు అనుభవిస్తున్నారు ; record లో ఏమి ఉన్నది ; వాస్తవంగా ఏమి ఉన్నది, అనే విషయాల నన్నింటినీ ఆలోచించవలసిన అవసరం ఉన్నది. ఇది ఒక అనుభవము.

ఖమ్మంజిల్లాలో కౌలుదార్లను పట్టేదారులుగా declare చేసినది ప్రభుత్వం. ప్రభుత్వంయొక్క యంత్రాంగానికి, మన సిద్ధాంతాలకూ, చాలా బలంఇచ్చింది అక్కడి కౌలుదారుల ఉద్యమం. ములుగు తాలూకాకు భిన్నమైన అనుభవం ఖమ్మంజిల్లాలో కనబడినది.

మిరియాలగూడ, దేవరకొండ తాలూకాల విషయం పరిశీలించినట్లయితే అక్కడకూడా మరొకక్రొత్త అనుభవం కల్గినది. అక్కడ నందికొండ ప్రాజెక్టు వచ్చినకారణంగా ఇదివరకు ప్రభుత్వం ఎవరికి భూములు ఇచ్చినదో, వారంతా "మాకు ఈ భూములు అక్కరలేదు. Wage earnings లో మాకు చాలా అవకాశాలు దొరుకుతున్నాయి. మేము అట్టిపనులు చేసుకుంటాము. మీభూములు మీరు తీసుకోండి" అని Original గా వారికి ఎవరిచ్చారో వారికి ఇస్తామంటూన్నారు. ఇటువంటి అనేక అనుభవాలున్నాయి. ఈ అనుభవాలనన్నింటినీ పురస్కరించుకొని, భూ సంస్కరణలను పొందుపరచడంలో జాగ్రత పడాలని మనవి చేస్తున్నాను.

రాజకీయ పార్టీల దృక్పథాలలో కూడా చాలా తేడావచ్చింది. మేము భూ సంస్కరణలను చేసేటప్పుడు average న 18 ఎకరాలకంటె ఎక్కువ

ఉండకుండా ఉంటే. మంచిదని, రు. 3,600 సగటు ఆదాయం అనే basis మీద calculate చేశాము. ఆంధ్రలో ఎలక్షనులకు నేను అనంతపురంజిల్లాలో పర్యటన చేస్తున్న సమయంలో ఇక్కడ కమ్యూనిష్టు పార్టీవారు 16 ఎకరాలు ఎక్కువ అని వాదించిన పరిస్థితులలో వారి manifesto ప్రకారం నాకు జ్ఞాపకం వున్నంత వరకు 20 ఎకరాలు ఉండాలి అని అన్నారు. మేము నిర్ణయించిన 16 ఎకరాలు నిజామాబాదులో ఉండే తరి భూమిని standard గా తీసుకొన్నాము. బహుశా, ఆ భూములు కృష్ణా, గోదావరి జిల్లాలలోని భూములతో సరిసమానంగా తులతూగ వచ్చు. మాకంటె Progressive Parties అనుకోవే వాటిల్లో వే మేము reforms పెట్టిన తరువాత ఒక మార్పువచ్చింది. మధ్యతరగతి ప్రజలు వారి వెంట తిరగడానికి, ఎలక్షన్సులో Tactical approach కోసం యిటువంటి మార్పు చేశారా ? లేకపోతే కమ్యూనిస్టులు నిజంగా తమకు వచ్చిన అనుభవాలను పురస్కరించుకొని 20 అనే figure కు వచ్చారా ? అనేది ప్రశ్న.

ఈవేళ కూడా వారి కార్యకలాపాలలో భూసంస్కరణలు ఉండనే ఉన్నాయి. అయితే ఆ స్వరూపం ఎట్లా ఉంటుంది ? ఈవిధంగా రాజకీయ పార్టీల యొక్క దృక్పథం standards నియమించడంలో తేడా వచ్చింది. ఇందువల్లనే reforms తీసుకువచ్చేప్పుడు ఒక సమగ్రమైన దృక్పథాన్ని ఉంచుకొని పనిచేస్తే బాగుంటుంది అని చెబుతున్నాను. ఈవేళ మనం reforms పెట్టుతున్నాము. భూసంస్కరణలను తీసుకురావడం జరుగుతున్నది. ఇందులో కౌలుదారులకు రక్షణ యివ్వడమే ప్రధానమైన దృక్పథంగాదు. Produce కూడా పెరుగుతుందని మనం ఊహించాము. పట్టేదారుడు తన భూమి విషయంలో శ్రద్ధలేకపోవచ్చు. తను ఆ భూమిని కౌలుకు యిచ్చి, దానిని పిత్రా పిప్పిచేయడానికి ప్రయత్నంచేస్తున్నాడనే వాదం మేము సంస్కరణలు చేసేటప్పుడు మా ముందరికి రాకపోలేదు. కౌలుదారుకు భూమి యిచ్చేటప్పుడు కూడా కనీసం పట్టాదారు దూరాన ఉండి, తనస్వంత పేవ్యంతో పెట్టుబడి పెట్టి ఎంత ఉత్పత్తిచేస్తున్నాడో అంతమట్టుకు కౌలుదారు పెట్టుబడి పెట్టకపోయినప్పటికీ తన labour ను ఉపయోగించి, ఉత్పత్తిచేస్తున్నాడా లేదా అనేది చూడాలి. కౌలుదారు యొక్క labour అనే conception basical గా, యీ సంస్కరణలలో ఉన్నదంటున్నాను. అందుకనే పట్టాదారుచేయించే వేల రూపాయల labour కౌలుదారు చేయకపోవచ్చు. అతడు తన భూమికానందున ఎంతశ్రమ save చేయగల్గుతున్నాడో లేక వళ్ళు వంచి పని చేయకపోయినాడో కనీసం అంతమట్టు కైన భూమి తనదైన తరువాత ఆ శ్రమతో పనిచేస్తున్నాడా లేదా, దాని result, production లో ఏ విధంగా మనకు కనిపిస్తున్నదనే point కూడా కొంచెం ఆలోచించాలంటున్నాను. Ultimate గా కౌలుదారుకు భూమి ఉండాలా? ఎవరికి భూమి ఉండాలనేది ప్రధానం కాదు. అసలు మనదేశం యొక్క ఉత్పత్తి, దేశం యొక్క fundamental economy, land economy పొష్టవమైన

పునాది మీద ఉన్నాయా, ఉండుకున్నటువంటి విధానాలేమి అనేదికూడా మనం ఆలోచించవలసిన అవసరం ఉన్నది. నేను ఈ points అన్నీ raise చేస్తున్నాను కాన భూ సంస్కరణలను వాయిదా వేయమని కోరుతున్నట్లుగా మిత్రులు అనుకోవద్దు. మేము ఇదివరకు reforms పెట్టిన కారణంగా Planning Commission ద్వారానూ, Congress Platforms మీదా కొన్నింటికి మేము commit అయిఉన్నాము. వాటికి భిన్నంగా retrogressive step వేయవలచుకోవేదు.

కాని ఈవిషయా లన్నింటినీసమగ్రంగా ఆలోచించి ఒకరిపోర్టును అసెంబ్లీ ముందుకు తీసుకువచ్చినట్లయితే మనం తీసుకురాబోయే సమగ్రమైన చట్టాలకు helpful గా ఉంటాయి. దానికి ఒక Committee of experts ను వేయాలి. లేకపోతే various shades of opinions and groups కలిగి ఉండే మెంబర్లతో ఒకకమిటీ వేసి, ఒకరిపోర్టును తయారుచేయనివ్వాలి, ఇవన్నీ తిరిగిఆలోచించాలి. ఒక రిపోర్టును అసెంబ్లీ ముందుకు తీసుకురావాలి. ప్రభుత్వంవారు కమిటీ వేసి గాని, లేకపోతే మరేవిధంగా నైనా అట్టి అవకాశం కలుగచేయాలని కోరుతున్నాను. Planning Commission వారే ఈపని చేయాలని నా మనస్సులో ఉన్నది. అప్పుడే 7 సంవత్సరములు అయిపోయినవి. Land reforms యొక్క conception, implementation కు వారికిసరైన equipment ఉందా, జరిగినంత వరకూ సరిగా జరిగిందా, లేదా అనేదికూడా తేల్చుకోవలసిన అవసరం వచ్చిందనుకొంటున్నాను. దీనిని శ్రీ వెంకటర్వాపుగారు దృష్టిలో పెట్టుకోవాలని మనవిచేస్తున్నాను.

మైనర్ యిరిగేషన్ స్కీముల విషయంలో 200 ఎకరములదాకా ఆయకట్టుగల tanks రిపేర్సు ఆంధ్రలో కలక్టరుల అధికారంలో ఉన్నాయి. ఇక్కడ 10 ఎకరాలవరకే ఉన్నాయి. ఈనాడు uniformity drive ఆంధ్ర ప్రభుత్వంలో అగుపడుతున్నది, కాబట్టి ఆ wave లోనే తొందరపడి కలక్టరులకు ఆవ్యవహారం నప్పగించవద్దని మనవి చేస్తున్నాను. ఆ case ఇదివరకు examine చేయబడినది. Lack of technical personnel ఉన్నది. ఆ సూత్రాన్ననుసరించి ఈ 200 ఎకరాలను తీసుకువచ్చి కలక్టరుగారి అధికారంలో ఉండేటట్లు provision చేస్తే ముందుముందు చిక్కులు వస్తాయని మనవిచేస్తున్నాను.

ఈనాడు భారతప్రభుత్వ ప్రోత్సాహంవల్ల గాని, లేక ఉద్దేశపూర్వకంగా గానివoluntary contribution scheme అనేది ఉన్నది. దానినింకా ఉధృతంగా నడపాలని నేను కోరుతున్నాను. నేను డిప్యూటీ మినిస్టరుగా ఉండేటప్పుడు ఆ స్కీమునుప్రోత్సహించాము, ప్రతి మంత్రికూడా ఈవిధంగా నిర్ణయించుకొని చేసినట్లయితే State Revenue సంవత్సరానికి లక్షరూపాయలకంటె పెరుగుతుందని నానమ్మకం. ఇది నా అనుభవంవల్లతెల్సినది. మంత్రులను ఎవరైనావచ్చి ఆహ్వానించి నట్లయితే మూల్యం ఏదో ఒకరూపంలో ప్రజలచేత voluntary contribution ద్వారా చేయించాలి. అట్లా చేయించగల్గే(ఆహ్వానంమీదనైతే)Ministers

ఊరు కదలాలి. లేకపోతే కదలకూడదు. మంత్రులు తమపనిమీద వెళ్లడానికీ ఏదైనా inspection కు వెళ్ళడానికి ఎవరూ ఆటంకపరచరు. ఈ voluntary contribution, Education Department, Medical Department లలో అనేకచోట్ల చేయించవచ్చు. నా హయాంలో నామట్టుకు నేను 2 లేక 3 లక్షల additional revenue రాబట్టగలిగాను. అందువల్ల ఏదైనా general rule గా వర్తింపచేసినట్లయితే austerity drive కు తోడ్పడుతుందని మనవి చేస్తున్నాను. ఇది P. W. D. వ్యవహారమే కాదు Revenue Department కు కూడా సంబంధం ఉన్నది. Revenue Department కు కూడాసంబంధించివుండేటట్లు ఇదివరకు frame చేసినvoluntary contribution scheme rules లో ఉన్నవి. ఇందులో Collectors కు కూడ కొన్ని powers ఉన్నాయి. అందువల్లనే ఈ subject ఇక్కడ తీసుకువచ్చి చెప్పటం జరుగుతోంది. పై విధంగా ఏదైనా పెద్దపెద్ద విషయాలలో చేస్తే మంచిదిగాని, చిన్న చిన్న salary cuts మొదలైన వాటిని నేనుఅంగీకరించే పరిస్థితిలో లేను. అయితే, పైగా ఇవన్నీ emotional acts అవుతాయి. Emotional acts కానిపక్షంలో వెనకాల ఆస్థిని కొంచెం helpful గా పెట్టుకొనిచేసినట్లు అవుతుంది. కాని ప్రతివారు honesty చూపించి చేసే వ్యవహారంమాత్రం యిది కాదని చెబుతున్నాను. ఆ విధంగా నేను feel అవుతున్నాను. లేకపోతే కేరళలోవలె జీతాలు తక్కువ తీసికొని allowances ఎక్కువ తీసికొనే పరిస్థితి కూడా వస్తే రావచ్చు. అది వుందో లేదో నాకు తెలియదు. అట్లా జరగకూడదని నేను మనవిచేస్తున్నాను. రెవిన్యూ ఆఫీసరులు అంటే కొన్ని తాలూకాలలోనూ, జిల్లాలలోనూ ప్రజలు భయంతో ఉన్నారు. కనీసం ఆ fear ను తీసివేయవలసినదని నేను వెంకటరావుగారిని కోరుతున్నాను. అప్పుడే common man కు justice దొరుకుతుంది. Applications కూడా receive చేయని ఘట్టాలు కొన్ని ఉన్నాయి.

ఒక వ్యక్తి వచ్చి చెప్పి application యిచ్చినా కూడా receive చేయని ఘట్టాలున్నాయి. ఇటువంటి విషయాలు కొన్ని ఇదివరకు వ్యక్తిగతంగా విన్నవించాను. నా సూచనలు అమలుజరిగేపక్షంలో చాలా లాభకరంగా ఉంటుందని మనవిచేస్తూ విరమిస్తున్నాను.

*శ్రీ యన్. వెంకయ్య (అద్దంకి): అధ్యక్షా, ఇదివరకు మదరాసు రాష్ట్రంలో తమప్రతిభ, శక్తిసామర్థ్యాలు రాష్ట్రమంతటా వ్యాప్తిచెందేలాగున రివెన్యూ మంత్రిపదవిని నిర్వహించి అనుభవము, వివరణాశక్తిగల వారైన శ్రీ వెంకటరావుగారికి నా అభినందనలు. కాని వారుఅప్పుడప్పుడు వెక్కిరిస్తూ ఉంటారు, అందుకుమాత్రం నా అభినందనలు అర్పించడంలేదు. వారిసమయంలో యిదివరకు కొన్ని సమస్యలు పరిష్కరింపబడ్డాయి, యింకా కొన్ని ఉద్భవింప బడినవి. అవి రాజకీయబాధితులకు భూములివ్వడం, జమీందారీ సమస్యలులాంటివి.

జమీందారీ విషయంలో ముఖ్యంగా జమీందారీ చెరువులు, మరమ్మత్తులు లేక తెగిపోయి, నిరుపయోగదశలో నున్నప్పుడు, జమీందారీ బకాయిలు

వసూలుచేసి వాటి మరమ్మతుకు వినియోగించమని, వారిని ఆంధ్రరాష్ట్ర జమీన్ రైతు సంఘ అధ్యక్షుడుగా అనేకసార్లు కలుసుకున్నాను. 2, 3 సం॥లో పూర్తిమరమ్మతులు చేస్తామని వారుచెప్పారు. 10 సం॥లు దాటినా నేటికీకూడా జమీందారీ చెరువుల మరమ్మతు జరగలేదు. కనుక ఈఆర్థిక సంవత్సరంలోవుగా నైనా ఆచెరువుల మరమ్మతు పూర్తిచేయిస్తారని ఆశిస్తున్నాను. తరువాత కంచెలు, పుల్లరి పట్టాలు యిటువంటివి జమీందారీ విధానంలో ఉన్నవి. అవి reserve భూములుగా మార్చబడుతున్నవి. పశుగ్రాసమునకు ఉపయోగపడు తున్నవి. ఈరోజున ఆ హక్కులు తొలగింపబడుతున్నందువలన అక్కడిప్రజలు అనేకవిధాలుగా బాధపడుతున్నారు. పైగా survey కూడా యింతవరకు పూర్తికాలేదు. ఆ survey లోకూడా బంజరు భూములు, ఆధీన భూముల వ్యవహారాలలో అనేక పేచీలు ఉన్నవి. అవన్నీ జాగ్రత్తగా పరిశీలించి వెంటనే పరిష్కరిస్తారని ఆశిస్తున్నాను. అనేకచోట్ల పంచాయితీ cess ల Registration Fees వెంటనే పంచాయితీ బోర్డుల నిధులలో జమకట్టబడడం లేదు. దరఖాస్తులు కలెక్టర్లకు యింకా పైకివెళ్ళి 2 సం॥లకు పైగా దాటినతరువాత ఆ మొత్తాలు పంచాయితీ Boards లో జమకట్టబడుతున్నాయి.

సాధారణంగా ఆస్తి certificates వ్యవహారాల్లోకూడా తహశీల్దార్లు certificates యివ్వాలి. ముందు మునసబు certify చేస్తేనేగాని తహశీల్దారు certificate ఇవ్వరు. కాని వారికి స్వంతంగా తెలిసినదానిమీద యివ్వరు. ఇది తహశీల్దారు వరకు వచ్చేదానికన్నా, Revenue Inspectors Certificates యిస్తే, తహశీల్దార్లకు చాలావరకు పనితగ్గే అవకాశముంది. అందువల్ల ఈ సూచనను ఆచరణలో పెట్టేందుకు ప్రయత్నిస్తారని ఆశిస్తున్నాను.

ఈనాడు Departmental ఖర్చులు విపరీతంగా పెరిగిపోతున్నాయి. ఉద్యోగుల సంఖ్యకూడా పెరుగుతున్నది. ఇంకా చాలదన్నట్లుగా ఆంధ్ర దేశంలో Commissioners లేకపోయినా తెలంగాణాలో Revenue Commissioners ఉన్నారు. ఈ Revenue Commissioners యింతమంది అవసరమా? Revenue Board విషయాలు సక్రమంగా పరిష్కారమవుతున్నప్పుడు యింకా Post Office Business ఎందుకు ? అందుచేత Commissioners అనే ఉద్యోగులు త్వరలోనే ఇక్కడకూడా తొలగింపబడతారని ఆశిస్తున్నాను.

రెవిన్యూ మంత్రి (శ్రీ కె. వెంకటరావు) : Commissioners అనే ఉద్యోగులు ఎక్కడా లేరు. ఇంకొక విషయము గురించి చెప్పవచ్చు.

శ్రీ యస్. వెంకయ్య : ఇక్కడకూడా Regional Officers వున్నారని అనుకుంటున్నాము. మొత్తంమీద హెచ్చు జీతాలు ఉద్యోగులు ఉన్నారనే విషయంమాత్రం స్పష్టం. దాదాపు 2 వేల రూ॥ల జీతాలు మించిన వారు ఉన్నారు. సం.నికి 24,30 వేల రూ.లు జీతవంగా యిస్తున్నప్పుడు, సాధార

ణంగా చిన్నచిన్న ఆర్థిక సార్వభౌములు సృష్టింపబడడం సహజం. కాని రైతులు మొదలగువారికి ఏ 3 వేలో, 4 వేలో పరిమితి చేయాలంటున్న ఈరోజుల్లో, తమ ఉద్యోగులకు మాత్రం 20 వేలు 30 వేలు యిచ్చి ఆర్థిక సార్వభౌములుగా సృష్టించి దేశంమీదవదలడం అనేది ఆర్థిక సమానత్వానికి దారితీయదు. అందువల్ల ఉద్యోగుల వేతనాలను వెయ్యి రూపాయల వరకు తగ్గించడానికి ప్రయత్నిస్తారని ఆశిస్తున్నాను. లేనియెడల తరతరాలుగా ఎన్నో హక్కులు అనుభవాలు కలిగి తమ ఆస్తులను డబ్బురూపంగాను యితర రూపాలుగా కూడా లావాదేవీలు ఏర్పరచుకున్న రైతులు కేవలం తమ ఆదాయన్ని పరిమితం చేయడానికి ఒప్పుకోవడం చాలా కష్టం. అడగటానికి కూడా మనకు హక్కు ఉండదని మనవి చేస్తున్నాను. తమ క్రింద ఉన్న ఎక్కువ జీతాల ఉద్యోగుల విషయంలో జీతాలు తగ్గించడానికి ప్రభుత్వం ఎందుకు సంశయిస్తున్నదో నాకు తెలియడం లేదు. ఒకవేళ సంవత్సరానికి 12 వేలు అయినా లేకపోతే వారు గడుపుకోలేరు అన్నట్లయితే క్రింది తరగతి ఉద్యోగులు తక్కువ జీతాలతో తమ జీవితావసరాలను తీర్చుకోగలరా ? ఈ విషయాన్ని గూడా ఆలోచించవలసి యున్నది. కనుక రాష్ట్ర ప్రభుత్వం Central Government తో ఈ విషయంలో వారి అనుమతిని కోరి వెంటనే వేతనాలు తగ్గించే ప్రయత్నం చేస్తారని ఆశిస్తున్నాను. ఈ వేతనాలను తగ్గించిన తరువాతనే మనం ఏ విషయమైనా ఆలోచించడానికి అవకాశం ఉంటుంది.

ఈనాడు భూసంస్కరణలు భూసంస్కరణలు అనే ఒక ఆందోళనా ధోరణి ప్రతి ఒక్కరిలోను కనబడుతున్నది. కాని ఆ భూ సంస్కరణాల వల్ల ఏమే ఫలితాలు ఆశించారో ఎవరైనా పరిశీలించారా ? ఆ ఆశయాలు సఫలీకృతమైనవా ? లేక విఫలమైనవా ? భూసంస్కరణలు అమలుపరచిన ఖమ్మం జిల్లా ఈ రాష్ట్రంలోనే ఉన్నది. అక్కడ అధికోత్పత్తికి ఈ భూసంస్కరణలు తోడ్పడినవా ? ఇటువంటి విషయాలన్నీ పూర్తిగా పరిశీలన చేశారా ? చేయకపోతే ఈ సంస్కరణలు తీసుకవచ్చేముందు తమ ఆశయాలు సమగ్రమయ్యేట్లు ఒక Bill ను తయారుచేసి, చట్టంగా అమల్లోకి తీసుకవస్తే బాగుంటుంది అనుకుంటాను. అందుకు వెంటనే ఒక విచారణ Committee ని ఖమ్మం జిల్లాకు పంపించి ఆ సంస్కరణలు అక్కడ ఏవిధంగా అమలు జరుగుతున్నాయి; చట్టంలో ఏమైనా ఆటంకాలు కలుగుతున్నాయా, అధికోత్పత్తికి ఆ సంస్కరణలు ఎంతవరకు తోడ్పడ్డాయి; ప్రణాళిక ఆశయాలు ఎంతవరకు సఫలీకృతం కావడానికి అక్కడ అవకాశం దొరికింది ; ఈ విషయాలన్నీ పరిశీలించి తమ ఆలోచనలను ఒక సమగ్రమైన రూపానికి తీసుకువస్తారని ఆశిస్తున్నాను.

***Sri H. Ramalinga Reddi (Alur) :*** Mr Speaker, Sir, during the two days' debate on this demand there is much discussion about land

reforms. But we have not reached any final conclusion in the matter. The only two objectives in imposing a ceiling is to increase production and to do social justice, social justice in the sense of distribution of landed property to remove glaring disparities. Regarding social justice, Rs. 300 per family per month has been proposed by the Planning Commission. It is a very meagre sum.

*Sri K. Venkata Rao :* Sir, the Hon. Member may note that in Chapter IX of the Second Five-Year Plan no particular figure has been suggested for a ceiling; the Planning Commission only suggested certain considerations. The consideration of Rs. 300/- per month or Rs. 3,600 per year as a ceiling amount is borne out only by the Hyderabad Tenancy Act.

*Sri H. Ramalinga Reddi :* As proposed in the Hyderabad Tenancy Act, Rs. 300 per family of 5 persons is a very meagre sum in my opinion. Out of this amount, a family of 5 members has got to feed and clothe itself, and meet education and medical expenses in addition to marriage expenses and to discharge other worldly obligations This sum is very meagre. A highly cultured family in a village will be reduced to the level of a hawker or a peon. As against this there is no limit for property to be possessed by people in urban areas; they can own; they can possess property worth crores of rupees. This is really a strange contrast of social justice between the people in urban and rural areas.

With regard to production, briefly I may state that in America in the olden days 85 per cent of the people were living on agriculture and only 15 per cent of the people were dependents on industries; then the entire 85 per cent of the population was producing just enough food for all the people. Now, only 13 per cent of the population is depending on agriculture and they are able to produce enough food not only to maintain the entire population of America, but also export millions of tons. This goes against small peasant farming capable of increasing production. The small peasants lack the wherewithal to make any permanent improvements to agricultural land and produce more. We can just examine what has happened in Russia also. In Russia big farms were reduced to small peasant farms and those peasant farms became the consuming centres rather than producing centres; the alternative was, all the small peasant farms were converted into big farms again and worked on collective basis. Collective farming is not possible in a democratic country like India. But we have been forced by the Union Government to impose ceilings; this is a directive from the Union Government; if we follow the directive, it is going to whittle down provincial autonomy. Therefore, we must impress on the members of the Planning Commission that after imposition of ceilings in the State land that will be available for distribution among the landless people will be inadequate;

So, there is an imperative necessity on the part of this Government to impress on the Planning Commission not to impose ceilings. Adjustment in the relations between tenant and landlord is the only necessity in our country because land reform is not going to solve unemployment problem either and the land that is available now is under the direct cultivation by some families of land lords and some by tenants. Distribution of land to so many people, creating many small peasants, is not going to solve the unemployment problem also. So, in any way the main problem with regard to land reform is the readjustment of relations between the tenant and the land lord.

Then, Sir, I wish to speak a few words on District Administration. After the reorganisation of the States, the people of Kurnool district have been looking forward for reorganisation of their district also. Kurnool district has become very large and unwieldy; for administrative convenience the district should be dismembered and a new district formed. In this regard representations have been made, memoranda have been submitted to this Government, but no action seems to have been taken till now. At present, in Kurnool there are, one District Judge's Court, one Additional District Judge's Court and a Sub Court in addition to the Munsiff's Court. We have been asking this Government, and particularly the people from Adoni and Alur taluks, to locate another Sub Court at Adoni for the convenience of people of Alur, Adoni and Pattikonda taluks. At Adoni there was an Additional Sub Court sanctioned and it was there till the end of November, 1954 and afterwards that Court also was abolished. The people of these taluks find it very hard and inconvenient to go to Kurnool, because Kurnool district now extends from Markapur to Tungabhadra river—a distance of about 250 miles. Therefore, Sir, there is an imperative and urgent necessity to create a separate district comprising of Dronachalam, Alur and Adoni taluks of the present Kurnool district and Rayadurg and Gooty taluks of the present Anantapur district.

We have been asked to make some proposals for taxation to cover the budget. Some friends have been telling that commercial crops may be taxed. But commercial crops in dry areas depend on monsoon, and every alternate year, commercial crops are a failure in Rayalaseema. There is no assured income from commercial crops. My suggestion, therefore, will be to increase the land revenue. That is a permanent thing. If you double it, we will get another six crores. Now, our income from land revenue is about 6 crores and if we double it, we get 12 crores, which will cover the budget gap very easily. That is the easiest way. It does not depend on rains and it will be a permanent collection.

With regard to police administration in the Districts, lawlessness is prevailing in Kurnool District. People are being murdered

on high streets and people are being shot down in public hotels. The rule of jungle seems to be prevailing there and the rule of law has gone to the wilderness. This is mostly due to the inefficiency of the police there. The police should be supplied with jeeps— they are not supplied with jeeps— so that they could reach any corner of the village in no time and then they will be able to control the crime in the country.

Thank you Sir, for the indulgence shown to me.

శ్రీ బి. నరసింహారెడ్డి (సూర్యాపేట జనరల్) : అధ్యక్షా, ఈ రోజున నాకు ఉన్న పది నిమిషాల సమయంలో ముఖ్యంగా నా నియోజక వర్గములోను, తరువాత మాజిల్లాలో ఉన్నటువంటి ఇతర నియోజక వర్గములలోను, ఈ భూసమస్యలు వీటికి సంబంధించి కలిగినటువంటి అనుభవాలు ఈ సభవారి యెదుట పెట్ట దలచాను. అందులో ఈ రోజున భూసంస్కరణలు అనేటటువంటిది సర్వసాధారణంగా అందరికి ఆమోదకరమైన విషయముగా తయారైంది. ఇటీవలనే మన ప్రధాని పండిట్ నెహ్రూ రాష్ట్ర ముఖ్యమంత్రుల సమావేశంలో కాబోలు, భూసంస్కరణలు సకాలంలో అమలు జరపనందుకు, ఈ విషయములో మంత్రి వర్గముల యొక్క విఫలతను గురించి ప్రత్యేకంగా హెచ్చరించారు. ఈనాడు భూసంస్కరణలు చాలా ప్రముఖస్థానాన్ని వహించినవి. నిజంగా ఇది భూసంస్కరణల యుగమని మాటవరుసకు చెలామణి అవుతూయున్నది. ఈ దృష్టితోనే, బంచిరాయల సమస్యగాని, కౌలుదార్ల సమస్యగాని రాష్ట్ర ప్రభుత్వాలు అర్థంచేసుకొంటాయని సహజంగా ఆశిస్తున్నాము. ఇటీవల ముఖ్యమంత్రిగారు మాట్లాడుతూ, నిన్న రెవిన్యూ మంత్రిగారు మాట్లాడుతూ, అనేకలాది ఎకరాల బంజరు భూములను ఇదివరకే పంచిపెట్టామని, ఇకముందు కూడా పంచిపెట్టదలచామని సెలవిచ్చారు. భూసంస్కరణలో రైతుల హక్కులను రక్షించడం అనేది ముఖ్యమైన భాగముగా ఉంటున్నదనే విషయము వారు స్పష్టముగా సెలవిచ్చారు. అటువంటప్పుడు నేను ఒక విషయము మనవి చేయదలచినాను, మా తాలూకా యొక్క అనుభవాన్ని చూడమని ప్రత్యేకంగా మంత్రిగారిని కోరుతున్నాను. మా తాలూకాలో ముఖ్యంగా ఇదివరకు సిఫార్సు చేయబడిన ముఖ్యమైన కేంద్రాలన్నిటిలో కూడా, గత అయిదు సంవత్సరాలుగా కాంగ్రెస్ కమిటీ, కమ్యూనిస్టు కమిటీ సిఫార్సు చేసినటువంటి బంచరాయి భూములు ఉన్నాయి.

శ్రీ కె. వెంకటరావు : దయచేసి ఆ తాలూకా, జిల్లా ఏవో చెప్పితే సంతోషిస్తాను. నాకింకా identification తెలియడం లేదు. అందుకని అడుగుతున్నాను.

శ్రీ బి. నరసింహారెడ్డి : మాది సూర్యాపేట తాలూకా, సూర్యాపేట నియోజకవర్గములో లావుని కమిటీ సిఫార్సు చేసినటువంటి బంచరాయి భూము

అన్నిటికిని వెంటనే పట్టాలు ఇవ్వకూడదని తాశీల్దారుకు ఒక గస్తీ జారీఅయింది. ఈవిధంగా ఒక కొత్తగస్తీ జారీఅయినట్లుగా తాశీల్దారు ఆఫీసులో తెలుసుకొన్నాను, హుజూరునగర్ తాలూకాలో ఉండేటటువంటి 1100 కేసులు, మిరియాలగూడెం తాలూకాలోఉన్నటువంటి 1100 కేసులు, కూడా గత అయిదు సంవత్సరాలుగా సేద్యంలో ఉన్నటువంటి కేసులు, చాలా reasonable కేసులని భావించబడినవి సేద్యంకాకుండా ఆపబడుతున్నాయనే విషయం మంత్రిగారి దృష్టికి ప్రత్యేకంగా ఈ సందర్భంలో తీసుకురాదలచాను. ఈనాడు ఒక్కొక్క తాలూకాలో దాదాపు 5 వేలు, 6 వేలు ఎకరాలు బంచరాయి భూమి ఉన్నది. ఇదంతాకూడా నిజంగా పట్టాచేయవలసిన భూమి. కాని ఈనాడు అటువంటిదేమి జరగడంలేదు. నాగార్జునసాగర్ సమస్యకూడా ఈసందర్భంలో తీసుకువచ్చారు. హుజూరునగర్ తాలూకాగాని, మిరియాలగూడెం తాలూకాగాని, ఏతాలూకా తీసుకొన్నప్పటికీకూడ, అక్కడ most reasonable cases అనబడేవి, లావునీ కమిటీ సూచించిన కేసులు, ఆభూములు నాగార్జునసాగర్ మునుగుడు గ్రామాలకుఇవ్వాలి అనేసమస్యఒకటి ముందుకు తీసుకువస్తున్నారు. కాని ఈవిషయం మంత్రిగారికి తెలియదా అని నేను అడుగవలసివస్తుంది. ఎందుకంటె, నాగార్జునసాగర్ మునుగుడు గ్రామాలకు ఈభూములు ఇవ్వాలన్నప్పుడు, దానిప్రక్కనే పెద్దపెద్ద భూస్వాములు, దొరలు ఉన్నారు. బాబాసాహెబ్ పేట దేశ్‌ముఖ్ ఉన్నాడు, ఆయనచేతిలో వందలు, వేలు ఎకరాలు భూమిఉన్నది. అట్లాగె, ఆప్రక్కన మల్లారం దొరఉన్నాడు. ఇటువంటి దొరలు, దేశ్‌ముఖ్‌లు అనేక మంది ఉన్నారు. వారి భూములు గనుక సంస్కరణప్రకారం కొంత పంచిపెట్టినా లేక ఇతర విధాల సర్దుబాటుచేసినా, లేక అక్కడ forest లో సాగుకు లాయకయ్యే భూములను వారికి ఇచ్చినా, ఆసమస్య 10, 15 మైళ్ళలోనె పరిష్కారమవుతుంది. అటువంటి 20, 30 మైళ్ళ ప్రాంతములో సంవత్సరాలుగా సేద్యం అవుతున్నటువంటి, ప్రభుత్వముగా కాంగ్రెస్ నాయకులు, ఇతర పెద్దలుకూడా పంచిపెట్టినటువంటి బంచరాయి భూములనుకూడ ఎందుకు ఆపారని నేను వారిని ప్రశ్నిస్తున్నాను. అయితే ఈసందర్భములో బంచరాయిఅన్నపుడు ఈగస్తీనిబట్టి ఒకకొత్త slogan అక్కడ కనబడుతుంది. నూటికి పదివంతులనే పాత slogan నే గట్టిగా సమర్థించినట్లు ఇందులో స్పష్టంగా కనబడుతూఉంది. నేను ఒక విషయంమాత్రం ప్రభుత్వం వారి దృష్టికి తీసుకురాదలచినాను. మనము ప్రజాస్వామికంగా భూసంస్కరణలను తీసుకురాదలచినప్పుడు బంజరు భూములను మేము పంచిపెట్టాము, పంచిపెడతాము అని ముఖ్యమంత్రిగారు అంటున్నప్పుడు most reasonable cases లో గత అయిదుసంవత్సరాలుగా సేద్యంలో ఉన్నటువంటి భూములను ఎందుకు ఆపవలసివచ్చిందని నేను అడుగుతున్నాను. ఈ 10 percent అనే నినాదం పాత నిజాంకాలపు నినాదం అనే విషయం ప్రభుత్వంవారికి తెలియదా? ఈనాడు

10 percent అనేది unreal slogan అనికూడా నేను స్పష్టంగా సభవారిముందు పెట్టదలచాను. ఈనాడు మొత్తం తెలంగాణాప్రాంతము చూచుకొంటే, చాలా తక్కువ గ్రామాలలో 10 percent బంచరాయి ఉన్నదనే విషయం మంత్రిగారు ప్రత్యేకంగా గమనించాలని నేను మనవిచేస్తున్నాను. ఈనాడు ఎక్కువ గ్రామాలలో సేద్యం చాలా మించిపోయింది. ఈ సేద్యం మించిపోవడమనేది ఒక అసాధ్యమైన విషయంకాదు. సామాజికాభివృద్ధికి ఒక సహజమైన పరిణామంగానే సేద్యం అభివృద్ధిఅవుతున్నట్లు తెలుస్తున్నది. స్వయంగా అందరికి అనుభవము ఉన్నటువంటి ఆంధ్రప్రాంతములో ఆ యా చోట్ల ఏవిధంగా అయితే పూర్వము ఉన్నటువంటి అడవులన్నీ కొట్టి సేద్యంచేశారో, ఆవిధంగానే ఇక్కడ తెలంగాణా రైతాంగము తమ శక్తి కొద్ది భూమి సేద్యంచేస్తున్నారు. దానివలన ఈవేళ సమాజానికి గాని, రైతాంగానికి గాని, ప్రభుత్వానికి గాని వచ్చినటువంటి నష్టమేమీలేదు. పైగా ఆదాయం పెరిగింది, ఉత్పత్తి కూడా పెరిగింది. అందువల్ల పాతకాలపు 10 percent అనే నినాదం ఈనాడు కూడా పట్టుకు వేలాడుతూ, రైతాంగం యొక్క సేద్యం గాని, ఉత్పత్తి గాని కుంటుపరచకూడదని, పైగా భూసంస్కరణలు అమలుజరుపుతున్నటువంటి ఈ యుగంలో సేద్యం యొక్క అభివృద్ధికి, ఉత్పత్తి యొక్క అభివృద్ధికి ఇది ఆటంకకర నినాదం అవుతుందని నేను మనవిచేయదలచాను. బూర్గుల ప్రభుత్వము కూడ ఈ విషయం ఒకవిధంగా ఒప్పుకొన్నది. ఒకకాలములో నూటికి 10 వంతులు అనేది strict గా అమలుపరచినప్పటికీ తరువాత పదివంతులకు తక్కువగా ఉన్నప్పటికీ హరిజనులైనట్లయితే సేద్యానికి ఇవ్వవచ్చునని, అది గనుక తరి సేద్యం అయినట్లయితే దానికికూడా పట్టాఇవ్వవచ్చునని బూర్గులప్రభుత్వము అంగీకరించింది. ఆ కనీస సత్యాన్నికూడా ఈ సందర్భములో గుర్తించకుండా పూర్తిగా చరిత్ర గమనాన్ని నిరోధించడానికి పూనుకోవద్దని ప్రభుత్వానికి మనవిచేస్తున్నాను. ఈనాడు ఇటువంటి slogan తీసుకురావడంఅంటే నల్లగొండ జిల్లాలో 50 వేల ఎకరాలకు పైగా సేద్యాన్ని ఆపడం అన్నమాట. ఈవిధంగా 50 వేల ఎకరాల సేద్యాన్ని ఆపుతూఉన్నప్పుడు, ఇక కొత్తగా తెచ్చే సంస్కరణలు ఏమి ఉంటాయో గమనించవలసిందని నేను ఈ సభవారిని ఈ సందర్భంలో కోరుతున్నాను. తరువాత భూసంస్కరణలలో రైతుల హక్కుల యొక్క రక్షణ ముఖ్యమైనటువంటిదని నిన్ననే మంత్రిగారు సెలవిచ్చారు, అటువంటప్పుడు కౌలుదారీచట్టం pass అయి ఎంతోకాలం ఐనప్పటికీ, అది ఆచరణలో సరిగా అమలు జరగడంలేదు. నా నియోజకవర్గంలో అసలు జాగీరు రద్దు చట్టము వచ్చి ఈనాటికి ౮,౯ సంవత్సరములైంది. కొత్తగూడెంలో సీతారామారావు అనేటటువంటి ఒక దేశ్‌ముఖ్ ఉన్నాడు. ఆయనకు ఒక మక్తాభూమి ఉన్నది. ఈనాడు అతడు బేదఖలుచేసి రెండువందల ఎకరాలు స్వంత కమతంలో ఉంచుకోగలిగాడు. ప్రభుత్వము దానిని ఇదివరకు నిరోధించలేకపోయింది.

అట్లాగే మిరియాలగూడెంతాలూకా ఉన్నది. అక్కడ పెద్దదేవులపల్లి దేశ్‌ముఖ్ ఉన్నాడు. అక్కడ ఉన్నటువంటి భూముల విషయం కూడా చూద్దాము. అక్కడ ఈనాడు 60 వేల ఎకరాలకు పైగా ఉన్నటువంటి భూమిలో దాదాపు 20 మంది రైతుల కుటుంబాలు బేదఖలు అయ్యాయి. ఆ రైతులు దరఖాస్తు పెట్టారు. ఆ విషయం ఇదివరకు పరిష్కారంచేయలేదు. ఆ ఫిర్యాదులు ఇంకా **pending** గా ఉన్నాయి.

ఇటువంటి చట్టాలు **House** ముందు చెయ్యవచ్చును, కాని రైతులవిషయములో అవి అంత శ్రద్ధగా అమలు జరుపబడుటలేదు. శిస్తు వసూలుచేయు విషయములో భూస్వాములు పునస్వాధీనము చేసికొనుటకు, ఆ స్వాధీనహక్కు మురుదతు దాటిపోయిన తరువాత దానిని పొడిగించుటకు ప్రభుత్వము ఎంత శ్రద్ధ తీసికొంటుందో అంతశ్రద్ధ, చట్టరీత్యా రైతులకు హక్కులు అమలు జరుపుటలో తీసుకొనుచున్నట్లు మా అనుభవములో కనబడుటలేదు. జమిందారీ రద్దుచట్టము వచ్చి దాదాపు 5 సం॥ లైనది. ఇంతవఱకు ఎక్కువభాగము **settlement** జరుగలేదు. సర్వే జరుగలేదు, శిస్తులు మారలేదు. మిన్వాయిగూడ యింతవరకు జరగలేదు. ఈ పరిస్థితులిట్టులుండగా మనము భూసంస్కరణలు తేవాలంటున్నాం. తేనందుకు ప్రధానిగారుగూడ విమర్శిస్తున్నారు. అటువంటప్పుడు కనీసం జమిందారీ రద్దు చట్టాన్ననుసరించి గాని, కౌలుదారీ చట్టాన్ననుసరించిగాని రైతులకు సక్రమంగా హక్కులు సంక్రమింప జేయుటలేదు. వందలు, వేల ఎకరాలనుంచి బేదఖళ్ళు అవుతున్నాయి. ఇటువంటివి జరుగుతున్నప్పుడు, ప్రభుత్వము తెస్తామన్న భూసంస్కరణలకు ఏమివిలువ ఉంటుంది. ఈ పరిస్థితులను బట్టి భూసంస్కరణలయొక్క స్వభావము గూడ ఎట్లాఉంటుందో మేము అర్థము చేసికొనగలము. భూసంస్కరణలు తెస్తాము, తెస్తాము అని చెప్పుట మే గాని విపరీతమైన జాగు జరుగుతున్నది. భూసంస్కరణలు సక్రమముగా తెచ్చి, నిజమైన **spirit** తో అమలుపర్చ దలచుకొన్నపుడు, ఇప్పుడు బంచెరాయి స్వేచ్ఛములో నున్నవాటికి పట్టాలు ఇవ్వాలి. బేదఖలు నిరోధ ఆర్డినెన్స్ వెంటనే తీసుకురావాలి. కౌలుదారుల హక్కులు సక్రమంగా సంక్రమింపజేయ గలిగినపుడే ప్రభుత్వముతెచ్చే భూ సం స్క ర ణ ల ఆశయం సార్థకమవుతుందని నా అభిప్రాయం.

శ్రీ పి. మహేంద్రనాథ్ (నాగరకర్నూల్-రిజర్వుడు) : అధ్యక్షా ! గౌరవనీయులగు రెవిన్యూ మంత్రిగారిచే ప్రతిపాదించబడిన డిమాండ్సును బలపరుస్తూ కొన్ని సూచనలను ఇవ్వదలచుకొన్నాను. రెవిన్యూ పద్దుక్రింద రెవిన్యూ ఆఫీసర్స్ ఛార్జి అని, **village offiicers** ఛార్జి అని కొన్ని వివరాలు ఉన్నవి. రెవిన్యూ ఆఫీసర్సు గురించి ఇంతవరకు ఎన్నో చర్చలు జరిగినాయి. మా తెలంగాణాలో వతందారీ పద్ధతి అమలులో నున్నది. తరతరాలనుంచి ఒకరే ఉంటూ వారి

సంతతివారే పటేలు, పట్వారీలుగా ఉండటము జరుగుతున్నది. ఈ పద్ధతి వలన అనేక లోపాలు జరుగుతున్నవి. ఈ పద్ధతిని మార్చుటకు కనీసము 4 లేక 5 వేల జనాభా కలిగిన గ్రామము గాని, లేక కొన్ని గ్రామాలు గాని కలిపి ఒక గ్రూపుగా చేసి ఆ గ్రూపుకు ఒక Village Officer ను ఏర్పాటు చేసి ఇప్పుడు ఉన్న పోలీసు పటేల్, మాలీ పటేల్, పట్వారీలను రద్దుచేయుట ఉచితము. ఆ విధంగా వేసే రెవిన్యూ ఆఫీసరును 3rd grade clerk కు యిచ్చే స్కేలు మీద వేస్తే దానివల్ల ఎడ్మినిస్ట్రేషన్‌కు కూడా మేలు అవుతుంది.

రెండవ డిమాండులో జమిందారులకు నష్టపరిహారమనేది ఉన్నది. ఈ జమిందారీ రద్దుచట్టం లో ఏ కారణమువల్లనో సర్వీసు ఈనాము భూములనేవి exempt చేయబడినవి. అది సరియైనది కాదు. మా తెలంగాణాలో కూడ బలవత్తా (బలూతా) ఈనాములు ఉన్నవి.

శ్రీ కె. వెంకటరావు :- అవి abolish చేశాము.

శ్రీ పి. మహేంద్రనాథ్ :- తెలంగాణాలో abolish కాలేదు. దానివల్ల సర్వీసు ఈనామ్సు ఉన్నవి అని ఒక వైపు వెట్టి, బేగారి abolish అయినప్పటికి కొన్ని గ్రామాలలో నిర్బంధముగా వెట్టీలు చేయించబడుతున్నాయి. భూసంస్కరణలు తేవాలని ప్రభుత్వము ఆలోచిస్తున్నప్పుడు తెలంగాణాలో కూడ ఆంధ్రలో ఉన్న పద్ధతిని అనువర్తింప జేయవలెనని నేను సూచిస్తున్నాను.

జిల్లాలలో పరిపాలనను గురించి చాల మంది సభ్యులు చెప్పియున్నారు. ప్రభుత్వ యంత్రాంగములో చాల లోపాలు ఉన్నవి. మహబూబ్ నగర్ జిల్లాలో నాకు తెలిసినంతవరకు కొంత వ్యక్తిగత పద్ధతిని అధికారులు అనుసరిస్తున్నారు. అది సరియైనది కాదు. Common justice కావాలంటే ఏ వ్యక్తికి లోబడక ప్రభుత్వ చట్టాలు అమలుపరచబడాలి. మంత్రులు ఈ లోపమును సవరించే ఏర్పాటు చేస్తారని మనవి చేస్తున్నాను.

గాయిరాన్, పోరంబోకుల విషయము సభ్యులు ప్రభుత్వ దృష్టికి తెచ్చారు. మహబూబ్ నగర్ జిల్లాలో కనీసము 30, 40 వేల ఎకరాలు హరిజనులు తదితర భూమిలేని రైతుల చేతులలో ఉన్నవి. ఈ House లో తెలుపబడిన circular ప్రకారము అమలు జరిగితే హరిజనులు తదితర బీద రైతులు ఆ భూములనుంచి విడుదల అయి ఆందోళన వచ్చే సూచనలున్నవి. 1950 నుంచి వరుసగా 55 వరకు ఈ రకంగా అనేక సర్క్యులర్స్ రెవిన్యూ డిపార్టుమెంట్ నుంచి జారీచేయబడ్డాయి. అంతిమదశలో 1955 లో ఇచ్చిన circular ద్వారా regularise చేసి నూటికి 10 వ వంతు తక్కువ ఉన్నా భూమి హరిజనులు భూమి లేని ఇతర రైతులు, కనీసము 1954 నుంచి ఆ భూమిపై కబ్జా కలిగి ఉంటే వారిని తొలగించరాదని పట్టా ఇవ్వవలెనని ఆదేశించబడినది. దాని వసూలించి

లావుని కమిటీలనుంచి శిఫార్సులు చేయబడినవి. కాని తహశీల్దారులు సమయము లేదని కలెక్టరుకు సిఫార్సులు పంపనందున కొన్ని గ్రామములలో పట్టాలు ఇవ్వ లేదు. కొందఱికి పట్టాలు వచ్చాయి. Tahsildar పొరపాటువల్ల సిఫార్సులు కలెక్టరుకు పంపకపోవడమువల్ల, ఈ గస్తీ రావడంవల్ల వారంతా ఆ భూముల నుంచి నిరోధింపబడటము జరిగినది. ఈ గస్తీని వెంటనే రద్దుపరచి ఇంతకు ముందు అమలులో ఉన్న circular 14 యథాప్రకారముగా restore చేయాలని మంత్రిగారికి సూచిస్తున్నాను.

గ్రామాలలో కనీసము 100 కి 10 వంతులు ప్రభుత్వ భూములు లేకపోతే పశువులకు మేతవసతి ఇబ్బందిగా నున్నదనే విషయము ఆలోచించాలి. ఆటవిక శాస్త్రజ్ఞులు, ఇతర శాస్త్రజ్ఞులు వాతావరణం బాగుండాలంటే కనీసము 100 కి 25 వంతుల భూమి పడావా ఉండాలని చెప్తున్నారు. ఐతే ఈ తెలంగాణా గ్రామాలలో 100 కి 5 వంతులు గూడ ఆ విధంగా లేకుండా ఉన్నాయి. ప్రతి గ్రామంలో తప్పనిసరిగా పశువుల మేతకు నూటికి 10 వంతులో, 5 వంతులో పడావా భూమి సమకూర్చాలని నా సలహా. Basic holding అని ఉన్నది. అంతకుమించి భూమియుంటే రూపాయికి నాలుగణాల వంతున నిర్బంధంగా పడావా పెట్టటానికి ప్రభుత్వం ఆర్డర్లు జారీచేయించే విషయం ఆలోచించాలని మనవిచేస్తున్నాను.

ప్రభుత్వ యంత్రాంగంలో, వివాదాలు, తగాయిదాలు, పరిష్కారం చేయుటలో అనవసర ఆలస్యం జరుగుతున్నదని దానికి సెంట్రల్ గవర్నమెంటు నుంచికూడ కొన్ని సూచనలు యివ్వబడ్డాయి. కొన్ని కేసులలో రెండుమూడు సంవత్సరాలవరకు వాదాలు (arguments) విని, తీర్మానాలు వ్రాస్తామని, ఇంతవరకు ఏమీచేయకుండా, ఫైల్సు పడవేసిపెట్టి రెవిన్యూ అధికార్లు ఆందోళన కలిగిస్తున్నారు. ఈ విషయాలు రెవిన్యూ మంత్రిగారి దృష్టికి తేవడ్డాయి. జిల్లాలలో జరుగుతున్న ఈ చెడ్డ ప్రవర్తన అధికారులనుంచి దూరము చేస్తారని మనవిచేస్తూ యింతటితో విరమించుకొంటున్నాను.

శ్రీ డి. కొండయ్య చౌదరి (కందుకూరు) : అధ్యక్షా, ఇప్పుడు ప్రతివారికి కూడ, అన్ని పార్టీలకుకూడ, భూసంస్కరణలు తీసుకొనిరావాలి అనేదిఒక పరిపాటి మాటగా తయారైనది. ఈ భూసంస్కరణల విషయంచెబుతూ సుబ్బారావుగారు అన్నారు; "కాంగ్రెసువారికి ఆశయాలు ఉంటాయిగాని ఆచరణలేదు" అని. ఆశయాలు గబగబగా, బ్రేక్ లెస్ స్పీడ్ లో ఆచరణలో పెట్టి, కొన్ని లక్షల హత్యలు జరిగినతర్వాత తాము చేసింది తప్పని దిద్దుకొని, తిరిగి పాతవిధానాలకు ప్రయత్నించేపరిస్థితిలో కాంగ్రెసుపార్టీ ఉండదని మనవిచేస్తున్నాను. ఎప్పటికైనా క్రమక్రమంగాచేసిన సంస్కరణాలే శాశ్వతంగా ఉంటాయి. త్వరపడిచేసిన పనులు త్వరలోనే ఉపసంహరించబడవలసిన అవసరం ఉన్నదని ఇప్పుడున్న చరిత్రే

రుజువుచేస్తున్నది. భూసంస్కరణల విషయంలో రష్యా, చైనా మొదలైన కమ్యూనిస్టు దేశాలను అనుసరించిన విధానాలు ఎక్కువ ఉత్పత్తికి దోహదం కాలేదనే భావంతో మరల ఉపసంహరింపబడినట్లు మనకు తెలిసియున్నది. రష్యాలోకూడ తిరిగి భూమిని ముక్కలుచేసి, ప్రతివర్కరుకు కాస్తకాస్త భూమిని కేటాయించి దానిద్వారా అధికాహారోత్పత్తిని సాధించటానికి ప్రయత్నాలు జరుగుతున్నవి.

రెండవ విషయం, కో - ఆపరేటివ్ సిస్టమ్ ప్రకారం, భూములు కూడ చిన్న చిన్న కమతాలుచేసి, తరువాత సహకార క్షేత్రాలుగా మార్చాలనేభావం మన ప్రధాని మొదలుకొని, అనేకమందికి ఉన్నది. ఈ మధ్య విదేశాలలో పర్యటించి వచ్చిన కమిటీ చెప్పినప్రకారంగా "సహకార క్షేత్రంలో ఉండే వ్యక్తులకు తగినటువంటి వసతులు కలుగజేయలేదని, యీవ్యవసాయ సహకార క్షేత్రంలో ఉత్పత్తిఎక్కువ కావటంలేదని, దానివల్ల సరైనటువంటి ఆదాయం లభించటం లేదని, మరల చిన్నచిన్న కమతాలుగా విభజించినపక్షంలో ఉత్పత్తి ఎక్కువ కాగలదని వారు తలుస్తున్నారని, అందువల్ల వారు సహకారక్షేత్రాలు వదలిపెట్టి ఇతరపనులు చేసుకొంటున్నారని" పత్రికలలో పడిన సంగతులద్వారా అందరికీతెలిసినవి. కాబట్టి దీనినిబట్టి మనం ఒకటి గమనించాలి. భూసంస్కరణలు త్వరపడి తేకుండా, అనుభవంమీద, మెల్ల మెల్లగా తీసుకురావడం ముఖ్యమని, మనవి చేస్తున్నాను. అందులో భారతదేశంలో ఇది మరీ ముఖ్యమని మనవిచేస్తున్నాను. ఆంధ్రదేశంలో నూటికి 90 మంది వ్యవసాయంమీద ఆధారపడినవారే కాబట్టి, ఇక్కడ మనం తీసుకురాబోయే సంస్కరణలతో, యావత్ ఆంధ్రప్రదేశంలోని ప్రతివాడికి సంబంధం ఉంటుంది. కాబట్టి దూరదృష్టిలేకుండా, అనుభవంలేకుండా త్వరపడి భూసంస్కరణలు తీసుకువస్తే అవి రైతులకు చాలా బాధకలిగిస్తాయి. వీటన్నింటిని ప్రభుత్వం ఆలోచించి క్రమక్రమంగా భూసంస్కరణలు తీసుకు రావలసిన అవసరం ఉన్నదని రెవిన్యూ మంత్రిగారికి మీద్వారా మనవి చేస్తున్నాను.

నేను మంత్రిగారిని మరి ఒక విషయం ప్రార్థిస్తున్నాను. ఈ భూసంస్కరణలు తేవటం ఎక్కడి న్యాయం అని అడుగుతున్నాను. సాంఘిక ఆర్థిక న్యాయాలకొరకు కదా, ఉత్పత్తి ఎక్కువ చేయటానికి అని కదా, మనవారందరూ ఈ భూసంస్కరణలు తేవాలంటున్నారు. కాని, సాంఘిక న్యాయం ఎక్కడ ఉన్నదని అడుగుతున్నాను. మిల్లు యజమానులకు, డాక్టర్సుకు ప్లీడర్సుకు, పెద్ద ఉద్యోగస్తులకు, చివరకు మన మంత్రులకు అందరికీకూడా సంవత్సరానికి 12 వేలు, 14 వేలు ఆదాయం వస్తూంటే వాటిమీద సీలింగ్ లేకుండా రైతుకు ఉండే భూమిమీద, రైతుకు ఉండే ఆదాయంమీద, రైతుకు ఉండే ఆస్తిమీద సీలింగ్ పెట్టడం ఏమి న్యాయమని ప్రశ్నిస్తున్నాను. ఇది సాంఘిక

న్యాయమా, అని అడుగుతున్నాను. ఒక సెక్షన్ ఆఫ్ ది పాపులేషన్‌కు మాత్రం ఒక పరిమితి పెట్టి, మిగతా సెక్షన్ ఆఫ్ ది పాపులేషన్‌కు వాటి ఇష్టంవచ్చినట్లు ఆదాయం సంపాదించు కోవచ్చునని చెప్పటం ఏరకమైన సాంఘికన్యాయం, ఏ కోర్టులో ఇది నచ్చుతుంది, అని నేను అడుగుతున్నాను.

ఇక ఆర్థికన్యాయం అనుసరించి కూడా ఆలోచేస్తే, లక్షల రూపాయలు గడిస్తున్నటువంటి వ్యక్తులు ఉండగా వాళ్ళమీద సీలింగ్ పెట్టకుండా ఏదో కొద్దికొద్దిగా ఆదాయం వస్తున్నవారికి, ప్రస్తుతం ధర అనుసరించి రైతులు కొంచెం వచ్చగా ఉన్నారని, వీరిమీద సీలింగ్ పెడితే, వీళ్ళ పిల్లలకు, వీరి తర తరాల వారికి వచ్చేటటువంటి అవకాశాలన్నీ కుదింప చేయటంతప్ప వేరే లేదని మనవి చేస్తున్నాను. ఎందువల్లనంటే, ఒక డాక్టర్‌కు వెయ్యి రూపాయలు వస్తే, ఆయన కొడుకులందర్నీ బి.ఎ. చదివించుకోవచ్చు, యం. ఎ. చదివించుకోవచ్చు, లేక డాక్టర్ పరీక్షలకు పంపించవచ్చు. కాని ఒక రైతుకు సంవత్సరానికి 3,600 రూపాయలు ఆదాయం వచ్చినపుడు ఏరకంగా అతడు తన బిడ్డల్ని, వారితో సమానమైనటువంటి విద్యాసౌకర్యాలు, వైద్య సౌకర్యాలు ఇతర సాంఘిక సౌకర్యాలు కలుగజేసుకోటానికి అవకాశం ఉంటుందని నేను ప్రశ్నిస్తున్నాను. కావాలని, నిర్బంధంగా, చట్ట రూపంగా వీళ్ళని, వీళ్ళతరాల వారిని ఒక రకంగా కుంచింపజేయటానికి ప్రయత్నించటము తప్పితే వేరుకాదని మనవి చేస్తున్నాను. ప్రభుత్వము భూసంస్కరణలు పెట్టదలచుకొంటే మాకు అభ్యంతరము లేదు. మేము కూడా బలపరుస్తాము. కాని భూసంస్కరణలు పెట్టేటప్పుడు రైతులు కోరేదేమిటంటే, "మాతోపాటు అందరికీ వచ్చే ఆదాయానికి కూడా పరిమితి పెట్టండి" అని. అందరికీ పెట్టినపుడు మాకూ పెడితే మేము ఒప్పుకుంటాముగాని అందరికీ పెట్టకుండా ఒక సెక్షన్‌కు మాత్రమే పెట్టటం ధర్మంకాదు. న్యాయంకాదు. ఇది సాంఘిక న్యాయంకాదు; ఇది సాంఘిక అన్యాయమని నేను మనవి చేస్తున్నాను.

ఇంకో ప్రశ్న అడుగుతున్నాను. నేను ఒక చిన్న భూస్వామిగా ఉండదలచి, నా దగ్గర ఉండే వెయ్యి ఎకరాలభూమిని నా చుట్టప్రక్కలఉండే ఆసాములకు ఉచితంగా పంచిపెట్టాను. బంగారంవంటి భూమిని, ఎర్రకండనేల, వేరుసెనగ పండే మంచినేలను, వెయ్యి ఎకరాలు నేను పంచిపెట్టాను. కాని నేను ఇచ్చిన వారిలో ఏ ఒక్కరైనా యీరోజు ఆభూమిని సాగుబడి చేస్తున్నారా అని అడుగుతున్నాను. అదే ఒక రైతుకు పంచిపెట్టినట్లయితే, దానిని అతడు బాగుచేసుకొని, ఎరువు పెట్టుకొని దాని ఫలితాల్ని పొందిఉండేవాడు. ఈ వ్యవసాయ కూలీలకు పంచిపెడితే ఒక్కరూ సాగుబడిచేసినది లేదు. "కొండయ్య నాయుడుగారు బాగుచేసిన భూమిని" వారు తీసుకొని పండించుకొంటారు గాని, ఎక్కడైనా బంజరుభూమి ఇస్తే, దానిమీద ఎక్కువ ఎరువు

పెట్టి, కష్టపడి, సాగుబడి చేసుకొని, ఎక్కువ ఉత్పత్తి చేసుకోటానికి ప్రయత్నించరు. అటువంటి భూమిని వారు కోరరు. వారికి మంచిభూమి వెయ్యి ఎకరాలిచ్చినా ఉపయోగపెట్టటంలేదు. అనుభవంతో నేను చెబుతున్నాను. వోలేటిపాలెం గ్రామంలో చూపిస్తాను. కావలిస్తే ఏ కమ్యూనిస్టు మెంబరైనా రండి, నేను చూపిస్తాను. నేను వెయ్యిఎకరాల మంచిభూమి పంచిపెట్టాను. గొర్రు (అంటే మూడు ఎకరాలు) 3 వేల రూపాయలు అమ్మే భూమి నేను పంచిపెట్టాను; కాని ఆ భూమిని వ్యవసాయకూలీలు సాగుబడి చేయటంలేదని మనవి చేస్తున్నాను. రైతుకు భూమిమీద ఎటాచ్ మెంట్ ఎక్కువగా ఉంటుంది కాబట్టి, అదే తన జీవనవృత్తిగా, తన వంశపారంపర్యా వచ్చే వృత్తిగా అవలంబిస్తున్నాడు కాబట్టి. అందులో ఎంతోకష్టపడి సాగుబడిచేసుకొని, ఉత్పత్తి పెంచుకోటానికి అతనికి సాధ్యం అవుతుంది. మిగతావారు, వ్యవసాయకూలీలు ఇతరులు బాగుచేసిన భూములు పంచుకొంటారు గాని, బంజరుభూములు వాళ్ళకు పనికిరావు. బంజరుభూములు వాళ్ళకు ఇచ్చినంత మాత్రాన సాగుబడికావు. ఈ భూములు వారికి ఇస్తే సాగుచేసేదిలేదు. వారు ఒకవేళ చేసినా, ఒక సంవత్సరం తర్వాత, అది రెమ్యూనరేటివ్ కాదని వదలి పెట్టి ఇంకోపనిలోకి పోతారు. వాళ్లకు భూమిమీద ఎటాచ్ మెంట్ లేదుకాబట్టి, వారికి భూమి పంచిపెట్టినా ఉపయోగం లేదని మనవిచేస్తున్నాను. భూసంస్కరణలు భారతదేశంలో అన్ని రాష్ట్రాలలోను చేశారని కొందరు చెబుతున్నారు. ఏ రాష్ట్రంలో చేశారు? భారతదేశంలోని పెద్దరాష్ట్రాలలో ఏ ఒక్కదాంట్లోను భూసంస్కరణలు తేబడలేదు. మన భారతదేశంలో పెద్దరాష్ట్రాలైన యు. పి. లో లేదు. బీహార్ లో లేదు. మధ్యప్రదేశ్ లో లేదు. అటువంటి పెద్దరాష్ట్రాలలో లేనటువంటిది ఇప్పుడు మనరాష్ట్రంలో ఎందుకని అడుగుతున్నాను. కాబట్టి నెమ్మదిగా మనకుఉన్న అనుభవాన్ని పురస్కరించుకొని, ఇతర రాష్ట్రాలలోని అనుభవాలను చూసి సంస్కరణలు తెచ్చేదానికి ప్రయత్నించాలిగాని, తొందరపడి సంస్కరణలు తేవటం మంచిది కాదని చెబుతున్నాను.

రైతులు యీరోజు కాంగ్రెసు ప్రభుత్వానికి అండగా ఉన్నారు. రైతులు లేకపోతే ఇతరపార్టీలకు అధికారంలోకి రావటానికి అవకాశం ఉన్నది. అందువల్ల రైతులను ధ్వంసంచేస్తేతప్ప, యీ రైతుల కుటుంబాలను ఆర్థికంగా, సాంఘికంగా నాశనం చేస్తేతప్ప, ప్రభుత్వం స్వాధీనం చేసుకోటానికి సాధ్యం కాదనేవిషయం వారికి పరిపూర్ణంగా తెలుసు. ప్రభుత్వానికి ఆ పార్టీలకు మధ్య రైతు నిలబడిఉన్నాడు. కాబట్టి వీరిని నాశనం చేస్తేతప్ప అధికారం రాదనే ఉద్దేశంతో ప్రతిపక్షాలు చేసినటువంటి వాగ్దానం తప్పితే, ఇందులో సాంఘిక న్యాయం, ధర్మం లేదని మనవిచేస్తున్నాను.

తరువాత విలేజ్ ఆఫీసర్సు విషయం కొంత చెప్పవలసి యున్నది. కమ్యూనిస్టుపార్టీలో ఉండే ప్రముఖులు, లోగడ కాంగ్రెసువారు గెలిచినపుడు "గ్రామాధికారులు వారివెంట ఉన్నారు. గ్రామాధికారులు వారికి సహాయం ఇవ్వబట్టి, వారు గెలుస్తున్నారు. గ్రామాధికారులు లేకపోతే మేము సులభంగా గెలిచేవారమని" మా ప్రాంతంలో ప్రచారం చేసినారు. ఇవాళ చాలా సుదినం. ఎందుకంటే, యీరోజైనా గ్రామాధికారులు చాలా బాధపడుతున్నారని, వాళ్ళు ప్రభుత్వ అండదండలలో లేరని, ప్రభుత్వానికి వారికి మధ్య ఒకరకమైన బాంధవ్యం తగ్గిపోయిందని గమనించటం, పైగా వారినిపోయి ఆప్యాయంగా కౌగలించుకోవటం, వారి తరపున వీరు వాదించటము మంచిదే. ఇది కొంత వరకైనా మామీద వారుచేసిన అపనిందను తొలగించటానికి కారణమవుతుం దని మనవి చేస్తున్నాను. నేను కూడ, ఒక గ్రామాధికారి తమ్ముడినే. నాకూ తెలుసు అన్ని విషయాలు. గ్రామాధికారులు బాధపడుతున్నమాట నిజమే. నేను కాదనను. వారినిగురించి ప్రభుత్వం ఆలోచించవలసిన అవసరమున్నదనే చెబుతున్నాను. ఒకనాడు ఆంధ్ర అసెంబ్లీలో గ్రామాధికారులతో సంబంధం ఉన్నవారు దాదాపు 70, 80 మంది అసెంబ్లీ మెంబర్లు ఉన్నారు. వాళ్ల కాజెస్‌ను ఎడ్వకేట్ చేసేవాళ్ళు, వాళ్ళమీద సింపతీ చూపించేవాళ్ళు 70, 80 మంది ఉన్నారు. కాని వారిమీద యీనాడు ఎందువల్ల సింపతీ తగ్గిపోతోందంటే దానికి ఒకటే కారణం ఉన్నది. వాళ్ళు అరాచకవాదులమాదిరి, అరాచక పార్టీలు చేసేవిధంగా, బెదిరించి సమ్మెలుచేసి, పనులు చేయకుండా ప్రభుత్వాన్ని స్తంభింపచేసి తద్వారా తమకోర్కెలను నెరవేర్చుకోవాలనే ఉద్దేశంతో ఉన్నారు. కాబట్టి యీరోజు గ్రామాధికారులతో సంబంధం ఉండే మెంబర్సుకూడ వారిని సపోర్ట్ చేయలేకుండా ఉన్నారు. ఇంతకు వేచీవచ్చింది ఒక్క ఇంటరమ్ రిలీఫ్ లోనే. అన్నిటికి ఒప్పుకొన్నారు. కమిటీ వేయటానికి ఒప్పుకొన్నారు. కాని ఇంటరమ్ రిలీఫ్ ఇవ్వనంత మాత్రానే వారు సమ్మెచేస్తామని బెదరిస్తున్నారు. కాని నేనడిగేది ఒకటే. అనేక తరాలనుంచి బాధపడుతున్నవారు ౮, ౯ మాసా లలో కమిటీ రిపోర్టు వచ్చేలోపలనే బ్రహ్మాండంగా బాధపడుతున్నట్లు, ప్రాణాలు యిచ్చివేదేపోతున్నట్లు, సమ్మెచేస్తామని చెప్పడంలో ఒక పరమార్థమైన రహస్యం వుందని గమనించాలి. ఈ గ్రామోద్యోగుల సంఘాలకు ప్రస్తుతం కొందరు రాజ కీయ పార్టీలకు సంబంధించినవాళ్ళు **office bearers** గా తయారైనారు. వాళ్ళిచ్చే ప్రోత్సాహంతో యీ రకమైన అర్థరహిత విధానం అవలంబిస్తు న్నారు అని మనవిచేస్తున్నాను. కావలెనంటే చూడండి, ఆంధ్రరాష్ట్ర గ్రామో ద్యోగుల సభలలో **President, Vice-President** గా వుండేవారు గ్రామోద్యో గులు కారు. కాని అంతమాత్రాన గ్రామోద్యోగులు బాధపడడంలేదని గాని గ్రామోద్యోగుల పరిస్థితి చాలా న్యాయంగా వుందనిగాని, సుఖంగా వుందని గాని ఎవరూ అనడంలేదు. కాని ప్రభుత్వ పరిస్థితులు మనకు చెప్పారు. 70 వేల

మందో, 80 వేల మందో గ్రామోద్యోగస్థు లున్నారని నిన్న శ్రీ వెంకటరావు గారు చెప్పారు. N. G. O. లకు యిచ్చినట్లు Interim Relief 6 రూపాయ లిచ్చినా 70 వేల మంది గ్రామోద్యోగులకు యిస్తే ఎన్ని లక్షల రూపాయ లవుతుందో మన ప్రతిపక్షాలవారు గమనించాలి. ఇటువంటి పరిస్థితులలో "ఉన్నా లేకపోయినా, అప్పోసప్పో చేసి పప్పుకూడు పెట్ట" మంటే అది ప్రభుత్వం చేయలేదు. ఎంతమాత్రం లాభంలేదని మనవిచేస్తూ వారు తమ పను లను సక్రమంగా నిర్వహించి ప్రభుత్వంతో సహకరిస్తే తమకు కలిగినటువంటి కష్టాలను తీర్చడానికి ప్రభుత్వం ప్రయత్నించాలని మనవిచేస్తున్నాను. అదేగాక గ్రామోద్యోగుల విషయంలో యిదివరకే సలహా చెప్పాను. మన ప్రతిపక్షాల వారు నవ్వారు. గుంటూరుజిల్లా గ్రామోద్యోగుల మహాసభకు అధ్యక్షత వహించినప్పుడు వాళ్ళు "ఎట్లానూ, డబ్బు యివ్వడానికి వీలులేకపోతే ఎక్క డయినా బంజరు భూములను, ప్రాజెక్టులక్రింద అనాధీనంగా వున్న భూములను వాళ్ళకు యిస్తే సాగుబడి చేసుకుంటాము" అని నాతో స్వయంగా చెప్పారు. ఆ చెప్పినదానినే నేను అసెంబ్లీలో ప్రతిపాదించాను. అప్పుడు మంత్రివర్గం hesitate చేసినది. శ్రీ గోపాలరెడ్డిగారు నవ్వారు. తరువాత వారే దానిని పరి శీలించి "డబ్బుతో వాళ్ళకోర్కెలను తీర్చడానికి వీలులేదు కాబట్టి యీ ప్రతిపా దన ఆలోచించవలసినదే" అన్నారు. అది గమనిస్తూవుండగా గ్రామోద్యోగులు మరల వెనక్కుపోయి 60 రూపాయల జీతం కావాలంటున్నారు. ఈ రకంగా వారు చెప్పింది ఒకటి, చేసినది ఒకటి కావడంవల్ల సరైనటువంటి సహకారం, సానుభూతి యీ సభలో లేకపోతున్నదని మనవిచేస్తున్నాను. జమీందారులకు నష్టపరిహారం యివ్వవలెనని మన ప్రతిపక్ష సభ్యులు ఒప్పుకున్నారు. పెద్ద జమీందారులకు యివ్వకపోతేమానె, చిన్నచిన్న జమీందారులు బాధపడు తున్నారు, వెంటనే వారికి నష్టపరిహారాన్ని యిప్పించడానికి ప్రయత్నం చేయా లని శ్రీ వెంకటరావుగారికి మనవిచేస్తున్నాను. పెద్ద జమీందారులకు నష్టపరి హారం యివ్వడానికి 5 ఏళ్ళు మొదలు ఎనిమిదేళ్ళవరకు పడుతుందన్నారు. వేయి రూపాయలు, 5 వందల రూపాయలు, మూడువేలరూపాయలు, నాలుగు వేల రూపాయలు రావలసిన చిన్నచిన్న జమీందారు లున్నారు. వారు చెప్పి నట్లు 5 సంవత్సరాలు పడితే వైద్యుడు వచ్చేటప్పటికి రోగి ప్రాణంపోయే పరిస్థితి వుంది. వారు బికార్లు మాదిరిగా వీధులలో తిరుగుతున్నారు. అటువంటి చిన్నచిన్న జమీందార్లకు వెంటనే నష్టపరిహారాన్ని యిప్పించే పద్ధతి చూడవల సినదని శ్రీ వెంకటరావుగారిని కోరుతూ యింతటితో సెలవు తీసుకుంటున్నాను.

శ్రీ ఇ. చిన్నప్ప (మహబూబ్‌నగర్) : అధ్యక్షా, ఇప్పుడు రెవిన్యూ క్రింద అభ్యర్థించినటువంటి amount ను అంగీకరిస్తూ కొన్ని విషయాలుమాత్రం మనవిచేయదలచుకున్నాను. నేడు కాంగ్రెసు ధ్యేయం సహకార సామ్యవాద

శ్రేయోరాజ్యం స్థాపించడం అయినప్పుడు రైతు దేశానికి వెన్నెముక అని అందరికీ తెలుసును. రైతుకు సంబంధించిన శాసనాలన్నీ ఎంతో అందంగా కనిపించినప్పటికీ ఆచరణలో సరిగా లేక మధ్యతరగతి రైతులు, చిన్న రైతులు చాలా అవస్థపడుతున్నారు. ఆ సందర్భంలో కొన్ని సూచనలు చేస్తున్నాను. రైతులకు ఎరువులు యిచ్చే నిమిత్తం యీ డిమాండును అంగీకరించవలసినదే. కాని అమ్మోనియం సల్ఫేటు, సూపర్ ఫాస్ఫేటు మొదలయినవి రైతులకు సమయానికి దొరక్కపోవడంచేత వారు ఆహారోత్పత్తి సరిగా చేయలేకుండా వున్నారని ప్రభుత్వానికి తెలుసునుకుంటాను. అందుచేత రైతులకు సకాలంలో యీ ఎరువులను అందించే విషయం ఆలోచించాలి. తరువాత ఎరువులు నిలువ చేసే godown లో పాత stock అయిన paddy mixture ను, super phosphate ను ammonium sulphate ను బలవంతంగా రైతులకు యింటింటికి తిరిగి అంటగట్టడం వల్ల చేలకు రోగాలుపట్టి చెడిపోతున్నాయి అని ప్రభుత్వం గమనించాలి. తరువాత వ్యవసాయశాఖకు సంబంధించిన field workers రైతుల దరఖాస్తులను తీసుకొనిపోయి సిఫార్సుచేసి తహసీలులో పెట్టి ఎంత ప్రయత్నించినప్పటికీ రైతులకు తక్కావీ దొరకడంలేదు. Field workers చెప్పినదానిని బట్టి రైతులు స్వయంగా తహసీలుకు పోయి, లంచాలు యిస్తేగాని తక్కావీ దొరకదట! ఆవిధంగా రైతులు బాధపడుతున్నారు. అందుచేత రైతులకు తక్కావీ సకాలంలో దొరకేటట్లు సౌకర్యం కలుగజేయాలని కోరుతున్నాను. తరువాత జాగీర్దారులకు యివ్వవలసిన నష్టపరిహారపు పద్దును ఆ మోదిస్తూ, వారు ఆ కాలంలో జాతీయసంపదను వశపరచుకొని అనుభవించారనీ, అనుభవించిన తరువాత మన Constitution ప్రకారం కొంత మావిజా యివ్వాలనే సిద్ధాంతాన్ని ఒప్పుకున్నప్పటికీ ఆ మావిజాను కొంత ఆపి, ఆ ద్రవ్యాన్ని యీ బడ్జెటు లోటు పూర్తిచేసుకోవచ్చునని మనవి చేస్తున్నాను. ఆ మావిజాను నాలు గయిదు సంవత్సరాల తరువాత చెల్లించినప్పటికీ జమీందారులకు ఏమీ లోటు కాదు. నష్టంకాదు. మన అభివృద్ధి కార్యక్రమాలకు ఆ ధనాన్ని వాడుకోవచ్చునని నేను సూచిస్తున్నాను. తరువాత సహకార బ్యాంకులు ఆంధ్రలో బాగా వున్నట్లు విన్నాను. ఆంధ్రలో ఒక గ్రామంలో 10 కుటుంబాలుంటే, ఆకుటుంబంలో 10మంది వ్యక్తులుంటే ఆ పదిమందిచేరి పదిపదులు నూరుమంది సభ్యులై సహకార బ్యాంకుల నుండి లాభంపొందుతూ వుంటారు. తెలంగాణా ప్రాంతాలలో కూడా గ్రామీణ పరపతి సంఘాలలో, గ్రామీణ బ్యాంకులలోని procedure వల్ల దాంట్లో అప్పును సాధించాలంటే చాలా కష్టమవుతుంది. ఏదో పెద్ద రైతులు మాత్రమే పోరాడి, అప్పులు సాధించగలుగుతున్నారు గానీ మధ్యతరగతి రైతులు, చిన్నచిన్న రైతులు వాటిని సాధించలేకపోతున్నారు అని సవినయముగా మనవిచేస్తున్నాను. అందుచేత 10 గ్రామాలకు ఒక సహకార సంఘం నెలకొల్పి, వాటిద్వారా కొంత procedure తగ్గించి, తొందరగా

రైతులకు అప్పులు దొరికే అవకాశం కలుగజేయాలని మనవిచేస్తున్నాను. అదే విధంగా నేడు ఎరువుల ఉత్పత్తి చాలా తక్కువయినది. గ్రామాలలో వున్న పేడంతా పిడకలకొరకు నూటికి 25 వంతులు వాడుకొంటున్నారు. ఇది ముఖ్యంగా గమనించవలసిన విషయం.

ఈ రోజున ఒక్కొక్క అమోనియం సల్ఫేటు బస్తా ధర దాదాపు రు. 45లు వరకు పెరిగిపోయినది. పేడ ఎరువుకు కూడా గ్రామాలలో బండి ఒక్కంటికి రు. 3 లు ఇవ్వవలసి వస్తోంది. పేడను పిడకల రూపంలో వాడి, కాల్చి బూడిద చేస్తున్నారు. దానిని ఎరువుగావాడి ఎక్కువ ధాన్యం పండడానికి ఉపయోగించవచ్చును. ఈ విషయమై సభ్యులు రైతులను ప్రోత్సహించడమే కాకుండా ప్రభుత్వం కూడా పేడను పిడకల రూపంలో వాడకుండా సరియైన కట్టుదిట్టాలు చేసి గ్రామాలలో కట్టెలు దొరికే పరిస్థితులు కలుగజేసి పేడను నూటికి నూరు పాళ్ళు ఎరువుగా వాడునట్లు చూడాలని కోరుతున్నాను. కవులుదారులు విషయంలో నైజాం నవాబు కాలంలో ఇస్లాహాత్ సంస్కరణలు వచ్చాయి. తరువాత కాంగ్రెసు రాజ్యంలో కూడా భూసంస్కరణలు వచ్చాయి. అవి భారతదేశంలోని అన్ని రాష్ట్రాలలోకన్న అభ్యుదయకరంగా ఉన్నాయని చెప్పుకున్నాము. చూడడానికి ఈ సంస్కరణలు చాలా అందంగానే ఉన్నాయి. ఆచరణలో మరొక విధంగా ఉన్నవి. భూస్వాములు తమ భూములను పిల్లల పేరిట బంధువుల పేరిట, రేపు పుట్టబోయే పిల్లల పేరిట కూడా విభాగాలు చేయించి రిజిష్టరు చేయించినారు. ఇటువంటి నిదర్శనాలు ఎన్నో ఉన్నాయి. దీని ఫలితంగా ceilingకు మూడింతలు నాలుగింతలు ఉండికూడా తక్కువ ఉన్నట్లు చూపించి కవులుదారులను తొలగించి భూమిని వశపరచుకుంటున్నారు. అందుచేత యీ కౌలుదారీ చట్టం ఏ విధంగా అమలు జరుగుతున్నదో సమగ్రంగ పరిశీలించి సక్రమంగా అమలు జరగడానికి వీలైన చర్యలను, అవసరమైతే సవరణ చట్టాన్ని, తీసుకురావాలని మనవి చేస్తూ ఇంతటితో ముగిస్తున్నాను.

*శ్రీ టి. లక్ష్మీనారాయణరెడ్డి (అనపర్తి): అధ్యక్షా, కందుకూరునుంచి వచ్చినగౌరవసభ్యుడు భూసంస్కరణలను గురించి మాట్లాడారు. ఆశ్చర్యం వేసినది. ఆయన కాంగ్రెసు benches నుంచియేనా మాట్లాడుతున్నారు, ఆయన కాంగ్రెసు మానిఫెస్టో చదివివారా అనేఅనుమానం వేసినది. భూసంస్కరణలను గురించి మనం చాలా ముందుకు పోయాము. మనం commit అయినాము. ప్లానింగు కమిషన్ కూడా ఈవిషయం స్పష్టంగా నిర్దేశించినది. ఇంతదూరం పోయినతరువాత ఈ Clock ను వెనుకకు పెట్టాలని ప్రయత్నించడం వృథా ప్రయాస, జరిగేదికాదని మనవిచేస్తున్నాను. తరువాత రివెన్యూబోర్డు మనకు అవసరమా, కాదా అనే విషయమై చాలాకాలంనుంచి తర్జన భర్జనలు జరుగుతున్నాయి. నా ఉద్దేశంలో మనకు సెక్రటరీలు, డిప్యూటీ సెక్రటరీలు, పెద్ద

సిబ్బందితో పెద్ద సెక్రటేరియట్ ఉండగా, రివెన్యూబోర్డు ఇంత పెద్దసిబ్బందితో ఉంచడం superfluous, waste అనిపిస్తోంది. ఇదివ్యవహారం delay చేయడానికి మాత్రం ఒక కారణం అవుతుంది అనుకుంటున్నాను. ఈ విషయాన్ని మరల ఒకసారి పరిశీలనచేయించి సాధ్యమైనంతవరకు రద్దుచేస్తే red-tapism కొంత వరకైనా తగ్గుతుందేమో అనుకుంటున్నాను. జిల్లా పరిపాలనలో మేజస్ట్రేటు కోర్టులున్నాయి. Separation of judiciary from the Executive అనేది ఎప్పుడో. ఆమోదించబడిన సిద్ధాంతం. అయినప్పటికి తూర్పుగోదావరి, కృష్ణా, గుంటూరు జిల్లాలలో ఇంతవరకు ఈ సంస్కరణను అమలు జరుపకపోవడం ఆశ్చర్యంగా ఉన్నది. రివెన్యూశాఖనుంచి వచ్చిన మేజిస్ట్రేటులకు Law బొత్తిగా తెలియదు. వారు benefit of doubt ఎప్పుడూ పోలీసువారికే ఇస్తారు ; చాలా వరకు hot bed of corruption and inefficiency గా ఉంటున్నది. ఈ జిల్లాలలో కూడా ఎంతత్వరగా అమలుచేస్తే అంతమంచిదని మనవిచేస్తున్నాను. తూర్పు గోదావరి జిల్లాలో localization scheme ఎప్పుడో అమలు జరుపబడినది. ఈమధ్య ధరలు పెరిగిన కారణంగా రైతులు భూమిమీద ఎక్కువశ్రద్ధచూపడం జరుగుతున్నది. వారు ఇదివరలో మెరకగా నిర్దేశించిన ప్రాంతాలను పల్లంగా చేసుకుని సాగుచేసుకుని commandable area క్రిందకుతెచ్చారు. వారు చెరుకు కాని రెండవపంటకాని పండిస్తే పాత localization scheme ప్రకారం వారిపై విపరీతంగా పెనాల్టీలు వేస్తున్నారు, మరల ఈ localization scheme ను పరీక్షచేసి commandable area ను నిర్దేశిస్తే పెనాల్టీలు తగ్గుతాయి; ఎక్కువ ఆహారధాన్యాలు పండడానికి వీలుఉంటుందికనుక దీనినిఆలోచించాలని మంత్రిగారిని కోరుతున్నాను. గోదావరిఆనకట్ట ఉన్నది. రమారమి 100 సంవత్సరాలైనది కట్టి. కృష్ణా ఆనకట్టకు వచ్చిన ప్రమాదం మనకుగుర్తుఉన్నది. అదృష్టవశాత్తు ఆడెల్టా పాడైపోకుండా రక్షించబడినది. ఇటువంటిది గోదావరి ఆనకట్టకువస్తే విపరీతమైన నష్టంవస్తుంది. కనుక ఒకప్రవీణుల సంఘాన్ని పంపి ఆనకట్ట పటుత్వాన్ని పరీక్షచేయిస్తే అటువంటి ప్రమాదానికి దారితీయకుండా ఉంటుందని అనుకుంటున్నాను. ఇపుడు ఆనకట్ట Shutters 3 అడుగులు మాత్రమే ఉన్నాయి. వీటిని 6 అడుగులకు పెంచి ఎక్కువనీరు సప్లైచేసే విషయం ఆలోచించాలని కోరుతున్నాను. పూర్వపు జమిందారీ ప్రాంతాలలో సర్వే జరిగి ఉండలేదు. ప్రభుత్వం ఇపుడు సర్వే చేయిస్తున్నది. సర్వే పార్టీలు వెళ్ళి సర్వే చేసేటపుడు అక్కడ రైతులను వారు పిలిచి వారు దగ్గరఉండగా సర్వేచేయడంలేదు. వారంతటవారు సర్వేచేసి వస్తున్నారు. దీనివల్ల సరిహద్దులలో తేడాలువచ్చి రైతులమధ్య తగాదాలు వస్తున్నాయి. ఒకరిభూమి మరొకరికి సర్వేలో పోయేసందర్భాలు వస్తున్నాయి కాబట్టి సాధ్యమైనంతవరకు రైతులకు కబురుచేసి రైతులు ఎదుటనే సర్వేచేయించడం మంచిది. అటువంటి ఆర్డర్లు వలింపచేయవలసిందని మంత్రిగారిని కోరుతూ విరమిస్తున్నాను.

శ్రీ డి. వెంకటరమణా రెడ్డి :- (దర్శి) అధ్యక్షా! రెవిన్యూ మంత్రిగారు ప్రవేశపెట్టిన డిమాండును నేను బలపరుస్తున్నాను. అయితే కొన్ని సూచనలు మాత్రం చేస్తాను. చేయవలసిన సూచనలన్నీ మిత్రులందరూ చాలా మంది చేసారు. ఎవరు చెప్పినా అవే చర్విత చరణంగా చెప్పవలసివస్తున్నది. రెవిన్యూ డిపార్టుమెంటులో అనవసరంగా కావలసినంత జాప్యం జరుగుతున్నది. సంవత్సరాలు తరబడి ఒక్కొక్క కాగితానికి సమాధానం రావడం లేదు. ప్రజలు చాలా ఇబ్బంది పడుతున్నారు. ఆఫీసులు చుట్టూ తిరిగి వారు వేసారిపోయిన తరువాత ప్రజాప్రతినిధులమని పెద్ద పేరు పెట్టుకున్నాము కాబట్టి మా దగ్గరకు వస్తారు. మాతో వారు చెప్పుకున్న తరువాత మేము ఆఫీసుల చుట్టూ తిరిగి వారందరిని చూచి చెప్పినా కించిత్తు పని కూడా జరగడం లేదు. దీనివల్ల శాసన సభ్యుల పరిస్థితి చాలా unpopular గా తయారు అవుతున్నది. శాసన సభ్యులు interfere అయినారు, కాబట్టి ఆ పనిని ఏవిధంగానైనా కాకుండా చేయాలనే పట్టుదల వారి మనస్సులో ఉన్నట్లు కనిపిస్తున్నది. Queries వేసి, పార్టీ పోయి విచారిస్తే శాసన సభ్యులను పట్టుకున్నావు, మంత్రులను పట్టుకున్నావు, వారితో చెప్పుకుంటే మీ పనులు అవుతాయా అని అనడం, వారికి రావలసిన లంచాలు వస్తే పనులు చేయడం జరుగుతున్నది. శాసన సభ్యుడు చేయలేని పనిని సులభంగా వంట చేత కానివాడు రెండు రూపాయిలు ఖర్చుతో పూర్తి చేసుకుని వచ్చి శాసనసభ్యుడు అవమానపడే పరిస్థితి కలుగచేస్తున్నాడు. ఇది శాసనసభ్యులందరికి తెలిసిన విషయమే. యంత్రాంగములోని జాప్యాన్ని చక్క చేయాలని ఎన్నిసంవత్సరాలగానో కర్నూలులోను, ఇక్కడా చెబుతూవస్తున్నాము. కాని ఆ విషయమై శ్రద్ధ తీసుకొనకపోవడంమూలంగా చిన్న చిన్న విషయాలలో ప్రభుత్వం నిందపడవలసివస్తున్నది. సర్వజ్ఞులైన రెవిన్యూ మంత్రిగారు తగు కట్టుబాట్లు చేసి ఇదివరకు మంత్రులు చేయలేని సంస్కరణలను తెచ్చి మెప్పు పొందుతారని ఆశిస్తున్నాను.

ఉదాహరణకు ఒక చిన్న విషయం మనవిచేస్తాను. మా దర్శి తాలూకాలో గంగనపాలెం అనేచోట ఒక tank కట్ట తెగిపోతే, దాని రెస్టొరేషన్ కు గాను ఇప్పటికి 6, 7 సంవత్సరములనుండి ప్రయత్నిస్తున్నారు. దానిఆయకట్టు క్రింద వాళ్ళకు సాగుచేసే మార్గం కనబడక, దానిమరమ్మతుకు కాంట్రిబ్యూషన్ సగం చెల్లిస్తామన్నారు. మునిగిపోయే భూములేవైనా వుంటే వీటికి డబ్బు కూడా రైతులే చెల్లిస్తామంటున్నారు. ఇంతకుముందు 5 రు. 6 రు. వెట్ రేట్ వుంటే రు. 8. 9 రు. వెట్ రేట్ ఇచ్చుకొంటామన్నారు. వీటివలన వారు బాధ పడుతున్నారు. అందులో నేను 'ఇంటర్ఫియర్' అయి 2, 3 సంవత్సరాలుగా ప్రయత్నంచేసినా. administrative sanction కోసం రివిన్యూ బోర్డుకురావటానికి కావలసిన details ఇవ్వలేదని వారు Village Officers level కు పంపటము

మళ్ళీఇక్కడకు రావటం, యిందుకే అయిదు సంవత్సరాలు సరిపోయాయి. న్యాయంగా ఆలోచిస్తే ప్రజాప్రతినిధులుగా వుండేవారు ఏదైన ఒక ప్రపోజల్ తీసుకువచ్చినపుడు వారి 5 సంవత్సరాలటైమ్ అయిపోయిన తర్వాత వచ్చే ప్రజాప్రతినిధులకే ఆప్రపోజల్ అమలుజరిపిన క్రెడిట్ దక్కేటట్లుగా కన్పిస్తోంది ప్రభుత్వపునడక, లక్షణంచూస్తే. కాబట్టి దీనిలో ఎక్కువశ్రద్ధతీసుకొని చెప్పిన పనులు త్వరగా అయ్యేటట్లు చూడాలని మనవిచేస్తున్నాను.

భూసంస్కరణల గురించి మిత్రులు కొండయ్యగారు చెప్పినట్లు సాధారణంగా అన్నిసంపదలను పరిమితం చేయాలి. అట్లా చేసినపుడుమాత్రమే అది సోషలిస్టిక్ పేట్రన్ ఆఫ్ సొసైటి అనిపించుకొంటుంది. అట్లాకాకున్న, ఈరోజు 100 ఎకరాలు సేద్యంచేసేరైతుకు ఆభూమిలో వస్తున్నపంట తానేకాక సంవత్సరము పొడుగునా పనిచేయు కూలివాళ్లు మొదలైనవాళ్లు అనుభవిస్తుంటే, చిట్టచివరకు మంచి ధరలువున్నప్పుడు ఆరైతుకు మిగిలేది ఏమీవుండదు. డ్రై ఏరియాలో భూమి సాగుబడి చేయటం వర్షంమీద ఆధారపడివుంటుంది కనుక వాడికి భూమిమీద ఆదాయంశూన్యం. మామూలు రైతుకుటుంబము శిస్తుచెల్లిస్తూ, ఖర్చులను meet కాలేక తమ భూమిని షావుకార్లకు విక్రయించిన నిదర్శనాలు వున్నాయి. రిజిస్ట్రేషన్ డిపార్టుమెంటులో తెలుసుకొంటే రైతులు ఎంతమంది అప్పులక్రింద భూములు ఎన్నో పోగొట్టుకొన్న విషయంతెలుస్తుంది. డెల్టా ఏరియాలోని రైతులు తమ ఖర్చులు meet కాగల్గితే కాగలరేమోగాని డ్రై ఏరియాలో వర్షాలమీద ఆధారపడేటటువంటి రైతులుమాత్రం ఖర్చులు meet కాలేరు. పైగాఈ సీలింగ్ అనేది ఏర్పాటు చేసేటప్పుడు "పేడా - బెల్లం" అంతా ఒకేరకంగా చేయటానికి వీలు వుండదు. ఒక్కొక్కచోట, ఎకరం 8,000 రు॥ 9,000 రు॥ ఖరీదుచేసే భూములు వున్నాయి. ఒక్కొక్కచోట 10 రు॥ కూడా చేయనివి వున్నాయి కాబట్టి న్యాయంగా ఆదాయంమీద ఆధారపడిగాని, లేక సీలింగ్ అనేటప్పుడు ఏ తాలూకాలో భూములు ఏవిధంగావున్నాయో తెలుసుకొని వాటియొక్క విలువమీద ఆధారపడిగాని చేయటం చాలా అవసరమని మీద్వారా ప్రభుత్వం వారిదృష్టికి తీసుకువస్తున్నాను. రిజిస్ట్రేషన్ డిపార్టుమెంటునుగూడ రివెన్యూ మంత్రిగారే చూస్తున్నారు కనుక వారికి ఈ డిపార్టుమెంటు విషయాలు మనవిచేసుకొంటున్నాను. అక్కడ గవర్నమెంటుకు ఎంత ఫీజ్ వస్తోందో, రిజిస్ట్రేషన్ డిపార్టుమెంటులో సబ్ రిజిస్ట్రారుకు అంతఫీజు ఇవ్వనిదే—ఏ ఒక్కచోటనో తప్పితే—తక్కినచోట్ల దస్తావేజులు రిజిస్టర్లు కావడంలేదనేది సర్వజనులకు తెలిసినవిషయము. వాటిపై మంత్రులు ప్రత్యేకంగా ఒకకన్నువుంచి, C. I. D. వగైరాలనువేసి, అటువంటివారికి punishments ఇవ్వకపోతేమాత్రం ప్రజలలో మనం తిరగలేము. దేశంలో లంచగొండితనం

ఎక్కువవుతున్నదని, దీనిని బాపుటకు ప్రభుత్వము తీవ్రచర్యలకు పూనుకొన్నట్లు కన్పిస్తుంది. చాలాభాగం అన్ని డిపార్టుమెంటులలోను ఇట్లాగే జరుగుతోంది, రెవెన్యూ మంత్రి వెంకటరావుగారు తలచుకొంటే చేయలేనిదిలేదు కాబట్టి ప్రత్యేకంగా వీటియందు మంత్రిగారుదృష్టివుంచాలని నేను మీద్వారా మంత్రి గారిని సవినయంగా ప్రార్థిస్తున్నాను. నాకీఅవకాశం ఇచ్చినందుకు అధ్యక్షులు వారికి నా నమస్కారములు.

శ్రీ టి. పాపారావు : (నాగరికటకం) అధ్యక్షా! మన రెవిన్యూ మంత్రి గారు రెవిన్యూ డిమాండును ప్రవేశపెట్టారు. వారు చాలా అనుభవం గలవారు. ప్రత్యేకంగా ఈ రెవిన్యూ పోర్టు ఫోలియోకు వారే సమర్థులనే సంగతి అందరికీ తెలుసు. అయితే వారు మా శ్రీకాకుళం, విశాఖపట్టణం జిల్లాలకు water rates ను వారు వుండే అమలాపురం తాలూకాతో compare చేసుకొని పెంచారు. ఇది కేవలం విమర్శనాదృష్టితో చెప్పటము లేదు. సదుద్దేశ్యంతో మాకు వుండే కష్టములను చెప్పుకొంటున్నాము. ఆనకట్టలు, కాల్వలు గల డెల్టా ఏరియాల జిల్లాలను చూచి అదేవిధంగా మా జిల్లాలలో water rates ను నిర్ణయించటం చాలా అన్యాయము. అది వెంటనే తొలగిస్తారని ఆశిస్తున్నాము. మా జిల్లాలో ప్రాజెక్టుకాని, ఆనకట్టలుకాని, నీరు వెళ్లి లేకుండా ప్రవహించే జలాధారాలుకాని లేవు. మా జిల్లాలో కాలువలు వున్నాయి. కాని ఇంతవరకు అది neglected area. ఆ ఏరియాలో open heads తో చిన్న చిన్న కాలువలు వున్నా ప్రయోజనం లేదు. ఈ రోజు నేను బయలుదేరి వచ్చేసరికి యింకా వార్లు వేయడం కొంతవరకు మాత్రమే అయినది. వర్షాలు లేక వారు పాడై పోతున్నది. యింకా దమ్ములు కాని, ఉభాలు పట్టటంకాని మా జిల్లాలో లేదు. ఇలాంటి పరిస్థితులు సర్కార్ జిల్లాలలో కృష్ణా గోదావరి డెల్టా భూములలో లేవు. ఇలాంటి పరిస్థితులు వున్నప్పుడు వాటితో మా శ్రీకాకుళం, విశాఖ పట్టణం జిల్లాలను compare చేసి water rates ను నిర్ణయించటం భావ్యంగా లేదు. కాబట్టి అవి తప్పకుండా తొలగించి న్యాయం కల్గించాలని కోరుతున్నాను.

రెవిన్యూ డిమాండు చర్చకు వచ్చిన అగాయతూ నిన్నటినుండి భూసంస్కరణల గురించి అందరు అన్ని పార్టీలవారు అనేక విధాలుగా మాట్లాడుతున్నారు. Land reforms పెట్టడం దేశానికి మంచిదని చాలా మంది వాదిస్తున్నారు. దానితో నేను ఏకీభవిస్తున్నాను. కాని తక్కువ ఎక్కువలను సమన్వయించుటకు ఒక్క land reforms కాదు. ప్రొడక్షన్ కూడా సీలింగ్ పెట్టినా దే ఆ Land reforms సార్థకం అవుతాయని నేను మనవి చేస్తున్నాను. ఈ land reforms పెట్టేటప్పుడు ఒక రైతుకు, సీలింగ్ నిర్ణయిం

టప్పుడు సామాన్యంగా ఈ 300 రు॥ లలో వాళ్ళకు వుండే మెడికల్ సదుపాయాలు కాని వివాహావిధులుకాని, అప్పటికప్పుడు వచ్చే కుటుంబ ఖర్చులుగాని భరించి manage చేయటం కష్టం.ఒక కేపిటలిస్టుమిల్లు ఓనరో లేక యింకా ఇతర రాబడులు వచ్చేవారో వారి పిల్లలకు విద్యాబోధన చేయిస్తూ 'ఫారిన్' పంపించవచ్చు. కాని ఉదయం లేచి సాయంకాలము వరకు పనిచేస్తూ కుటుంబము ఏలా నడుస్తుందని చూచుకొనే ఈ రైతుల దుస్థితి ఎలావుంటుందో ఆలోచించండి. అందుచేత land reforms పెట్టేటప్పుడు నెలకు 300 రు॥ కాక కనీసం 750రు॥, 800 రు॥ లో పెట్టి ఇప్పుడు వుండే రేట్లు కాకుండా, గత 30 సం॥ ల నుండి వచ్చేదానికి సగటు రేటు నిర్ణయించి పెట్టినట్లయితే కొంత ఉచితంగా వుంటుంది. సీలింగ్ పెట్టేటప్పుడు ఆ సీలింగ్ ప్రకారం వున్న భూములకు పంటలకు గవర్నమెంటు surety ఇప్పించి, పంటకు నష్టం వచ్చే టప్పుడు ముదరా ఇప్పించాలని నిర్ణయించినప్పుడే సీలింగ్ సార్థకం అవుతుం దని మనవి చేస్తున్నాను. వారు పండించే పంటలకు ధరలు బాగా వచ్చినట్లయితే exportation, importation surety కూడా ప్రభుత్వమువారు చూడాలని కోరు తున్నాను. రైతులు కొనవలసిన సిమెంటు వగైరా కొన్ని వస్తువులను సీలింగ్ ధరలకు ఇప్పించవలసిందిగా కోరుతున్నాను.

ఇక గ్రామోద్యోగుల విషయం వుంది. వారు ప్రస్తుతం అనుసరిస్తున్న పద్ధతులు క్రమవిరుద్ధంగా వున్నవనేదానితో నేను ఏకీభవిస్తున్నాను. కాని కలెక్టరు ఆఫీసులోను, తాలూకా ఆఫీసులోను పని చేస్తు 200, 300, 400రు, తెచ్చుకొనే ఆఫీసర్లకన్నా వీళ్ళకు తక్కువ పని లేదని నేను మనవి చేస్తున్నాను. ప్రభుత్వానికి ఇప్పుడు తగిన స్తోమతు లేదని ప్రస్తుతం సర్దుకోలేమని అంటున్నారు. ఇప్పుడు కాకపోయినా మరికొన్నాళ్ళకయినా సరే, మీరు ఆ విషయం ఆలో చించి ఒక నిర్ణయం చేయటం మంచిదని నేను సూచిస్తున్నాను. అయితే అదే విధంగా గ్రామోద్యోగులు కూడా క్రమశిక్షణతో వారి కార్యక్రమములను నడిపిస్తు వారి కష్టసుఖములు ప్రభుత్వానికి మనవి చేసుకోవాలని కోరుతున్నాను.

తరువాత జిల్లా administration గురించిచూస్తే జిల్లా అధికార్లవద్దకు శాసనసభ్యులమైన మేము పోయి ఏదైనావిషయము చెబితే, వీరుచెప్పడం మేము వినడమా అన్న అభిప్రాయము కనబరుస్తున్నారు. వెంకట్రావుగారు రెవిన్యూ మంత్రిగా ఉండగా యిలాంటివి జరగడము శోచనీయము. ప్రజాప్రతినిధులము కాబట్టి మేము ప్రజల వ్యవహారమును జిల్లా అధికార్లవద్దకు పోయినప్పుడు మమ్ములను గౌరవించి, ఆపనులేవో విచారించి న్యాయమైన దృష్టితోపరిష్కరించే ఏర్పాటు చేయవలసిందిగా మంత్రిగారిని కోరుతున్నాను. మేము వెళ్ళితే దానికి సరియైన ఆహ్వానము లేకుండాఉండి, అదే టైములో అదే వ్యవహార మును మరెవరైనా సామాన్యవ్యక్తులు ఏవందో, రెండువందలో ఖర్చుచేసే

వారు వస్తే, ఆ పనులు వారికి అనుకూలముగ చేయడమువల్ల, మేము సిగ్గుపడవలసిన పరిస్థితి కనబడుతున్నది. కాబట్టి యిలాంటివి జరగకుండ సరియైన instructions జిల్లా అధికార్లకు పంపమని కోరుతున్నాను. ఇనాందార్లకు compensation ఇస్తామని గత పది సంవత్సరములుగా ప్రభుత్వమువారు చెబుతున్నారు. నాకు తెలిసినంతమట్టుకు ఈ యీనాముల రద్దు చట్టము మా శ్రీకాకుళం జిల్లాలోను, విశాఖపట్టణము జిల్లాలోను ఎక్కువగా అన్వయింపబడే అవకాశములు జాస్తిగా ఉన్నవి. ఎందువల్లనంటే ముఖ్యముగా యీ రెండు జిల్లాలలోనే ఎక్కువ యీనాములు ఉన్నవి. ఇనాందార్లందరు చాలా పేదవాళ్లు. ఏమాత్రము చాలినంత ఆదాయము వచ్చేవారు చాలా అరుదు, కొద్దో గొప్పో వచ్చేవాళ్లు యీ చట్టమువల్ల నిరుపేదలై తినటానికి తిండి, కట్టటానికి గుడ్డ లేకుండా అతిదీనావస్థలో ఉంటున్నారు. వాళ్ళపిల్లలకు యింతవరకు పెళ్ళిళ్ళు లేవు. ఆర్థికంగా ఏమాత్రముశక్తి లేనందున వివాహములు చేయలేదు. ఎందుకంటే వచ్చే ఆదాయము తినటానికే చాలదు. ఇలాంటివి అనేక కేసులు నేనెరుగుదును. కొంతమందికి యిళ్ళుకూడ లేవు, నాకుతెలిసిన విషయము ఒక్క ఉదాహరణ చెబుతున్నాను. టెక్కలిలో ఒక యీనాందారుకు ఒకప్పుడు సం. కు 50,60 గరిశెల ధాన్యమువచ్చేది. ఇప్పుడు యీ బిల్లువల్ల ఆ ఆదాయము కాస్త రాకుండపోయింది. ఆయనకు యిల్లు లేకపోవడమువల్ల ఆయన సంసారముతో ఒక బస్సుషెడ్డులో కాపురము ఉంటున్నాడు. కట్టుబట్టలు చిరిగిపోయినవి. పైన మాసికలు వేసినచొక్కాఅయినా లేదు. ఒక రోజున మా యింటిముందుకు వచ్చి ఆకలి, ఆకలి అనిఅంటూ. శోషవచ్చి యింటిమెట్లమీద పడిపోయినాడు- గాయము తగిలినది. ఆయన ఆకలిబాధచేత స్పృహ తెలియకుండ పడిపోయినందున, గాయము తగిలినందున, డాక్టరును నేనేపిలిపించి చికిత్స చేయించాను- ఇలాంటి దుర్భరస్థితిలోవారికి ఉండుకున్న యీనాములు రద్దు కావడమువల్ల వారు చాలా హీనస్థితికి వచ్చారు. వాళ్ళ పరిస్థితిచూస్తే ఎంతోజాలివేస్తుంది. వాళ్ళకు ఆదాయము వస్తూన్నప్పుడు ఏదో కొంతభోజనం అయినా చేస్తూఉండేవారు. అలాంటిది యిప్పుడు లేకుండా పోయింది అంటే, ఇక వారు బ్రతికేది ఎట్లా అనేది ప్రభుత్వము గుర్తించాలి. వాళ్ల పరిస్థితి చాలా అన్యాయముగా ఉన్నది. ఇండియా రాజ్యాంగ చట్టము ప్రకారము అయినా, భారతపౌరు లందరిని సమాన స్థాయిలో చూడాలని ఉన్నప్పుడు ఒకరి పొట్టమీద కొట్టి, యింకొకరిని పోషించడము యీ బిల్లు యొక్క ఉద్దేశముగ కనబడుతున్నది, అలాకాకుండా యీ యీనాందార్ల దుస్థితి ప్రభుత్వము కొంత దయారసముతో పరిశీలించి, వారి యొక్క యీనాములకు తగిన compensation వీలుఅయినంత ఎక్కువగానే యిచ్చేటట్లు చూడవలసిందని మంత్రిగారిని కోరుతున్నాను. జమీందారీ ఏరియాలలో నీటివనరులు బాగుచేసే విషయములో

చాలా అశ్రద్ధజరుగుతున్నది. ప్రభుత్వోద్యోగస్థులు చెప్పేది ఏమిటంటే, ఆ ఏరియాలు యింకా Survey and Settlement కాలేదని అంటున్నారు. ఇప్పటికి Survey and Settlement పూర్తిఅయిన గ్రామాలలో అయినా నీటి సప్లయిలేదు. Food Production Department వారిని, రిపేరు సంగతి ఏమిటి అని అడిగితే, వాటి పూచీ మాది కాదు. అది Revenue Department వారిది అని తప్పుకుంటున్నారు. అందువల్ల యీ ఏరియాలలోనివారు సర్వేకాలేదని చెప్పడము వల్ల వారికి అటు ప్రభుత్వమువల్ల గాని, యిటు యితరులవల్ల గాని ఏలాంటి ఉపకారము పొందకుండ త్రిశంకు స్వర్గములో ఉంటున్నారు కాబట్టి ప్రభుత్వమువారు ఈ ఏరియాల విషయము సరియైన దృష్టితో దర్యాప్తుచేసి, వారికి సరియైన నీటి వనరులు కలుగజేయవలసిందనిన్నీ, కనీసము రెవిన్యూ డిపార్టుమెంటు ద్వారా కాకపోయినా, P. W. Department వారికైన వాటి రిపేర్లు వప్పగించి, యింకా అవసరమైతే అదనపు సిబ్బందినైనా వేసి త్వరలో ఏర్పాటుచేయవలసిందిగ కోరుతూ, నాకు యీ అవకాశము యిచ్చినందులకు అధ్యక్షులవారికి నా కృతజ్ఞత తెలియజేస్తూ విరమిస్తున్నాను.

*Sri P. Basi Reddi. (Pulivendla):* Mr. Speaker, Sir, in the limited time that is available to me, I propose to deal with only one matter and that is the water tax on lands under spring channels and river channels.

This is an unjust tax, Sir for which there is absolutely no justification.

*Sri K. Venkata Rao:* When was this tax imposed?

*Sri P. Basi Reddi:* It was imposed quite a long time ago and there is absolutely no justification for its continuation in the present conditions..

These channels, i.e. the river channels and stream channels are maintained, Sir, exclusively by the ryots and the Government do not spend a single pie over the maintenance of these channels. The ryots work on these channels throughout the year, day after day, going at 4 o'clock in the morning and working till about mid-day. The cost of maintaining these channels works out at about Rs. 50/- an acre for a ryot. Now, take the other set of channels, viz., the 'project channels'. These channels are maintained exclusively by the Government. The ryots do not spend a pie over the maintenance of these channels. Then how do the water rates under these channels compare with those under the other set of channels? The water rate in respect of project channels is only Rs. 6 or 7 per acre, whereas the water rate in respect of river channels and spring channels is about Rs. 10 or 12. That is, the water rate in respect of river

channels is nearly double the water rate in respect of Government channels. It is, therefore clear, Sir, that there is absolutely no moral justification for the levy of this tax in respect of river channels and spring channels.

The water rate, as I have submitted already, in respect of spring channels is nearly double the water rate levied under project channels. This is very anomalous position, Sir.

[*Mr. Deputy Speaker in the Chair*]

I can think of only one reason for the coming into existence of this anomaly. It should have happened like this. Probably, the Government were maintaining both sets of channels in the beginning. The river and spring channels do not admit of Governmental delays in respect of repairs and, naturally, the ryots themselves would have commenced doing the repairs and maintenance and in course of time, Government would have abandoned their duty of repairing the channels and that duty must have fallen entirely on the ryots themselves. The Government, of course, retain their right to levy the tax as here. Having abandoned their duty of maintaining and repairing these channels, it is their clear duty to give up the right of levying the tax also.

There is a further ground, Sir, on which I assail this tax. It is a constitutional ground. This tax was abolished in the district of Anantapur about 7 or 8 years ago. I think Hon. Sri Kala Venkata Rao was the Revenue Minister then. In the course of supplementary questions last year, he was asked why the tax was abolished in Anantapur district and why it was not abolished elsewhere. Intervening, Sri Kala Venkata Rao said that it was abolished because the people of Anantapur district asked for it. Now, Sir, we have been very vociferously asking for its abolition for the last three years, and we are even prepared to ask for it in the manner that the hon. Minister may prescribe for us. In an answer which the hon. Minister gave in the course of supplementary questions, Sri Kala Venkata Rao, by implication, admitted that there was no difference between the conditions obtaining in Anantapur district and the conditions obtaining elsewhere. Our only fault was that we did not ask for it while the people of Anantapur district asked for it and they got it. Now, I submit, Sir, that this is a discrimination which is prohibited by the Constitution—Article 14 of the Constitution. There must be equality before Law. So, either constitutionally or morally, the Government are not justified in continuing the levy of this tax.

The Prakasam Ministry, Sir, was reported to have taken a decision to abolish this tax. It was published in the papers also. I enquired of hon. Sri Koti Reddy, who was then the Revenue

Minister, whether what was published in the papers was correct. He was pleased to tell me that it was a fact. Then that Government fell and with it the decision also. Hon. Sri Thimma Reddi was also a member of that Cabinet. He pleaded last year in the course of the budget discussion, very vehemently, for the abolition of this tax. Now, both hon. Sri Thimma Reddi and hon. Sri Kala Venkata Rao are in the Cabinet. I hope they will prevail upon the other Members of the Cabinet to do away with this inequitous tax at a very early date.

I thank you, Sir, for having given me this opportunity to peak.

శ్రీ జి. రామస్వామిరెడ్డి (పెదకూరపాడు) : అధ్యక్షా, రెవిన్యూ మంత్రి గారు ప్రవేశపెట్టిన ఈ Demand పై చర్చ సందర్భంలో వారిదృష్టికి కొన్ని విషయాలు తీసుకురావలసిన బాధ్యత ఉన్నది. భూసంస్కరణలు కావాలి. భూసంస్కరణలు కావాలి అని వివిధవ్యక్తులు, వివిధ రాజకీయ పార్టీలకు సంబంధించినవారు పండిట్ జవహర్‌లాల్ నెహ్రూ మొదలు డాంగేగారి వరకు భూసంస్కరణలు కావాలి అని దేశంలో బ్రహ్మాండమైన ప్రచారం లేవదీశారు. ఇటుచూస్తే ఏ పార్టీకిచెందినవా రైనప్పటికి రైతుల సమస్యలు, రైతుయొక్క ఆర్థికవ్యవస్థ, రైతుయొక్క దీనస్థితి స్వయంగా అర్థంచేసుకొని ఉండలేదని నేను తలంచుచున్నాను. భూసంస్కరణలకు ఇంత ప్రాముఖ్యం ఇస్తూ మిగతా సంస్కరణలు అనగా ఆదాయ సంస్కరణలుగాని, గృహ సంస్కరణలుగాని వీటినిగూర్చి ఎవరూమాట్లాడకపోవటం చూస్తే వీరంతా బస్తీలకు చెందినవారని స్పష్టపడుతున్నది. వీరందరూ argument లు చేసి ముందుగా రైతులయొక్క పరిస్థితిని సాకల్యంగా అర్థంచేసుకోనవలెనని నేను కోరుతున్నాను. 100 ఎకరాలు ఉన్న రైతుకూడా ఎకరానికి 100 రూపాయల నష్టంతోనే వ్యవసాయం చేస్తున్నాడు. అట్టి పరిస్థితిలో భూసంస్కరణలకు ప్రాముఖ్యం ఇస్తూ ఇతర సంస్కరణల సంగతిఎవరూ ఎత్తుకోనందుకు చాల విచారంగాఉన్నది.భూసంస్కరణలు కావాలనే వారంతా వాటినిగురించి సమగ్రంగా అర్థంచేసుకోలేదని తేలుతున్నది. ఈనాడు భూములు కావాలనే వారంతా భూములు లేనివారే. ఒకప్పుడు వారికిఉన్న భూములను విలాసాలకు, భోగాలకు, తద్దినాలకు కూడా ఖర్చుపెట్టుకొని భూములన్ని కోల్పోయి, భూసంస్కరణలు కావాలని కోరుతున్నట్లు కనబడుతున్నది. దీనివెనుక ఎంతో రహస్యం ఉన్నదనికూడా చెబుతున్నాను. ఆహారసమస్యను గురించి ఆలోచించే రోజులలో ఉత్పత్తిశక్తిని పెరుగుదలచేసి ప్రజలలో ఆ శక్తిని ప్రోత్సహించే బదులు, వాళ్ళయొక్క అలసత్వాన్ని ప్రోత్సహిస్తున్నాయని అనుకొంటాను. దానివల్ల దేశంమొత్తంమీద రైతువర్గం చాల బాధపడుతున్నదని మంత్రిగారిదృష్టికి తీసుకురావలసి వస్తున్నది. అయితే భూసంస్కరణలు ప్రవేశపెట్టాలనుకుంటే,మిగతా సంస్కరణలు కూడా

ప్రవేశపెట్టిననాడు పెట్టండి. భూసంస్కరణలు వద్దని నేను చెప్పడంలేదు భూసంస్కరణలు పెట్టేముందు చాల జాగ్రత్తగా ఆలోచించి ప్రజాభిప్రాయాన్ని సేకరించేందుకు శ్రీ కళా వెంకటరావుగారు పూనుకోవాలని నేను చెపుతున్నాను.

Political Sufferers ఉన్నారు. Political Sufferers కు ముఖ్యమైన ప్రాముఖ్యం ఇవ్వాలి. Political Sufferers అంటే జైలుకు పోని నాబోటి వాళ్ళని కూడ అర్థంకాకపోవచ్చు. ఆనాడు జైలుకుపోయే రోజులలో ఆనాటి రాజకీయ సాంఘిక పరిస్థితులు చూసుకోకుండా వారు చేసిన త్యాగాలు వారు చేసిన సర్వసంఘ పరిత్యాగము గుర్తుంచుకోవాలి. ఆనాడు కాంగ్రెసుపార్టీ అని, కమ్యూనిస్టుపార్టీ అని భేధాలులేవు. అన్ని రాజకీయ పార్టీలు దేశం యొక్క స్వాతంత్ర్య సముపార్జన కొరకే త్యాగాలు చేశారు. అనేకులు భూములు కోల్పోయారు చాలా అవస్థలు పడ్డారు. అటువంటివారు ఈనాడు ఏమాత్రం ఆర్థికస్థాయి లేక బజారులవెంబడి పకీరులుగా తిరుగుతు అవస్థలు పడుతున్నారు. వారి సమస్యలను సత్వరమే పరిష్కరించే దానికి శ్రీ కళా వెంకటరావుగారు పూనుకొన్నందుకు, వారు తీసుకునే చర్యలకు వారిని నేను అభినందిస్తున్నాను. భూములులేని రాజకీయ బాధితులకు priority ఇవ్వాలని చెపుతున్నాను. వందల ఎకరాలుగల Political Sufferers ఉన్నారు. వారిసంగతి తరువాత తీసుకోవచ్చు. లేనివారికి ముందు ప్రాముఖ్యం ఇవ్వాల్సిన బాధ్యత ప్రభుత్వంపై ఉన్నదని గుర్తించాలి. ప్రస్తుతం Political Sufferers కు 15 వ నెంబరుగల Board's Standing Order ప్రకారం నిబంధనలను అమలు పరుస్తుంటే చాల జాప్యం జరుగుతున్నది. ఎక్కడైతే భూమివున్నదో, ఎక్కడైతే అవకాశం ఉన్నదో వారికి Board's Standing Orders పాటించవలసిన బాధ్యతలేదని క్రింది అధికారులకు సూచనచేయవలసిందిగా మంత్రిగారిని నేను కోరుతున్నాను.

భూమి శిస్తు ఉన్నది. ఈ విధానంవల్ల ఏరైతు ఎంత శిస్తు చెల్లించవలసినది నిష్కర్షగా అతనికి తెలిసే అవకాశంలేదు. భూమి శిస్తు సంస్కరణలు కూడా తీసుకొచ్చి, 18వ ఫారంను కొంత సులభంగా తయారుచేయించి, ఆ ఫారాన్ని సత్వరమే ప్రభుత్వము అమలులో పెట్టాలి. ఇదేమాదిరిగా Municipality లలో Municipal tax, Commercial tax మాదిరిగా ఫలానా ఆసామి ఫలానా మొత్తం చెల్లించాలని advance గా 3వ నెల ముందు demand notice serve చేస్తే చాల అనుకూలంగా ఉంటుంది. కాబట్టి ఇది కూడా ప్రభుత్వం ఆలోచించి, ముందుగా notice లు serve చేయిస్తే చాల convenient గా ఉంటుందని నేను మంత్రిగారి దృష్టికి తీసుకువస్తున్నాను.

అనేక గ్రామాలలో పట్టా భూములలో ఇళ్ల స్థలాలు ఉన్నాయి. అవి గ్రామ పోరంబోకులు. వాటిని గ్రామకంఠంలో చేర్చవలసిందిగా కోరుతున్నాను. అటు భూమిశిస్తు రైతు కడుతున్నాడు, ఇటు పంచాయతీశిస్తు కూడా కట్టవలసిన

బాధ్యత అతని పైన ఉన్నది. కాబట్టి పట్టాభూములను కూడా గ్రామకంఠంలో చేర్చవలసిందిగా కోరుతున్నాను. ఈనాడు దేశంలో జరిగే ప్రచారాన్ని బట్టి పాడి పరిశ్రమ, పశువుల పరిశ్రమ, పశువులు సమృద్ధిగా ఉండాలి అనే ప్రచారం చాల ఉన్నది. అందుకు గాను ప్రతి గ్రామంలో పోరంబోకులను, వాగు పోరంబోకులనైనా గ్రామంలో సమిష్టిగా పశువుల పచ్చికబయళ్లకు నిర్బంధంగా కేటాయించాలని నేను కోరుతున్నాను. అదేవిధంగా రైతులను ప్రోత్సహించే దానికి పశువుల మేతకు నిర్ణయించినటువంటి భూమిమీద శిస్తు తీసివేయవలసిందిగా నేను వారికి చెపుతున్నాను, 'భూసంస్కరణల గురించి కాంగ్రెసు బెంచి నుంచి వినరాదని' చెప్పారు. వద్దని చెప్పడంలేదు. కాంగ్రెసులో ఒక democracy ఉన్నది. దేశానికి ప్రమాదం ఉన్నదని తెలిసినప్పుడు దానిని rectify చేసుకొని పరిస్థితులను బట్టి మనం సవరించుకోవాలి. భూ సంస్కరణల గురించి కాస్త ఆలోచించాలని చెపుతున్నాను. గ్రామోద్యోగుల విషయంలో కూడా ఇప్పుడు అవకాశం లేకపోయినప్పటికి, ప్రభుత్వం యొక్క ఆర్థిక స్తోమతు చాల హీనంగా ఉన్నది కాబట్టి వారి యొక్క సమస్యను దృష్టిలో పెట్టుకొని భూములు లేని గ్రామోద్యోగులకు కనీసం పోరంబోకులు అయినా, ఈ సమస్య తేలే లోపుగా ఇప్పించవలసిందని నేను మంత్రిగారిని కోరుతున్నాను.

ఇక లంకభూములు ఉన్నాయి. ఇటీవల లంకభూములలో శివ వంతు వేలం పద్ధతి పెట్టారు. దానివల్ల ప్రభుత్వానికి వచ్చే ఆదా . పెద్దగా ఉండదను కొంటాను. ఈ అవకాశాన్ని తీసుకుని ప్రతిపక్ష సభ్యులు లేనిపోని ఆందోళన చేయడం, లేనిపోని ప్రచారానికి గురిచేయడం జరుగుతోంది. శివ వంతు భూమి అనేదానిని withdraw చేసుకొని వారు నిర్బంధంగా స్వయంగా సాగుచేసుకొనేటట్లు వేరే sub-lease కు ఇచ్చేందుకు వీలులేకుండాను ప్రభుత్వం తగిన చర్యలు తీసుకొంటుందని నమ్ముతూ ఇంతటితో విరమిస్తున్నాను.

శ్రీ జి. సూర్యనారాయణ : ( గజపతినగరం - రిజర్వుడు ) అధ్యక్షా ! బంజరు భూమి పంపిణీ విధానంలో చాల అన్యాయం జరుగుతున్నది. గ్రామాలలో చిరకాలంనుంచి మెట్ట భూములుగా ఉండి, గ్రామ రిజిష్టరులో బంజరులుగా పరిగణించబడుతున్నవి ఉన్నాయి. గ్రామప్రాంతాలలో ఉండే బీదప్రజలు హరిజనులు ప్రభుత్వ అధికారులకు దరఖాస్తు పెట్టుకొంటే ప్రభుత్వ అధికారులు ఈ దరఖాస్తులకు సరైన enquiry చేయక అట్టే పెట్టడంవల్ల ఆయా ప్రాంతాల లోని భూ ఖామందులు ఈ బంజర్లను సాగులోకి తీసుకొచ్చి సేద్యం చేస్తున్నారు. ఈ విషయాన్ని ప్రభుత్వ దృష్టికి చాల పర్యాయాలు తీసుకువచ్చాము. యీ విషయమై ప్రభుత్వం జిల్లా అధికారులకుగాని Estate అధికారులకుగాని తగు notice లు ఇవ్వకపోవడంవల్ల బంజర్ల పంపిణీ విధానంలో ఆలస్యం అవుతోందనుకుంటాను. నిజంగా పేదవారికి బంజరు భూములు ఇస్తున్నారా ? పేరుకు

చెపుతున్నారేగాని నిజముగ పేదవారికి బంజరు భూములు ఏమాత్రము కూడ అందుబాటులోకి రాలేదని నేను స్పష్టంగా ప్రభుత్వ దృష్టికి తీసుకువస్తున్నాను. విజయనగరం Estate లో చాలమట్టుకు బంజరులు ఉన్నాయి. నా అనుభవంలో అనేక గ్రామాలలో ఈ సమస్యలు నేను పరిశీలిస్తున్నాను. 1950 లగాయతు వారు దరఖాస్తులు ప్రభుత్వ అధికారులకు దాఖలుచేసి ఉన్నారు. ఈదాఖలు చేసిన petition లను ప్రభుత్వ అధికారులు మంజూరు చేయలేదు. అది నాకు పూర్తిగా తెలిసిన విషయము.

బంజరు భూములను పేదలకు పంచుటలో చాలా ఆలస్యం జరుగు తున్నది. ఇట్లా అయితే పేదవారికి భూములు ఎట్లా లభిస్తాయి అనే విషయం మనం తెల్సుకోవలసి యున్నది. ఇదే ప్రకారంగా జరిగినట్లయితే పేదలకు బంజరు భూములు లభించవు. ఈ విషయం ప్రభుత్వ దృష్టికి ఎన్ని పర్యాయ ములు తీసుకువచ్చినా ఏమీ చర్యలు తీసుకోబడడంలేదు. అందువల్ల తక్షణమే బంజరు భూములు పేదవారికి అందేటట్లు ఆయా అధికారులకు తాఖీదులు పంప వలెనని ప్రభుత్వాన్ని కోరుతున్నాను.

ఈనాడు దేశం మొత్తంమీద గ్రామోద్యోగుల జీతాల విషయమై ఆందోళన ఉన్నట్లు మనకందరకూ తెల్సును, " చాలాకాలంనుంచి ఈ అందోళన లేదే, ఇప్పుడు ఈ అందోళన ఎందుకు వచ్చింది " అనే విషయం వచ్చింది. దానికి రాజకీయ పార్టీల దృక్పథాలున్నాయని ఒక గౌ॥ సభ్యులు చెప్పారు. కాని ఈ విషయమై రాజకీయ పార్టీలేకాదు, వారి కష్టానికి తగిన ఫలితం అడగ వలసిన బాధ్యత ఆ ఉద్యోగస్తులకు ఉన్నది.

వారికి యిచ్చే వేతనాలు బహుతక్కువ అగుటవలననూ, దేశంలో ఆహార పదార్థాల ధరలు అధికమగుటవలననూ ఈపరిస్థితి ఏర్పడిందనుకుంటున్నాను. గ్రామాలలోవున్న పోరంబోకు భూములను గ్రామోద్యోగులకుయిస్తే బాగుం టుంది. వారు ఆ స్వల్పజీతాలతోనే ఎందుకుపనిచేయకూడదు అనే భావంలో ప్రభుత్వం ఉన్నదనుకొంటాను. బంజరుభూములు ఇచ్చినంతమాత్రాన గ్రామో ద్యోగుల ఆర్థికపరిస్థితి బాగుపడుతుందని నాకు నమ్మకంలేదు. గ్రామోద్యోగస్తుల మీద మనరాష్ట్రంలోవుండే అన్ని డిపార్టుమెంటులు అధికారం కల్గిఉన్నాయి. అందువల్లవారికి రోజంతా ప్రభుత్వంయొక్క పనేవుంటుంది. కాని ఇతరమైన వృత్తి ఏదైనా చేసుకోటానికి time లేనేలేదు. పైగా వారికి T. A. లు ఇచ్చాము. జమాబందీవిషయంలో కొంతఇస్తున్నాము. దానితో వారు సంతృప్తి చెందుతు న్నారని ప్రభుత్వం భావిస్తున్నదేమో, కాని అట్లాజరుగుటలేదు. జమాబందీ రోజులు 15 రోజులుంటాయి. కనీసం 10 రోజులైనా ఉంటాయి. ఆ 10 రోజులకు ప్రభుత్వం యిచ్చే 6 రు. లు ఏమాత్రమూ చాలదు. మొత్తం 10 రు. లు యిచ్చినాసరే సరిపోదనుకొంటున్నాను.

అయితే గ్రామోద్యోగులు Post Master వృత్తి చేసుకోవచ్చు. ఇతర Contractor వృత్తి చేసుకోవచ్చునని గౌ॥ కళా వెంకటరావుగారు చెప్పారు. కాని గ్రామోద్యోగు లందరూ Contractors గా ఉంటారనీ, వారంతా భూఖామందులనీ అనుకోడానికిలేదు. Post Masterగాగాని, ఇతర Contractor గాగాని, ఇతరమరేవృత్తికూడా లేదనేవిషయం నాకుతెలుసును. ఈనాడు గ్రామోద్యోగులు జీతాలుహెచ్చించాలని అడుగుతున్నారు. అంటే వారికష్టానికి తగిన ఫలితం ఇవ్వమని ప్రభుత్వాన్ని అడుగుతున్నారు కాని ప్రభుత్వందగ్గర డబ్బులేదనే సాకుతో "జీతాలు పెంచము" అంటున్నారు. పెద్దపెద్ద ఉద్యోగస్తులను పెంచినంతమాత్రాన పనితొందరగా జరుగదు. ఇదివరకు ఎంతపని జరుగుతున్నదో అంతపనే జరుగుతుంది. పెద్దఉద్యోగస్తులను పెంచడమువలన ఆ ఖర్చు పెట్టే ధనమంతా వృధా అవుతుందనుకొంటున్నాను. ఆడబ్బు గ్రామోద్యోగులకే యిచ్చినట్లయితేవారివల్లనే ఎక్కువపని రాజట్టవచ్చునని నేనుఅనుకొంటున్నాను. ఈవిషయాన్ని ప్రభుత్వంవారు గమనించవలసినదిగా కోరుతున్నాను.

గ్రామాలలో గ్రామకంఠాలున్నవి. వీటినిగురించి నేను వాత్తేరు శాసనసభా సమావేశంలోకూడా చెప్పాను. ఏగ్రామంలోచూసినా ఆగ్రామానికి తగిన గ్రామకంఠం కంటె పైన భూమిలేదు. ఒకేఇంటిలో 2, 3 కుటుంబాలు కాపురం ఉండడంవలన ప్రజలు అనారోగ్యానికి గురిఅవుతున్నారు. కాబట్టి ప్రతిగ్రామంలోనూ, అక్కడఉండే పేదప్రజానీకం స్వేచ్ఛగా ఇండ్లుకట్టుకొని నివశించడానికి కొంతప్రదేశం మినహాయించవలసినదని విజ్ఞప్తిచేస్తూ నేను ముగిస్తున్నాను.

శ్రీ టి. జి. తిమ్మయ్యశెట్టి (కోస్గి) : అధ్యక్షా, ఇప్పుడు మంత్రిగారు ప్రతిపాదించిన రెవిన్యూ డిమాండును సమర్థిస్తూ మా జిల్లాకు సంబంధించిన కొన్ని విషయాలను మనవిచేస్తాను. ఇదివరలో మేము బళ్లారి వాసులము. S. R. C. Report వలన మేము కర్నూలు జిల్లాలో చేర్చివేయబడినాము. ఇతర జిల్లాల, తాలూకాలకంటె మా జిల్లాలకూ, తాలూకాలకూ సౌకర్యాలు తగ్గించడం జరిగింది. మా ప్రాంతంలో "కడకొట్టానికి కట్టివేయుట"అనే ఒక లోకోక్తి ఉన్నది. అంటే పనికిరాని ఎద్దును చివరనున్న కొయ్యకు కట్టాలని. చివరన కట్టినట్లయితే దానికి మేత, నీరు ఉన్నదో లేదో చూడవలసిన అవకాశం లేదు. ఆ విధంగానే మా తాలూకాను కూడ కడన పెట్టినట్లున్నది. మా జిల్లా వైశాల్యం చాల పెద్దది. 265 మైళ్ళు పెద్ద వైశాల్యం కలిగి ఉన్నప్పటికిన్నీ జిల్లా కలక్టరు తాలూకా కేంద్రానికి రావాలంటే నెలకు ఒక Camp కూడా రావడంలేదు. ఇట్లా అగమ్యగోచరంగా ఉన్నది. కాబట్టి దీనిని రెండుగా విభజించాలని ప్రభుత్వాన్ని కోరినాము. ఆ విషయము ఏమి జరిగినదో ఇంతవరకూ తెలియదు. అయితే దీనిని విభజించడం చాలా అవసరం.

దీనిని విభజించుటకు కావలసిన హంగులన్నీ ఉన్నవి. మా జిల్లాలో ఒక Sub-Registrar ఉన్నారు. ఇదివరలో ఒక Special Collector ఉండేవారు; వారిని ఇప్పుడు కర్నూలుమార్చి తుంగభద్ర ప్రాజెక్టు ప్రాంతమునకు వేసినారు. District Veterinary Officer ఉన్నారు. మా District లో District Superintendent of Police Office ఉన్నది. ఇవన్నీ ఉన్నాయి. ఆ జిల్లాను రెండు జిల్లాలుగా చేసే అనుకూలత ఉన్నది. ఒక జిల్లా head-quarters ఆదోనిలో పెట్టినట్లయితే వీలుగా ఉంటుంది. అక్కడి విషయాలు కలక్టరుగారు తరచుగా చూచుటకు అనుకూలంగా ఉంటుంది. అందువల్ల దానిని వెంటనే విభజన చేయించాలని ప్రభుత్వాన్ని కోరుతున్నాను. మాకు అక్కడ ఇప్పుడు ఒక కోర్టు కూడా లేదు. District Court, Addditional Court, Sub-Court - ఈ మూడుకూడా కర్నూలులోనే ఉన్నాయి. ఆదోని, ఆలూరు తాలుకాలలో ఎక్కువ కేసులు ఇస్తున్నారు. అందువల్ల ఆదోనిలో ఒక కోర్టు ఏర్పాటు చేయాలని ప్రభుత్వాన్ని కోరుతున్నాను. అట్టి ఏర్పాటు చేసినట్లయితే, అక్కడి ప్రజలకు అందుబాటులో ఉండడమే కాకుండా, కర్నూలులోని కోర్టులలో రద్దీ తగ్గడానికి కూడా వీలుంటుంది. కాబట్టి ఈ విషయమై మంత్రిగారు ఆలోచించి వెంటనే చేయాలని కోరుతున్నారు. District Planning Committeeలలో జిల్లాలోని M. L. A. లుఉంటారు. B.D.Os, Meetingsకు వస్తుంటారు. కాని ఆదోని, ఆలూరు తాలూకాలలో వుండే B. D. O. లు మాజిల్లా Planning Committee Meetings కు రావడంలేదు. M. L. As మాత్రం వస్తారు. ఆదోని, ఆలూరుతాలూ కాలవిషయం యిందులోలేదు. ఆదోని, ఆలూరు తాలూకాలలోని B. D. O. లను కూడా రప్పించి, జిల్లా కలక్టరు ఆధ్వర్యంలో కార్యక్రమాలు జరిపించినట్లయితే వారికీ, వీరికీ సమన్వయం కుదురుతుంది. జిల్లా కలక్టరు ఆధ్వర్యంలో ఈ తాలూకాలు లేకపోయినట్లయితే జిల్లా ప్లానింగు కమిటీ కార్యక్రమాలు కుంటువడతాయి. అందువల్ల సమంగా ఒకే అధికారం క్రింద ఉండేటట్లు జిల్లా ప్లానింగ్ కమిటీని సవరించాలని నేను కోరుతున్నాను.

మా జిల్లాలో చాలమందికి ప్రభుత్వంవారు అప్పులిస్తున్నారు, Land improvements loans చాలా ఇచ్చారు. Block Committee వారు loans ఇచ్చారు. కోఆపరేటివ్ బ్యాంకులు loans యిచ్చాయి. Different agencies వారు loans యిచ్చారు. ఇప్పుడు రైతుల చేతిలో డబ్బులేని పరిస్థితులలో ఆడబ్బు వసూలు చేయడానికి పూనుకొంటున్నారు. సేద్యంచేసుకోడానికి రైతులకు ఇప్పుడే డబ్బు అవసరంఉంటుంది. ఈ విషయమై తగాదాలు ప్రారంభమైనాయి. రైతులు ఇప్పుడు డబ్బు చెల్లించలేని స్థితిలో ఉన్నారు. క్రిందటి సంవత్సరం వర్షాలు ఎక్కువై పంటలు నాశనమైపోయినాయి. ఈవిషయం ప్రభుత్వానికి తెలిపినాము. ఇట్టి పరిస్థితులలో జప్తునోటీసులు ఇచ్చి, వారంటులుయిచ్చి, surcharge, తక్కావీ అప్పులు మొదలైనవన్నీ జబర్దస్తీగా వసూలుచేస్తున్నట్లు తెలుస్తున్నది.

పోయిన సంవత్సరం పంటలు నాశనమైపోయాయి. కాబట్టి ఈ అప్పులను యిప్పుడు వసూలుచేయడం ఆపినట్లయితే ముందు సీజనులో పూర్తిగా వసూలు చేసేందుకు వీలు ఉంటుంది, కాబట్టి ప్రస్తుతం అప్పుల వసూలు ఆపవలసినదని ప్రభుత్వాన్ని కోరుతున్నాను.

ఈ **loans** యివ్వడం కూడా **different agencies** ద్వారా యిచ్చి వసూలుచేసేది లెక్క **Revenue authority** కావడం వల్ల వాళ్లకు చాలాచిక్కులు వస్తున్నవి. దానివల్ల ఆ **loans** యివ్వడంగాని అందడంగాని సవ్యంగా జరగడం లేదు, ఒక్కొక్క భూమిమీద రెండు మూడు దఫాలు మారుపేర్లతో **loans** తీసుకోవడం కూడా జరుగుతున్నది. " ప్రస్తుత పరిస్థితిలో 2½·3 సం॥ వరకు వాయిదా వేస్తే తక్కావీలన్నీ మాఫీ అయిపోతవి. ప్రభుత్వం మనలను యేమీ చేయలేదు. " అనే అభిప్రాయం ప్రజలలో కలగడానికి అవకాశం లేకుండా **loans** సక్రమంగా వసూలయేట్లు అప్పులివ్వటముకు ఒకే **agency** ఉంటే బాగుంటుందని మనవి జేస్తున్నాను.

శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య : (సత్తెనపల్లి) అధ్యక్షా ! ఈ **Land Revenue** సమస్యలలో భూసంస్కరణ చాలా ప్రధానమైన సమస్య. కాని భూసంస్కరణలు అమల్లోకి రాకుండా నానాటికి వెనక్కి పోతున్నవి. శ్రీ కళా వెంకటరావుగారు ఈ నెలాఖరులోగా తమ అభిప్రాయం ఏదో తెలియబరుస్తామన్నారు. కాని అది శాసన సభకు అవుతుందో లేక పార్టీకి అవుతుందో యింకా తేల్చలేదు. ఎందుకంటే **party** వారు **pass** చేస్తేనేకాని అది శాసన సభ ముందుకు రాదనీ, అప్పుడు ఏమి చేయాలో నిర్ణయిస్తామని అన్నారు. ఆ మాట చెప్పినందులకు చాలా సంతోషం. ఎప్పటికి వస్తాయా అని ఎదురు చూస్తున్నాం. క్రిందటి తడవ శ్రీ గోపాలరెడ్డిగారు చెప్పినట్లు సమ్మోహ విభ్రాంతులం కాకుండావుండేపద్ధతిలో ప్రజానీకం ఆహ్వా యంతోస్వీకరించేట్లుగా ఉంటే చాలు, సంతోషిస్తాం. అసలు భూమి ఎంతయివ్వాలి ? ఎవరికివ్వాలి ? అనే సమస్య ఒకటున్నది. అంకెలు యిచ్చినట్లయితే **time** సరిపోదు. కనుక వాటిని గురించి చెబుతాను.

ఆంధ్ర ప్రాంతంలో లెక్కచూచినట్లయితే 1,11,25,000 ఎకరాలు ఉన్నవి. తెలంగాణాలో 29 లక్షల 75 వేల ఎకరాలున్నవి. ఇది మినహాయించి భూమి పంచడానికి నిర్ణయించినట్లయితే 68 లక్షల ఎకరాలు ఆంధ్రప్రాంతంలోనూ, 86 లక్షలు తెలంగాణాలో లభిస్తుందని ప్రభుత్వం యిచ్చిన లెక్కలలో ఉంది. అయితే ఇప్పుడు ఎంతవస్తుందని వారు కొత్తగా ప్రశ్న వేస్తున్నారు. 25 ఎకరాలుగనుక **maximum holding** గా లెక్కవేసినట్లయితే తక్కినభూమి వస్తుంది. 10 లక్షల ఎకరాలు తేడా వచ్చినప్పటికి దాదాపు అంత వుంటుంది.

దాన్ని పంచడానికి అవకాశం వుంటుంది. అప్పుడు వ్యవసాయ రంగంలోనున్న నిరుద్యోగాన్ని నివారించడానికి కూడా అవకాశం ఉంటుంది.

ఇప్పుడు బంజరుభూముల విషయంలో చాలా అన్యాయం జరుగుతున్నది. ఆశ్చర్యకరమైన పరిస్థితి యేమంటే, ఒకచోట 360 ఎకరాల పొలం ఉంది. దీన్ని సాగుచేశారనే ఉద్దేశంతో 19 వేల రూ॥ దానిమీద penalty వేశారు. వాళ్ళు ఆ డబ్బు యిచ్చుకోలేక చాలా బాధలు పడుతున్నారు. అది ఎట్లా వస్తుందని అడుగుతారేమో - ఎకరాకు 3 రు॥ల చొప్పున లెక్కగట్టి 3 రూ॥లకు 20 రెట్లు హెచ్చించి, ఆ విధంగా ఎకరానికి రు 60 ల చొప్పున 360 ఎకరాలకు లెక్కవేస్తే అదేవస్తుంది. లెక్కలోమాత్రం తహశీల్‌దార్లు, ఇతర ఉద్యోగులు యేమీ పొరబాట్లు చెయ్యలేదు. వేసిన భారంమాత్రం చాలా పెద్దది. ఈ విధంగా చేయడంలో సామాన్యజనాన్ని వెళ్ళగొట్టడమే ప్రభుత్వ ఉద్దేశమా?

తరువాత కౌలుదార్ల బిల్లు వచ్చింది. కౌలుదారీ బిల్లు అమలుజరగడంలో వస్తున్న చిక్కులగురించి మిత్రులు చెప్పారు. దీన్ని పరిష్కరించేవిధానమేదైనా ఉందా? మరీ బీదగాఉండే అనాథులకు కొంతవరకు స్థానంయిచ్చే అవకాశం లేకుండా చేయడంమాత్రం న్యాయంకాదని చెబుతున్నాను. Planning Commission కూడా ఈ విషయాన్నే చెబుతున్నది. వితంతువులకు 2 ఎకరాలో, 3 ఎకరాలో లేకపోతే పూటగడవడానికి వీలుగా యిందులోకొంత exemption ఇవ్వకపోతేగాని లాభంలేదు. 3 ఎకరాలకు మించినభాగాన్ని exempt చేసేవిధానాన్ని ఆలోచించాలి. లేకపోతే సామాన్యప్రజలు ఇక భూసంస్కరణలు కావాలి అనకుండాచేయడమే అవుతుంది. ఇదివరకు భూమిఉన్నవారికే తక్కువ భూమి కూడా లభింపజేయడమనేది పేదప్రజానీకానికి చాలా అన్యాయం చేసినట్లవుతుంది. వారు ఇక ఎన్నడూ అడగకుండా వుండేపద్ధతిలో యిది తీసుకువస్తారేమోనని భయంగాఉంది. కనుక ఆ Bill రాకుండానే దానిమీద మాట్లాడడం బాగుండదు. దానిమీద memorandum యిస్తాం అన్నారు. అది యిచ్చిన తరువాత వివరాలు చెబుతాను.

ఇవాళ భూమివచ్చిన తరువాత యేమి చేయాలి? ఇవి Co-operative farms అయితే బాగుంటుందని నా అభిప్రాయం. అయితే శ్రీ కొండయ్య చౌదరిగారు చెప్పినట్లు Planning Commission చేసిన సూచన భూసంస్కరణలు చేయడానికి అనువుగాలేదు. చైనాకు వెళ్ళి చూచినవారు సహకార వ్యవసాయ సంస్కరణలు బాగాలేవు అన్నారు. వారికి నేనొక విషయం మనవి చేస్తాను. ఓపికఉంటే నేనొక పుస్తకం యిస్తాను చదవమనండి. వాళ్ళు వున్న విషయాలన్నీ చర్చించి, కొందరు dissent యిచ్చినప్పటికీ దానిని India లో అమలు జరపవలసిన అవసరంఉంది. ఇది జయప్రదం కావడానికి కావలసిన అవకాశాలువున్నా

యని వారు ఖచ్చితంగా చెప్పారు. అందువల్ల మళ్ళీ దాన్ని ఒకసారి చూడమని చెబుతున్నాను. కనుక వారిని mis-quote చేయవద్దని కోరుతున్నాను.

ఇక భూదానం, గ్రామదానం వగైరాలున్నాయి. వాటిలో కొన్ని యిచ్చాం అంటున్నారు. దాన్ని legalise చేసే Act ఏదైనా తీసుకవచ్చారా? ఒక వెయ్యి ఎకరాలు లెక్కవ్రాసి నేను అనుభవిస్తుంటే అది భూదానం ఎట్లా అవుతుంది? ఇతర రాష్ట్రాలలో దానికోసం ఒక Bill పెట్టారు. అట్లాగే ఇక్కడ కూడా ఒక Bill పెట్టండి. భూదానం విషయంలో మన ప్రభుత్వం తీసుకున్న చర్య యేమిటి? ఇక్కడికి వారువచ్చినపుడు రాష్ట్ర ప్రభుత్వాలను "భూసంస్కరణల గురించి మీరుయేమిచెబుతా"రని అడిగారు. బంజర్లన్ని ప్రభుత్వంవారు అమ్మాలని చూస్తున్నారు. ఇంతకంటే భూదానానికి వ్యతిరేకోద్యమం యేముంది? కనుక ప్రభుత్వంవారు బీద ప్రజానీకానికి ఉచితంగా యిచ్చేపద్ధతిని ఆలోచించ వలసియున్నది. ఇక Co-operative farming అనేది, political sufferers కు యిచ్చేవాటి విషయం, కూడా ఉంది. అందువల్ల వారి ఋణభారంకూడా తప్పిపోతుంది. అది మనం ఆలోచించడంలేదు. Reserve Bank వాళ్ళు నూటికి 5 రూ. ల చొప్పున వసూలు చేస్తున్నారు. ఇది చాల ప్రమాదంగాఉన్నది. అధికోత్పత్తి పెరగనందువల్ల ఆహారధాన్యాల ధరలు పెరిగిపోతున్నాయి. ఉన్నవాడు వాటిని దాచుకొని, అమ్ముకొంటూ డబ్బు సంపాదించుకుంటున్నాడు. తక్కినవాళ్ళవిషయం వచ్చేటప్పటికి లేదు అంటున్నారు. డెఫిసిటా! లేక సర్‌ప్లసా? ఒకపూట ఆలెక్క వేసి, మరొకపూట యింకోలెక్క వేసి గడబిడతో ఎవరైనాధాన్యం అడిగితే deficit అనీ, ఎవరైనా కొనడానికివస్తే surplus అనీ ఈవిధంగా అంటున్నారు. ఇక యిది ఏరకంగా నడుస్తుందో తెలియడంలేదు. అందువల్ల ముందు ఋణభారంనుంచి విముక్తి పొందవలసి యున్నది. ఇందువల్ల ఆహారోత్పత్తికి minor irrigation న్ను ఉపయోగించేందుకు ప్రయత్నించాలి. Minor irrigation లో కూడ చాల్లా సమస్యలున్నవి. వాటన్నింటినీ ముందు పరిశీలించవలసియున్నది.

ఇక జిల్లా పరిపాలన చూచినట్లయితే ఈనాడు Chief Minister కు, Governor కు లేని అధికారాలు కూడా జిల్లాకలెక్టరు కున్నాయి. ఆ సర్వాధికారాలలో మార్పువస్తేనే గాని జిల్లా పరిపాలనలో మార్పురాదు. తాలూకా ఆఫీసులలో ఏనాటినుంచో staff అట్లాగే ఉన్నది. కొత్త staff ఏమాత్రంలేదు. పనిమాత్రం చేయండి, చేయండి అంటున్నారు. వాళ్లు యేవిధంగా చేయగలరు? నిన్న ముఖ్యమంత్రిగారు చెప్పారు ఎన్నో Office లు పెరిగిపోతున్నాయి, ఎన్నో Departments పెరిగిపోతున్నాయి అని. అయితే ఆ పెరిగిపోయిన Departments పని అంతా ఎవరు చేస్తున్నారు? ఆపని అంతా గ్రామోద్యోగస్థుడు ఒక్కడే చేస్తున్నాడు. కాని అతనికి జీతం యివ్వడంలేదు. ఆసంగతివస్తే మీరు మాకష్టం

కూడా చూడాలి అంటారు. అతని కష్టంకూడా ప్రభుత్వం గుర్తించవలసి యున్నది. "మీ కష్టంసంగతి అట్లా వుంచండి. నేను కాదనడంలేదు, నా కష్టం కూడా మీరు గమనించాలి." అంటున్నా డతను. అయితే వారు బెదిరిస్తున్నారని ఆ విధంగా రాజకీయంగా అడగవచ్చునా ? అంటున్నారు. నిజమే ! Threat యిస్తే పనికిరాదనే మనోభావం అధికారవర్గంలో ఉన్నది. వాళ్లకు వచ్చిన కష్టం వల్ల అడిగితే ఎన్నాళ్ళు మొత్తుకున్నా వినకపోతే చివరకు ఈ విధంగా వాళ్ళు రాజీనామాలలోకి దిగారు. అది ప్రధానంగా తీసుకోవద్దు. వారిని ఏ విధంగానైనా సరే సంతృప్తిపరిచే విధానం అవలంబించండి. అయితే ఆ ఉద్యోగాలు మంచివి కాదు అనడంలేదు. మంచిదే, శ్రీ కొండయ్యగారు ఒకమాట విసిరారు. "to kill a dog call it a mad one" అని English లో ఒక సామెత ఉంది. వారిని రాయివేసి కొట్టడమెలాగా అని ఆలోచించి, చివరకు వారివెనుక రాజకీయ ప్రమేయం ఉందనే నెపంతో ముందే వారివిషయాన్ని నెట్టివేస్తున్నారు. అది అన్యాయం. అయినా నాకది సంబంధంలేదు. ఇతరపార్టీలతో సంబంధంలేదు.

శ్రీ కె. వెంకటరావు : అది పార్టీలమీద పడదు.

శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య : కనుక వాళ్లకు యే రాజకీయ ప్రమేయం ఉన్నట్లు అంటకట్టవద్దని కోరుతున్నాను.

*శ్రీ కె. కోటిరెడ్డి (లక్కిరెడ్డిపల్లి) : ఉపాధ్యక్షా, రెవిన్యూ మంత్రిగారు ప్రవేశపెట్టిన డిమాండును బలపరుస్తూ ఒకటి రెండు విషయాలు మాత్రము చెప్పదలచుకున్నాను. శ్రీ బసివిరెడ్డిగారు రివర్ ఛానల్సుగురించి మాట్లాడుతూ నా పేరుకూడా చెప్పారు. వారు చెప్పినది కొంతవరకూ వాస్తవమే. ఇదివరకు ఉన్నటువంటి ప్రభుత్వం యీ రివర్ ఛానల్సుపైన వేసే పన్నును కొంత తగ్గించవలసినదని తీర్మానము చేసినది. ఐతే దానిని ఇంతవరకూ ఆచరణలో పెట్టకుండుటకు కొన్ని కారణములు ఉండవచ్చును. ఈ రివర్ చానల్సుపై ఇరిగేషన్ సెస్ యాక్టు క్రింద పన్ను వేయలేదు. సెటిల్‌మెంటులో కన్‌సాలిడేటెడ్ వెట్ రేట్ వేశారు. కాబట్టి యీ వాటరు రేటును తగ్గించవలెనంటే వేరొక శాసనం కావలసి ఉంటుంది. డ్రై రేటు కూడా విధించడానికి వీలుండదు. బహుశా ఆ కారణములవల్లనే దీనిని ఆచరణలో పెట్టలేదని అనుకొంటున్నాను. ఇది చాలా సంవత్సరముల నుంచి పరిష్కరింపబడకుండా ఉన్న విషయము. ప్రజలకు ఇది చాలా ఇబ్బందిగా ఉన్నదని వారు అభిప్రాయపడుతున్నారు. నేను మద్రాసు లెజిస్లేటివ్ కౌన్సిలు మెంబరుగా ఉండినపుడు, బహుశా 1926, 27 సం॥ లలో అనుకుంటాను, అప్పుడు లా మెంబరుగా ఉన్న శ్రీ సి. పి. రామస్వామి అయ్యరుగారు యీ పన్నును కుడి మరమ్మత్ యాక్టుక్రింద విధిస్తున్నామన్నారు.

కుడి మరమ్మత్ యాక్టు అనేది ఒకటి ఉన్నమాట వాస్తవమే. డెభై, ఎనభై సంవత్సరముల క్రింద తయారుచేయబడిన చట్ట మది. ముఖ్యముగా రైతులకు చాలా అవసరమయిన పనులు, ప్రభుత్వం చేయలేనటువంటి పనులు, రైతులే స్వయముగా చేసుకొనవలసినది అనేదే ఆ కుడి మరమ్మత్ యాక్టుయొక్క ఉద్దేశము. ఈ రివర్ ఛానల్సు క్రింద సాగుచేసుకొనే రైతులు చాలా కష్ట నష్టములకు గురికావలసి వస్తున్నది. వాళ్ళకు ఎంతో అన్యాయము జరుగుతున్న దని చెప్పగలను. బసివిరెడ్డి గారు చెప్పినట్లు ఆ రైతులు ఒక యకరం భూమిని సాగుచేయటానికి నీళ్ళు ప్రవహించేటట్లు చేయుటకు 40,50 రూపాయలు కడుతున్నారు. ఐతే యీ రివర్ ఛానల్సులోకూడా భేదాలున్నాయి. విశాఖ పట్టణం, శ్రీకాకుళం జిల్లాలలోఉన్న రివర్ ఛానల్సుక్రింద రైతులు హెచ్చుగా పనిచేయవలసిన అవసరం ఉండదు. అచ్చటి నదులలో హెచ్చుగా ఇసుక ఉండదు. కాని సీడెడ్ డిస్ట్రిక్టులో అనగా అనంతపురం, కర్నూలు, చిత్తూరు, కడప మొదలయిన జిల్లాలలోని రివర్-ఛానల్సు యొక్క పరిస్థితి వేరు విధంగా ఉంటుంది. ఒక్కొక్కసారి రెండు, మూడు, నాలుగు మైళ్ళ పొడవున ఏటిలో కాలువలు త్రవ్వవలసి వస్తుంది. కాలువలు చాలా వెడల్పుగా చేయవలసి ఉంటుంది. ఎంతో ఇసుకను త్రవ్వివేయవలసి వస్తుంది. గాలి వీచినాకూడా ఇసుక కాలువలోనికి పడి మేట వేస్తుంది. ప్రతిదినమూ కూడా దానిని తీసివేయ వలసి ఉంటుంది. ఐతే విశాఖపట్టణం, శ్రీకాకుళం జిల్లాలలోని పరిస్థితి ఇలా ఉండదు. అచ్చటి నదులలో ఇసుక హెచ్చుగా లేదు. చిన్న కట్టకడితే నీరు పారు తుంది. రాయలసీమలోని ఏటి కాలువల పరిస్థితి ఇందుకు భిన్నంగా ఉంటుంది. ఈ విషయము లన్నింటిని గురించి పరిశీలన చేసి అప్పటి కేబినెట్ వారు ఒక తీర్మానమును చేశారు. ఆ ప్రభుత్వము చేసిన తీర్మానమును సాధ్యమైనంత త్వరలో ఆచరణలో పెట్టవలెనని కోరుతున్నాను. దీనిని గురించి ప్రభుత్వము దీర్ఘంగా ఆలోచన చేసి కావలసినటువంటి లెజిస్లేషన్ను తీసుకొని వచ్చి ఆ భూములపై డ్రై రేట్లు మాత్రమే విధించవలెనని కోరుతున్నాను. ఒక వేళ వెట్ రేటును తీసివేయలేకపోతే యీనాడు రైతులు చేయవలసిన మరమ్మత్తును ప్రభుత్వమే చేసి ఆ భూములపై వెట్ రేటును తీసుకోవలసి ఉంటుంది. అయితే అది ప్రభుత్వమునకు సాధ్యమైన పని కాదేమో ననుకుంటాను.

ఈనాందారులను గురించి కొద్దిగా మనవిచేస్తాను. యీనాందారీలను, జమీందారీలను ఒకే తరగతి క్రింద తీసుకొనివచ్చి రద్దుచేయవలెనని తీర్మానము తీసుకొన్నాము. ఆ విషయమును గురించి ఎలాంటి భేదాభిప్రాయమూ ఉండ కూడదు. ఐతే ఇపుడు రైత్వారీ గ్రామాలుగా చేయనటువంటి యీనాం గ్రామాలు కొన్ని ఉన్నాయి. మేల్వారం హక్కు మాత్రమే ఉన్న గ్రామాలను రైత్వారీ గ్రామాలుగా మార్చాము. ఐతే మేల్వారం, కుడివరం హక్కులు

రెండూ ఉన్న గ్రామాలు కొన్ని ఉన్నాయి. 1948వ సంవత్సరంలో జమీందారీ రద్దు చట్టం చేసినపుడు ఇట్టి గ్రామాలను ఎగ్జంప్టు చేశారు. ఐతే ఈవిధంగా ఎగ్జంప్టు చేసినందుకు అసలు కారణమేమో నేను చెప్పలేనుకాని ప్రభుత్వము అట్టి గ్రామాలకు యివ్వవలసిన కంపెన్‌సేషన్ చాలా హెచ్చుగా ఉంటుంది అనే కారణం చేతనే వాటిని అప్పుడు వదలిపేశారని నా నమ్మకం. ఐతే ఇప్పుడు ప్రభుత్వం ఆ గ్రామాలను కూడా రైత్వారీ గ్రామాలుగామార్చి యినాములనన్నింటినీ రద్దు పర్చవలసినదని తీర్మానించారు. అది జరుపవలసినదే. 1948వ చట్టం ముఖ్యంగా పెద్ద పెద్ద జమీందారులకు వర్తించే చట్టము. దానిలో కొన్ని ప్రావిజన్సును చేసినారు. ఆ ప్రావిజన్సును ఇప్పుడు మేల్వారం, కుడివరం అను రెండు హక్కులూ కలిగినటువంటి గ్రామాలకు కూడా వర్తింపచేయుటంవల్ల ఆనావశ్యకమైన కాఠిన్యమును చూపుతున్నారని నా నమ్మకం. మేల్వారం హక్కు మాత్రమే ఉన్న గ్రామాలకు మేల్వారం, కుడివరం అను రెండు హక్కులు గల గ్రామాలకు కొంతభేదం చూపడం న్యాయమని నాఉద్దేశము. ఒకటి రెండు విషయాలలో భేదంచూపించవచ్చు, కాంపెన్‌సేషన్ విషయంలో అట్టి యీనాం గ్రామాలకు హెచ్చుగా కాంపెన్‌సేషన్ ఇస్తే సంతోషమే. అది ప్రభుత్వంవారి ఆర్థిక స్థితిపై ఆధారపడి ఉంటుంది. ఆ విధంగా వారుచేస్తే సంతోషమే. మరొకవిషయం కూడా మనవిచేస్తాను. ఈనాందార్లు చాలమంది స్వంత సేద్యం చేసుకుంటున్నారు. వారు కొన్ని భూములను స్వయముగా సాగులోనికి తీసుకొనివచ్చారు. అందులో 1947-48 సం. లకు పూర్వము జీ. యమ్. యఫ్. కాంపేన్‌కు అనుగుణముగా ప్రభుత్వం వారి సహాయంతో యీనాందారులు చాలా భూములను సాగులోనికి తీసుకొని వచ్చారు. ఎంతో కష్టపడి డబ్బుఖర్చుపెట్టి ఆ భూములను సాగులోనికి తీసుకొని వచ్చారు. అటువంటి భూములను ఆ యీనాందారులకే యిచ్చినట్లయితే వేరుగా కాంపెన్‌సేషన్ ఇవ్వవలసిన అవసరం లేదు. వారు ఇంతకాలమూ స్వంతముగా సాగుచేసుకున్న భూములను వారికిఇవ్వడం కొంతవరకు న్యాయము. ఆ భూములకు కాంపెన్‌సేషన్ ఇవ్వవలసిన అవసరంకూడా లేదు. ఇటువంటి భూములకు సంబంధించి ప్రత్యేకంగా ఒక శాసనమును తీసుకొని వచ్చినట్లయితే ఇటువంటి విషయములన్నిటినీ గురించి ఆలోచించుటకు వీలవుతుంది. అంతేనే కాని 1948వ సంవత్సరంలో జమీందారీలను రద్దు చేయుటకు తయారుచేసిన చట్టములో యిచ్చిన డెఫినిషన్‌ను యీ గ్రామములకు కూడా వర్తింపచేయడం అన్యాయమని మనవిచేస్తున్నాను. ఐతే ఆ చట్టంలో కూడా 1945వ సంవత్సరం జూలై నుంచి ఏ భూమి అయినా యీనాందారు వరుసగా సాగుచేసుకుంటూంటే ఆ భూమి అతనికే ఇవ్వబడుతుందని ఉంది. కాని ఆ సదుపాయం తరువాత రెండు మూడు సంవత్సరములు

పిమ్మట సాగులోనికి తీసుకొనిరాబడిన భూములకు వర్తింపదనడం న్యాయం కాదు. ఈనాందారులు గ్రోమోర్ ఫుడ్ స్కీములక్రింద ఎంతో డబ్బుఖర్చుచేసి ఆ భూములను సాగులోనికి తీసుకొనివచ్చారు. అటువంటి వారికి ఆభూములను లేకుండా చేయడం అన్యాయం. ఐతే ల్యాండు రిఫారమ్స్ వస్తున్నాయి కనుక అలా చేయడమే సబబని అనవచ్చును.

**Land reforms** లో ఒక మనిషికి హెచ్చుభూమి ఉండకూడదనేది ఉద్దేశమైనట్లైతే ఆ **land reforms** వచ్చినప్పుడు ఇనాందార్లు ఈ దినం సాగు చేసే భూములను వారికి పట్టాకు ఇచ్చినట్లైతే, అవి చాలా హెచ్చుగా ఉన్నట్లయితే, ఈ **land reforms** క్రింద వస్తాయి. వాళ్లు తప్పించుకోలేరు. అనేక మంది వ్యవసాయంలో ప్రవేశించి హెచ్చుగా, నూర్లు, వేలుకూడా ఖర్చుపెట్టు కొన్నటువంటివారు చాలామంధి ఉన్నారు. అయితే ఇదివరకు సాగుచేసు కొంటూ వచ్చినారు కాబట్టి ఆ ఫలితాన్ని అనుభవించారు. ఈ వేళ లేకుండా పోతేమటుకు ఏమి అనే ఒక **argument** కొందరు చెప్పవచ్చు. దాంట్లోకూడా ఇరుకు ఒకటి ఉన్నది. భూములవిషయం, వ్యవసాయము ఏమాత్రం తెలిసిన వారుకూడా ఇది ఒప్పుకోకతప్పదు. మొట్టమొదట కొన్ని సంవత్సరాలు, అంటె 2, 3 లేక 4 సంవత్సరాలు పట్టాభూములను సాగులోకి తీసుకువచ్చే టప్పుడు, వాటికి ఎక్కువగా ఖర్చుపెట్టవలసిందే. ఆ ఖర్చుకు తగినఫలితము ఉండదు. మొట్టమొదటి 2, 3 సంవత్సరాలు ఫలితము ఉండదని చెప్పవచ్చు. రెండవది చెట్లు వేసినారనుకొంటే ఎవరైనా, ఆ చెట్లలో ఫలితాలు తీసేందుకు 10 సంవత్సరాలు పట్టవచ్చు. అంతవరకు ఆ చెట్లలో ఫలితముకూడా రాదు. ఇటువంటివి ఎన్నో ఇబ్బందులు ఉన్నాయి. కాబట్టి ఈ విషయంలో 1945 జులై అంటె ఆ **act** ప్రవేశపెట్టిన నాటినుంచి ఈ 12 సంవత్సరాలు **continuous** గా వ్యవసాయం చేసినవాళ్ళకు పట్టాలు ఇవ్వాలని అనుకొంటే ఈదినం సాగుచేసుకొంటున్నటువంటి వాళ్ళకు, ఈ 5, 10 సంవత్సరాలు లేకపోయినా, 3, 4 సంవత్సరము లైనప్పటికీ, సాగుచేసు కొంటున్నటువంటి వాళ్ళకు ఈ రైత్వారీపట్టా ఇవ్వడం న్యాయము, ధర్మము. ఈ ఉద్దేశంవల్ల కఠినత్వం వహించవలసిన అవసరంలేదు. ఇనాందార్లు అవస్థపడే విషయాన్ని గురించి అనేకమంది ఇదివరకే చెప్పినారు. కొన్ని గ్రామాలలో అనవచ్చు, ఇంతవరకు ఏమిచేస్తున్నారు ఈ ఇనాందార్లు, 20, 30, 40 సంవత్సరములనుండి దున్ను కోకుండా అని. వాస్తవంగా ఈ ఇనాంభూములు బీడుభూములు, ఎవరైనా సాగుచేసేవాళ్ళు ఉంటే వాళ్లకు గుత్తకు ఇచ్చిఉంటారు. ఇతర **tenants** కు ఇచ్చి నట్లైతే ఏదో వరుమానంవస్తూ ఉంటుందని, ఎవరు సాగుచేయనటువంటిచోట్లను ఎవరు సాగుకు రానటువంటి చోట్లను ఇనాందార్లు ప్రవేశించి ఏదో ఇప్పుడు ఉత్పత్తిచేస్తే మనకు కొంతలాభంగా ఉంటుంది. అది దేశానికి, ప్రభుత్వానికి

అందరికికూడ సహాయకరంగా ఉంటుందని క్రొత్తభూములను సాగులోకి తీసుకు వస్తే ఆవిధంగా కష్టపడినటువంటి వారికి ఈ దినము ఆ భూములను ఇవ్వడం న్యాయమని నా నమ్మకము. బీడుభూములను వారికి ఇచ్చినప్పటికిన్నీ కుడి వరం హక్కు కూడా వారికి ఉన్నది. అది ఎట్లైనా కానివ్వండి. ఆఖరుకు సాగుచేసిన భూములను తప్పకుండా వారికి ఇవ్వవలెనని చెప్పుతూ, ప్రభుత్వము ఈ విషయాన్ని గురించి ఆలోచించ వలసిందని మనవిచేస్తూ ఇంతటితో విర మించు కొంటున్నాను.

శ్రీ యు. రంగబాబు (ఇచ్ఛాపురం) : అధ్యక్షా ! ఈ Revenue పద్దును బలపరుస్తూ minor irrigation క్రింద మంజూరు చేసినటువంటి amount చాల దని చెప్పడానికి విచారిస్తున్నాను. ఎస్టేట్ గ్రామాలలో ఇదివరకు జమీందారులు ఉండేటపుడు ఏదో విధంగా వారు ఆ irrigation సౌకర్యాలు చూస్తూ ఉండే వారు. అవిపోయి ఇప్పటికి 7, 8 సంవత్సరాలు అవుతుంది. అప్పటినుంచి ప్రభుత్వపరంగా ఆయా గ్రామాలలో ఎటువంటి irrigation సౌకర్యాలు లేవు. పోతే ఇప్పుడు ఇస్తున్నటువంటి డబ్బు ఏమాత్రను ఉపయోగపడదని నా విశ్వా సము. ఇప్పుడు ఒక్కొక్క ప్రాంతములో ఎంత మొత్తం అవుతుందో ఆయా ప్రాంతాలకు సంబంధించినటువంటి over seers కొన్ని amounts sanction కోరక పైకి పంపించారు. వారు పంపించినటువంటి amounts 50 వేలు ఉంటే మొత్తంగా ఈ grant వల్ల వాళ్ళకు లభించేది 10 వేలు మాత్రమే ఉంటున్నది. అయితే ఏవిధంగా ఈ పరిస్థితిని చక్కపరచడం ? ఇపుడు national extension service blocks మొదలైనవి ఉన్నాయి. అందులో irrigation కోసం ప్రభుత్వము కొంత మొత్తము sanction చేసి యున్నది. మొన్న seminar లో ప్రభుత్వము ఈ irrigation విషయమై ఏదో pass చేసి నట్లు తెలుస్తున్నది. ప్రజలు అప్పురూపకంగా తీసుకోదలచిన ధనమును ప్రభు త్వమువారే కేంద్రమునుండి అప్పుగా తీసుకొని minor irrigation works కు హెచ్చు మొత్తాలు వినియోగించి శాశ్వతమైన repairs చేయించ సంకల్పించి నట్లు తెలిసింది. అయితే అవి ఇంతవరకు అమలులో పెట్టలేదు. ఇకమీదట అది పెడితే కొంత హెచ్చుగా irrigation సౌకర్యాలు చేయడానికి అవకాశ ముంటుంది. అది ఒక జమీందారీ ప్రాంతాలకే కాకుండా రైత్వారీ areas కు కూడా వర్తిస్తుంది. కాబట్టి అది ప్రభుత్వము త్వరగా తలపెట్టాలని కోరుతు న్నాను. ఇక land reforms గురించి మనవారు చాలావరకు ముచ్చటించారు. Land Reforms తెనుగు దేశంలో అవసరమే కాని ఈ land reforms లో ఇంత హెచ్చు పట్టుదల మనకు కలగడానికి కారణం Central Government నుంచి వస్తున్న తాకీదులే. దేశములో ఒక reformation తెచ్చిపెట్టాలంటే ముందుగా భూసంస్కరణలు చేయనిదే ఏ reformation లో కూడా ముందుకు పోము

అనేది Central Gevernment వారియొక్క ఉద్దేశము. అయితే ఇది అన్ని ప్రాంతాలకు కూడా వర్తిస్తుందని నా మనవి. బీహారు, ఒరిస్సాలో ఈ land reforms అమలుపెడితే హెచ్చుభూమి రైతులకు ఇవ్వడానికి అవకాశ ముంటుందేమోనని నా నమ్మకము. కాని, ఆంధ్రప్రదేశ్ పరిస్థితి దృష్టిలో పెట్టుకుంటేమధ్య తరగతి రైతాంగం హెచ్చుగా ఉన్నది. ఇప్పుడు వారి దగ్గరనుంచి ఎంతవరకు మనం తీసికోగలం ? Land reforms అమలు పరుస్తున్నా మని అన్నప్పుడు పేద రైతాంగములో కేవలం భూమిలేని నిరుపేదలలో ఒక ఆశ జనిస్తుంది. అందులో వారు ఎంతవరకు సఫలీకృతులు కాగలరో తెలియడం లేదు. కాని వారిలో అధికంగా ఆశ కల్పించి తుదకు నిరుత్సాహము తెచ్చిపెట్టి నట్లయితే అది మరొక విధమయిన విప్లవానికి దారితీస్తుందేమో. అయితే మన ఆంధ్రదేశ రైతాంగానికి సంబంధించినంతవరకు సామాన్యమైన రైతుకుటుంబానికి ఎంత భూవిస్తీర్ణం ఉండాలి ? 300 రూపాయలు వారికి net profit ఉంటే సరిపోతుందని అంటున్నారు. నిజమే సరిపోవచ్చు. మూడువందల net profit వచ్చే విధంగా ఎన్ని కుటుంబాలకు సరిపోతుంది. సరిపోయిన తరువాత ఎంత మిగులుతుంది, ఎంత భూమి మనకు వస్తుంది, ఎంతమందికి మనము పంచిపెట్టగలము ? పంచిపెట్టవలెనంటే ఏ నిష్పత్తిలో ? అనేది చూడవలసి యుంటుంది. కాంగ్రెసులో land reforms సిద్ధాంతము ఉన్నదికాబట్టి దానికి కాంగ్రెస్‌వారుకూడా వ్యతిరేకించరని నా విశ్వాసము. తరువాత ఇప్పుడు గ్రామ మునసబు మొదలగు గ్రామోద్యోగస్తు లందరు ఏదో సమ్మె చేస్తామని బెదరిస్తున్నారు. ప్రభుత్వము వారి బెదరింపులకు జడవనక్కరలేదు. అయితే ఈ గ్రామ మునసబులు మొదలగు గ్రామోద్యోగస్తులు పని చేయకపోతే పోనీ వారి hereditary rights ను తీసివేస్తే, మనకేదో graduates దొరుకుతారు, వారు గ్రామాలకువస్తే బాగా సుకరంగా పనిఅవుతుంది, ఆపని మేము చేసుకొంటాము అని చెప్పడం సరియైన సమాధానంకాదు. అదిపొరబాటైన అభిప్రాయము. వారిని మరింత హెచ్చరిక చేసినదిగా ఉంటుందితప్ప మరేమికాదు. ఈనాడు గ్రామాలలో ఉన్నటువంటి గ్రామమునసబులు మొదలగువారు వారిపని చక్కగా నిర్వహిస్తూంటె దానికి మనం సంతోషించవలసిందే. కాని ఈపని, ఒక graduate, అతనికి ఎంతజీతము ఇచ్చినా, సక్రమంగా నిర్వహిస్తాడని నాకువిశ్వాసంలేదు. పోతే, ఇప్పుడు ఉన్నటువంటి ఈ గ్రామమునసబుల వ్యవస్థ ఉంచాలా లేదా అనేదానిమీద ప్రభుత్వము సమగ్రంగా ఆలోచిస్తే బాగుంటుంది. ముఖ్యంగా గ్రామమునసబు కంటె గ్రామ కరణమునకు హెచ్చుగా పని ఉంటుందని నావిశ్వాసము. గ్రామ కరణములేనిదే ఏలెక్కలురావు. ఇప్పుడు sur charge మొదలైనవాటిని గురించి ఎన్నెన్నోలెక్కలు వేస్తున్నాము. వీటన్నింటికి మూలకందం ఆ గ్రామ కరణమే. భూవిస్తీర్ణం, అడంగళ్లు మొదలగులెక్కలన్నీ తయారుచేయాలన్నా,

ఇంకేదైనా statistics collect చేయాలన్నా వాటన్నింటికి కరణమే ఆధారంగా ఉంటాడు. కనుక ఈగ్రామ కరణాలను అట్లాగేఉంచి వారికి lower division clerk's జీతమో లేక మామూలుగా గ్రామాలలో ఇస్తున్నటువంటి school teacher జీతమో యిచ్చి, అది ఒక permanent వ్యవస్థగాచేస్తే బాగుంటుంది. ఇక గ్రామమునసబులను ఉంచాలా లేదా అనేది తరువాత ఆలోచించి, ఉంచాలనుకొన్నట్లయితే, వారుకోరుతున్న కోర్కెలు అవసవ్యంగా ఏమీ కన్పించదు. చాలావరకు వారికోర్కెలు meet చేయాలి. అది సాధ్యంగానప్పుడు, వారితో కష్టాలుచెప్పి వారిని అసంతృప్తులుగా చేయకుండా చూడవలసిన బాధ్యత ప్రభుత్వముమీద ఉన్నది. అంతేగాని ఈవిధంగా services నుంచి తిరుగుబాటుతనాన్ని తెచ్చిపెట్టుకోవడం భావ్యంకాదని నావిశ్వాసము. ఇక ప్రభుత్వ యంత్రాంగం విషయమున్నది. ఇదిబాగానే ఉన్నది. పనులు సక్రమంగానే నడిపిస్తున్నాము. అయితే జిల్లాలలో ఎంతవరకు మన జిల్లాఅధికారులు మన వ్యవహారాలను పూర్తిగా అమలుపరుస్తున్నారు అనేది మనం విచారించవలసియున్నది. ఇప్పుడు ఏదైనా ఒక వ్యవహారం ప్రభుత్వము, కొన్ని కష్టాలవల్ల, సరిగాచేయలేకపోవచ్చు. కాని కొన్ని చేస్తున్నప్పటికినీ, ప్రజలకు ప్రభుత్వంపట్ల సంతృప్తిభావంలేకపోవడానికి కారణము కొంతవరకు ఈ జిల్లా అధికారులేనని చెప్పవలసి యుంటుంది.

శ్రీకాకుళం జిల్లాలో హెచ్చుగా ఉన్నవని చెప్పలేను గాని ఒక కేసు విషయంలో పిటిషన్ పెటితే రెండు సంవత్సరములవరకు సమాధానం రాలేదు. ఇది ఉద్యోగస్థుల మీద reflection కు చెప్పటానికి కాదు. అటువంటి విషయాలు సరిదిద్దుకోవాలంటే డిస్ట్రిక్టు లెవెల్‌లో, ఒక Public Relations Officer ను వేస్తే, ఆయన గ్రామాలలో ఏమేమిపనులు కావలెనో, చూచుకొనుటకు వీలవుతుంది. సమీపంలో ఉన్న ఒరిస్సా రాష్ట్రములో ఆవిధంగా Public Relations Officers ను వేశారు. ప్రజలనుంచి కాగితాలు వెళ్ళితే అవి ఎక్కడ ఉన్నవో, ఏరూపములో ఉన్నవో చూచి సమాధానం యిస్తూఉంటారు. ఆఫీసులలో జాప్యంలేకుండ పనులుజరుగుటకు అవకాశం ఉంటుంది. ప్రజలకుకూడ ప్రభుత్వంపై ఎక్కువ విశ్వాసం ఏర్పడుతుంది. కాబట్టి Public Relations Officers ను district level లో వేస్తే బాగుంటుందని సూచిస్తూ యింతటితో విరమిస్తున్నాను.

*Sri K. V. Vema Reddi (Kadiri)*: Mr. Speaker, Sir, at the fag end of the debate I do not propose to take much time, and also the time given to me is very limited.

In supporting the Demand, I wish to state a few facts for the consideration of the hon. Minister for Revenue and in so doing I shall deal, at the outset, with the subject of land reforms or the

distribution of the ownership of land to the land-less poor. There was, no doubt, a debate at great length on the subject of land reforms. There is, however, no use of going into details on the subject of land reforms, which is a long-agitated issue and on which there is no difference of opinion. Land reforms bristles with several difficulties. We need not emulate Russia or China: it must be congenial to the genius of this country and we should also bear in mind several factors in order not to jeopardise the production and also not to jeopardise the implementation of the second five-year plan. Further, we have no idea at present about the nature of the Bill that will be brought before this House. It is therefore, too premature to go into details. The difference in the fertility of the soil presents many difficulties in the fixing of the maximum holdings of land and the ceiling on land. All these factors must be well considered before we implement the land reforms. No doubt, there is no big volume of opposition against land reforms except from a few people, but still in the implementation of land reforms we cannot be so revolutionary as in China or in Russia, and the process must be very slow. That is my submission to this House.

As regards district administration, I wish to submit that our administration still retains that tinge of British bureaucracy in a brown form and that is, we have inherited the legacy of the red-tapism, i.e. delay in the disposal of business, delay in the disposal of petitions pertaining to small matters, etc. as referred to by some of the hon. Members of this House. This is true, Sir, but this can be remedied and I am sure that the Government is really sincere about it and wishes to bring about a great change in the administration.

At the District level, the Collector is the head of the District and with his multifarious activities several functions are combined in him. The Collector, as the head of the District, has to look to revenue matters, he has to look to the maintenance of law and order; he is the Chairman of the Regional Transport Authority; and he has to preside over the destinies of the District Board, which is a dead-weight to this Government. With all these functions combined in him, it is difficult for him to have a proper check over the various Departments. My submission is that instead of having District Collector as the Chairman of the several Committees, involving so many social and nation-building services, he can be divested of some of the functions. For instance, the District Judge can be the Chairman of the Regional Transport Authority and the Red Cross Society and other Committees can be entrusted to non-officials.

Corruption was referred to by many hon. members of this House. Corruption is age-long and it cannot be eradicated overnight. There is corruption both among officials and non-officials. To

eliminate corruption the co-operation of the public and of the representatives of this House is needed. I am sure that with the zeal, drive and integrity of the Chief Minister corruption will be eliminated with the co-operation of the hon. Members.

Many hon. Members have spoken about minor irrigation schemes. But I want to refer to the scarcity areas, the famine-affected areas in Rayalaseema, the red-soil areas of Kadiri, Penumakonda etc. where there are a large number of tanks which have to be repaired and renovated and their supply sources have to be improved. It was during the days of famine that a few minor tanks were taken up. In this area, the minor tanks play an important part and the Government should pay special attention to the renovation of these minor tanks. The progress of the minor irrigation supervisors, I think, is very slow; they take a lot of time and a lot of delay is caused in the preparation of the estimates and also in the execution of the work. That has to be remedied by the Government.

Many hon. Members have spoken about Village Officers. I am proud to say that I was myself a Village Munsiff for two years and I know the difficulties of the Village Officers. It is a hereditary system; even today they retain the hereditary rights. The Government also sympathises with their demands but the Village Officers should also realise the gravity of the situation so far as the financial position of this State is concerned and they should rest content with the educational medical and other facilities that are to be conceded by this Government.

For the publicity scheme, an amount of Rs. 65,000 has been allotted in the budget. In this connection I want to submit that the publicity scheme is not up to the mark. The publicity of our schemes under the five-year plan and of the work of this Government does not reach the villages. The villages do not know the implications of the second five-year plan. It is necessary that the publicity scheme should be well-developed and the Publicity Officer should go to the villages mainly and not concentrate on the urban areas and propagate the work done by this Government and the schemes taken up the under the second five-year plan.

As regards discretionary grants of Collectors, I wish to submit that these grants are intended to finance the people, but the Collectors, are guided by their whims and fancies. The fancies vary according to the temperaments of the Collectors and the purpose of these grants is defeated. Judicial discretion must be exercised in the grant of these sums of money.

With these few words I take leave of the House.

*Mr. Speaker*: Now I have only 10 minutes to give. I call upon Sri B. Sankaraiah to conclude the debate.

*శ్రీ బి. శంకరయ్య (బుచ్చిరెడ్డిపాలెం-రిజర్వుడు) : అధ్యక్షా, ఇంతవరకు జనరల్ డిస్కషన్‌లోగాని, కట్ మోషన్స్ సందర్భంలోగాని అనేకమైన ముఖ్య విషయాలు ప్రభుత్వదృష్టికి తీసుకునచ్చినప్పటికి కూడ, ఆ విషయాలుగురించి రెవిన్యూ మంత్రిగారు తమ జవాబులో చెప్పలేదు. పోనీ, ఆ విషయాలు వదిలివేశారా, అంటే లేదు. ఆ విషయాలను తీసుకువచ్చికూడ, జవాబు చెప్పకుండా ఉన్నారు. "మొదటి పంచవర్షప్రణాళిక, రెండవ పంచవర్షప్రణాళిక ఆధారంచేసుకొని మేము 56 లోను, ఇప్పుడూ కొన్ని చట్టాలు చేశాము" అన్నారు. 1956 లో తీసుకువచ్చినటువంటి ఇనాము చట్టములో, రైతులకు ఎక్కువ సౌకర్యాలు కలుగజేస్తామని, 'ఇనాము' అన్నదానికి నిర్వచనము ఎక్కువచేసి, ఖండ్రికలు మొదలైనవాటినికూడ ఇనాముగా చేస్తామనిచెప్పారు. ఈవిధంగా చేస్తామనిచెప్పిన చట్టం అసెంబ్లీలో పాసై, డిశంబర్ ఐదవ తేదీన ప్రసిడెంటు సంతకం అయి వచ్చింది. 'ఈ చట్టంక్రింద ఎన్ని ఇంప్లిమెంట్ చేశారు, ఎన్ని ఇనాములు ఎస్టేట్లుగా చేశారు, ఇదివరకునుండి దున్నుకొంటున్నటువంటి రైతులకు ఎంతమందికి వారి హక్కులను లీగల్‌గా స్థిరపర్చారు,' అని అడిగితే ఇంతవరకు దానికి మంత్రిగారు సమాధానం చెప్పలేదు. ఈ చట్టంవచ్చిన ఆరు మాసాలలోపల, అంటే జులై ఐదవతేదీలోపల పిటీషన్ పెట్టేటట్లయితేనే, ఆ భూములు పోగొట్టుకొన్న రైతులకు హక్కు లుంటాయని చెప్పారు.

"Every person who on the 17th January 1945 was in possession claiming to be a tenant of any land which has become an estate by virtue of this Act"

దీనిక్రింద అటువంటి ప్రొటక్షన్ కావాలన్నప్పుడు చట్టంవచ్చిన 6 మాసాలలోపల అర్జీలుపెట్టుకోవాలని చెప్పారు. జూన్ 5వ తేదీకి 6 మాసాలు అయిపోయినవి, కాని అర్జీలు పెట్టటానికి రూల్సుకూడ ఇంతవరకు తయారుకాలేదు. "ఇటువంటి గ్రామాలు నెల్లూరు జిల్లాలో 80 కు పైగా ఉన్నాయి. ఈ గ్రామాలను యీ చట్టంక్రింద ఎస్టేటుగా చేయవలసినదిగా ప్రకటించవలసి ఉంటుందని" చెప్పి ఇదివరకే ఒక లిస్టు తయారైంది. అటువంటప్పుడు యీ విధంగా ఇంతవరకు రూల్సు ప్రకటించకుండా ఉండటానికి కారణమేమిటి ? దీనివల్ల అనేక తగాదా లేర్పడ్డాయి. ఇవన్నీ కోర్టులలోకి పోయాయి. హైకోర్టుకు సుప్రీమ్‌కోర్టుకు పోయి ప్రజలు అవస్థ పడవలసివస్తోంది. ఒక చెరువు బాగుచేయించాలంటే, ఏ ఐదువేలో, పదివేలో పెడితేగాని కాదు. అటువంటప్పుడు, యీ ఇనాందార్లు ఇప్పుడు కోర్టుకెళ్లి ఉన్నందువల్ల ఎవరూ పదివేలుపెట్టి చెరువులు బాగుచేయించటము లేదు. అందువల్ల వ్యవసాయం క్షీణించిపోతున్నది. ఈ సమస్య త్వరగా తేలటానికి, తక్కిన గ్రామాలను కూడ ఇంప్లిమెంట్ చేయటానికి ప్రభుత్వం త్వరగా చర్యలు తీసుకోవాలని కోరుతున్నాను. ప్రభుత్వం ప్రకటించింది; ఇనాములను రద్దుచేయటం తన ఆశయమని చెప్పింది. మా జిల్లాలో 80 గ్రామాలు

ఉంటాయని అనుకొన్నప్పుడు, ఆ గ్రామాలను యీ చట్టంక్రిందకు ఎందుకు తీసుకురాలో అర్థంకాదు.

మొత్తం అన్నిజిల్లాలలోను కలిసి, యీచట్టంక్రింద రావలసిన గ్రామాలు వెయ్యి, ప్రభుత్వ దృష్టిలో ఉన్నాయన్నారు. ఇంకా వెయ్యి గ్రామాలయినా, యీ చట్టంక్రింద ఇదివరకే ప్రభుత్వం డిక్లేర్ చేసి ఇప్పుడు తీసుకోకుండా ఉన్నటువంటివి ఉన్నాయి. ఈ చట్టం ఇంప్లిమెంట్ చేయకపోవడంవల్ల ఇంత నష్టం కలుగుతోంది. రైత్వారీ గ్రామాలకు అనుబంధంగా ఉండే కంద్రికలు మొదలైన ఎన్నో వేల ఎకరాల భూములలో అక్కడి రైతులకు ఇదివరకే శాశ్వతమైన హక్కులున్నప్పటికీ, వాళ్ళకు అమ్ముకొనే, కొనుక్కునే హక్కులున్నప్పటికీ, ఆ గ్రామాలలో ఉండే అన్ని వేల ఎకరాలను అక్కడున్న ఇనాందార్లకే పట్టాలిస్తున్నారు. పంచవర్ష ప్రణాళికల లక్ష్యమైన దున్నేవానికే భూమి ఇవ్వాలనేదానికి ఇది ఏ విధంగా అనుగుణంగా ఉన్నదని అడుగుతున్నాను. మా జిల్లా ఒక్కటీ చూస్తేనే, 81 గ్రామాలు, 30 వేల ఎకరాలు దీనిక్రింద ఉన్నాయి. త్వరలో ఒక ఎమెండిమెంటు తీసుకువచ్చి, దీనిని సవరణచేస్తామని, అక్టోబరు 1956 లో, యీ బిల్లు పాస్‌చేసేటప్పుడు రెవిన్యూ మంత్రిగారు ప్రభుత్వం తరపున హామీ ఇచ్చారు. కాని, ఇంతవరకు అటువంటి అమెండుమెంటు తీసుకురాలేదు. దీనివలన, ఇదివరకు ఎన్నడూకూడ భూములు క్లెయిమ్ చేయనటువంటి ఇనాందార్లు యీ చట్టాన్ని ఆధారం చేసుకొని అనేక గ్రామాలలో నోటీసులిస్తున్నారు. మీరు భూములనుండి తొలిగిపొమ్మని, రైతులకు ఇనాందార్లు నోటీసులిస్తున్నారు. రైతులకు రిజిష్టర్లున్నాయి. వారు భూములు కొనుక్కుంటున్నారు, అమ్ముకొంటున్నారు. వారు నాలుగైదు రూపాయలు శిస్తు కడుతున్నారు. ప్రభుత్వం మా జిల్లాలో సేకరించిన లెక్కల ప్రకారం చూస్తే, 81 గ్రామాలలో 30 వేల ఎకరాలు ఉన్నట్లు తెలుస్తుంది. ఇప్పుడు 30 వేల ఎకరాలలో సాగుచేస్తున్నటువంటి రైతాంగాన్ని తొలగించటానికి ఇనాందార్లు ప్రయత్నం చేస్తున్నారు. ప్లీడర్లచేత నోటీసు లిప్పిస్తున్నారు. కాబట్టి, ఇదివరకునుంచి ఉంటున్నటువంటి రైతుల హక్కులను ఊడబెరక్కుండా, భూములను ఇనాంధార్లకు స్వంతకమతాలుగా ఇవ్వకుండా, రైతులకు ఇటువంటి అన్యాయాలు జరగకుండా చేయటానికి ప్రభుత్వం వెంటనే యీ చట్టానికి సవరణ తీసుకువచ్చి, ఇదివరకే తాము రైతులకు చేసిన హామీలను నెరవేర్చవలసి ఉన్నది. "ఈ చట్టంగురించి ఎంతవరకు ఆలోచించారు. ఎంతవరకు దీనిక్రింద స్టెప్స్ తీసుకొన్నారు" అన్న విషయాలన్నీ మంత్రిగారు తెలియజేయవలసి ఉన్నది. సెలెక్టు కమిటీలో మొన్ననే ఒక బిల్లు పాస్‌చేశాము. కాని మీరు ఎన్ని బిల్లులుపెట్టినా ప్రతి ఇనాము గ్రామంగురించి తగాదాలు ఎక్కువవుతున్నాయి. 1904 లో ఇంపోర్టబల్ ఎస్టేట్సు యాక్టును చేసేటప్పుడు ఒక మెడ్యూల్

ప్రకటించారు. మళ్ళీ తగాదాలు లేకుండా, కోర్టులకు పోకుండా, ఏ గ్రామాలకు యీ చట్టం వర్తిస్తుందని అన్నారో, ఆ గ్రామాలలో అటువంటి సమస్య తిరిగి తలెత్తకుండా ఉన్నది. దినదినం చట్టాలు రావటంవల్ల ఇంకా తగాదాలు ఎక్కువ అవుతున్నాయి. కాబట్టి మీరు యీరోజునైనా ఒక షెడ్యూల్‌ను ప్రకటించాలని కోరుతున్నాను. మంత్రిగారు యీ చట్టముతో ఇనాము సమస్య దాదాపు పూర్తి అవుతుందని చెప్పారు. మధ్యదశారులకు హక్కు లేకపోయినా వాళ్లకు భూముల మీద పట్టాలిచ్చి యీ సమస్యను పూర్తిచేస్తారా ? లేక ఇదివరకునుండి హక్కులున్నటువంటి రైతులకు ఆ భూమి ఇచ్చి, వారికి పట్టాలిచ్చి, ఆ భూములను రైత్వారీ భూములుగా మార్చి యీ సమస్యను పూర్తిచేస్తారా ? అని అడుగుతున్నాను. సమస్య ఎలాగైనా పూర్తిచేయవచ్చు. రైతులందరికీ భూములు లేకుండా ఆ భూమినంతా ఇనాందారులకే ఇచ్చి ఆ సమస్య పూర్తిచేయవచ్చు. లేదా ఇదివరకటినుండి హక్కు ఉండి, భూమి దున్నుకొంటున్న రైతునకు ఆ భూమి ఇచ్చి ఆ సమస్యను పరిష్కారము చేయవచ్చు. భూమి దున్నేవాని హక్కులకు ఏవిధంగాను భంగం కలిగించకూడదని ప్లానింగ్ కమీషన్ చెప్పింది. బీద రైతులయొక్క, వ్యవసాయ కూలీలయొక్క, దున్నుకొనే రైతులయొక్క హక్కులకు ఏవిధమైన భంగంరాకుండా యీప్రభుత్వం చట్టంచేసినపుడే ఇనాము సమస్య నిజంగా ప్లానింగ్ కమీషన్ ఆశయాలప్రకారం పూర్తవుతుంది. ప్లానింగ్ కమీషన్ యీ భూసంస్కరణలను పరిష్కరించాలని ఆదేశాలిచ్చిన తర్వాతనే మన రాష్ట్రంలో ఇంకో చట్టం వచ్చింది. చాలామంది కౌలుదారి చట్టం వస్తుందనిచెప్పి, ఇదివరకే కౌలుదార్లను భూమినుంచి తొలగించారు. లక్షలఎకరాలు మన రాష్ట్రంలో ఉంటుంది అనుకొంటే ఇప్పుడు మనకు వచ్చిన దెంత? నాలుగు ఐదు వేల పిటీషన్లు తహశీల్‌దార్ దగ్గరకు వచ్చాయి. తహశీల్‌దార్ ద్వారా భూస్వాములకు నోటీసు ఇచ్చినా "స్వయంగా మీరు ఇవ్వలేదు కాబట్టి యీ పిటీషన్లు కొట్టివేసినా"మంటున్నారు. "మమ్మల్ని యీ భూములనుంచి తొలగిస్తున్నారు, మాకు రక్షణ కలుగజేయండి" అని పిటీషన్ పెట్టుకోనేధానికి చట్టంలో అవకాశాలు కలిగించలేదు. రూల్సులో గాని, చట్టంలో గాని "ఇదిగో నేను ఇన్ని సంవత్సరాలనుంచి సాగుచేస్తున్నటువంటి భూమినుంచి నన్ను గెంటివేస్తున్నారు, దౌర్జన్యం చేస్తున్నారు, తొలగించటానికి చూస్తున్నారు" అని రైతులు అర్జీ పెట్టుకోటానికి లేదన్నమాట. ఈ విధంగా అటువంటి అర్జీలు తీసుకోటానికి ప్రొవిజన్ కలుగజేయలేదు. గ్రామాలలో కౌలుదారు భూమి సాగు చేస్తుంటే, లెక్కలలో భూస్వామి పేరుక్రిందనే సాగవుతున్నట్లు వ్రాస్తారు గాని కౌలుదార్లు చేస్తున్నట్లు వ్రాయరు. భూమి ఎవరిదైనా, సాగుచేసినవారు వీరని వీరి పేరుకూడా రికార్డులలో నమోదు చేయకూడదా అని అడుగుతున్నాను. దీనిని గురించి ఇవాళ ఉదయం ప్రశ్న అడిగితే అందుకు మనవద్దగర చట్టం లేదన్నారు. చట్టం లేకపోయినా ప్రభుత్వం చేయవచ్చు. ఫలానా భూమిలో

ఫలానా కౌలుదారు ఉన్నాడని ప్రభుత్వానికి తెలియవలసిన అవసరం ఉంటుంది. "మీకు వేరే ఎవిడెన్సులేదు, అందువల్ల మిమ్మల్ని భూములనుండి తొలగిస్తున్నాం" అని చెబుతున్నారు. పెట్టిన నాలుగైదువేల పిటీషన్లు అలాగే ఉంటాయి.

అంతేకాకుండా యిప్పుడు Religious Endowment Board ప్రభుత్వానికి సంబంధించిన ఒక శాఖ సాధ్యమైనంతవరకు యీ Act క్రింద తగ్గించడానికి వీలులేకుండా చేసేయమని క్రింది Executive offlicer కి instructions ఇచ్చారు. ప్రభుత్వంలో ఒక భాగమయిన ఆ శాఖ ప్రభుత్వముచేసిన చట్టాన్ని implement చేసే బదులు Pleaders ను పెట్టి హైకోర్టుకు పోవడానికి సంసిద్ధులవుతున్నారు. దేవస్థానం భూములలో న్యాయమైన 50% మక్తా నిర్ణయించడానికి వీలు లేకుండా చేస్తున్నారు. రెమిషను కోరితే 10 బస్తాల ధాన్యం deposit చేయ లేదు కనుక పిటిషను కొట్టిపారేస్తాం అంటున్నారు. అసలే పంటలు పండలేదు; యీ అయిదు బస్తాలు మాత్రమే పండాయి, వాటిని deposit చేస్తాం అంటే వినడంలేదు. ఈ రకంగా చేసిన చట్టాలు అమలుపరచకపోవడంవల్ల కౌలుదార్లు నానా అవస్థలు పడుతున్నారు. దున్నేవాడికే భూమి యిస్తాం అంటున్నారు. అసలు భూములలో ఉండి దున్నుకునేవాడికి కనీసమైన హక్కులనైనా రక్షించడానికి శ్రద్ధ తీసుకోకపోవడంవల్ల యిటువంటివన్నీ జరుగుతున్నాయి. మా జిల్లాలో 10వేల ఎకరాల చెఱువుతట్లు, డెల్టాక్రింద ఎటువంటి ఆయకట్టుదార్లకు హానిలేనటువంటి భూములలో సేద్యం చేసుకుంటూవుంటే ప్రతి సంవత్సరం నోటీసులివ్వడం, penalty లు వేయడం, పైరు కోసుకొనడం జరుగుతున్నవి. ఎంతో కాలంగా యీ విధంగా జరుగుతోంది. అనేక పర్యాయాలు అసెంబ్లీలో ఈ విషయం తీసుకువచ్చిన తరువాత గత సంవత్సరం శ్రీ గోపాలరెడ్డి గారు రెవిన్యూ సెక్రటరీ మొదలయినవారితో meeting జరిపి దీనిని ఇంజనీరు, కలెక్టరు పరిశీలించి ఎక్కడెక్కడ ఏ ఏ చెఱువులలో ఎంతమంది సాగుచేస్తున్నారో అంత మందికి proposals పంపించాలన్నారు. ఇప్పటికి ఇంజనీర్లు, కలెక్టరు వచ్చి పరి శీలించలేదు సరికదా 10 percent, 10 percent మొత్తం రాళ్లువేసి రాళ్ళకు సున్నంకొట్టి అక్కడనుంచి పోవాలంటున్నారు. ప్రభుత్వం ఒకసారి పరిశీలన చెయ్యమని చెప్పిన తరువాత Executive Engineer, కలెక్టరు పరిశీలన చేయడానికి బదులు penalty లు వేస్తునే వున్నారు. మనమంతా దేశంలో పంటను అధికం చేయాలంటున్నాము. అలాంటప్పుడు 5 ఎకరాలలో పండిన పంటను, 1500 రూపాయల విలువచేసే పంటను స్వాధీనం చేసుకుని వేలం వేసిన తరువాత పశువులనుతోలి స్వయంగా రెవిన్యూ ఆఫీసరు, తహసీల్దారు దగ్గరుండి మేపించారు. ఇంతకన్నా అన్యాయం యేమన్నా వుంటుందా ? ఇది ముఖ్యమైన ఆహారసమస్యకు సంబంధించినది. కాబట్టి దీనిని వెంటనే పరిష్కరించాలని మే నెలలో ప్రశ్న పంపించాను. ఇప్పటి కింకా జవాబు రాలేదు.

రెవిన్యూ మంత్రిగారి నడిగితే మళ్లా short notice question క్రింద తీసుకు రావలసివచ్చింది. ఇది న్యాయం కాదని కలెక్టరు దృష్టికి తీసుకువచ్చాను. 50, 60 బస్తాలు పండిన పంటను ఎందుకు మేపించాలి? తరువాత శ్రీ కొండయ్య గారు భూసంస్కరణలను గురించి కొన్ని విషయాలు చెప్పారు. ఇదివరకు యీ భూస్వాములు భూములమీద గుత్త అధికారం తీసుకుని పరాయి ప్రభుత్వం protection లో వున్నటువంటివాళ్ళు యీ రోజున కాంగ్రెసు ఆశయాలకు భిన్నంగా కాంగ్రెసు చేసినటువంటి తీర్మానాలకు భిన్నంగా యీ రోజున భూ సంస్కరణలు వద్దని చెబుతున్నారు.

*Sri D. Kondaiah Chowdary:* I did not say that I did not want land reforms. What I said was, let us go in the light of experience, and secondly when we are adopting ceilings let there be ceilings for all incomes. I never said that we do not want land reforms.

శ్రీ బి. శంకరయ్య : వారు వద్దన్నారా, వుండాలన్నారా అని కాదు. 1931 లో కరాచీ కాంగ్రెసులో కాంగ్రెసువారు తీర్మానంచేశారు. దానిని వ్యతిరేకించినటువంటివాళ్లు యీ రోజున యిక్కడకు వచ్చి "అబ్బే, మాకు భూసంస్కరణలు వద్దనడంలేదు. కాకుంటే ఆలస్యం చేయమన్నాం" అనేది ఒకరు, "దానిని అన్నిటితో పెట్టమన్నాం" అని ఒకరు. అసలు యిప్పుడు ఆలస్యం చేస్తుంటేనే ordinance ప్రకటించడంతోనే అన్నీ అమ్ముకుంటున్నారు. తరువాత భూసంస్కరణలు పెట్టికూడా ప్రయోజనం యేముంది ? తరువాత రెవిన్యూ డిపార్టుమెంటుకు సంబంధించినంతవరకు కొంత ద్వంద్వవిధానం కొనసాగుతోంది. ఒకటి రెండు ఉదాహరణలు చెబుతాను.

మిస్టర్ స్పీకర్ : ఉదాహరణలు అక్కరలేదు. ముగించండి.

శ్రీ బి. శంకరయ్య : ఇప్పుడు ఇక్కడి డిపార్టుమెంటు చేసేపని ఆ డిపార్టు మెంటు మాత్రమే చేసేటట్టుగా చేయాలని కోరుతున్నాను. జమీందారుల దగ్గర అడవులను స్వాధీనం చేసుకున్నారు. ఫారెస్టు డిపార్టుమెంటువారు ఒకసారి వేలంవేసి 'పుల్లరీ' వసూలుచేస్తున్నారు. మళ్లీ రెవిన్యూ డిపార్టుమెంటువారు దానినే కంచెలు పుల్లరీ క్రింద తీసుకుంటున్నారు. ఇటువంటి ద్వంద్వ విధానం సాగుతోంది. చెరువును బాగుచేయాలంటే P. W. D. పరిశీలించి estimate వేస్తే మళ్లీ administration sanction అని చెప్పి Revenue Department కి వస్తుంది. దానివల్ల పనులు సరిగా జరగక మూలపడుతున్నాయి. అనవసరమైన సిబ్బందిని తగ్గించి అర్జీలు పెట్టుకున్నా వాటి పరిష్కారానికి తగినటువంటి సిబ్బందిని వుంచితే త్వరగా సమస్యలు పరిష్కారం అవడానికి వీలవుతుంది. ఆ విధంగా ఆలోచించాలని కోరుతూ శలవు తీసుకుంటున్నాను.

శ్రీ కె. వెంకటరావు: అధ్యక్షా! 35 గురు గౌరవసభ్యులు నిన్న, యివ్వాళ జరిగిన యీ డిమాండుమీద తమయొక్క అభిప్రాయాలను తమకు వ్యక్తపరచారు. కాని మొత్తంమీద వారు మాట్లాడిన విషయాలన్నిటినీ పరిశీలిస్తే రెండు పెద్ద headings క్రింద తీసుకురావచ్చు. ఒకటి, భూసంస్కరణలగురించి; రెండోది పరిపాలనలో జరుగుతున్న లోపాలోపాలను గురించి. భూసంస్కరణలక్రింద కొంచెం హెచ్చుతక్కువగా ప్రతిసభ్యుడు మాట్లాడినట్టే. కాంగ్రెసువారు తమవిధులను నిర్వర్తించడంలేదని కొంతమందికి బాధగావుంది. కొంతమందికి యీ నిర్వర్తించడం గుఱ్ఱపుపందెం రేసులో వెళ్ళుతోంది. ఇంకొంచెం కళ్ళెం బిగపడితే బాగుంటుందని తోచింది. శ్రీ శంకరయ్యగారికి మాపార్టీమీద దయవున్నందుకు చాలాసంతోషం. కొన్నాళ్ళు మాపార్టీలో వుండేవారు. మళ్ళీ ఇప్పుడున్నపార్టీవదిలిపెట్టి వస్తారేమో తెలియదు. మేముచేసిన లోపాలోపాలను గురించి ఆయన అంత బాధపడవలసిన అవసరం లేదు. మేము చేసినతప్పులు యేమయినావుంటే judgment చెప్పేవారు శ్రీ శంకరయ్యగారు కాదు. మూడు కోట్ల రెండు లక్షలమంది ప్రజలు, కోటి 70 లక్షల మంది వోటర్లు ఎప్పటికప్పుడుసమాధానం చెబుతారు, ఒకమాటు మీకుఅనుకూలంగా, ఒకమాటు మాకు అనుకూలంగా. కాని పర్యవసానంలో ఎవరిపక్షాన వారు సమాధానంచెబితే వారు నడిపిస్తున్నటువంటి కార్యక్రమం మొత్తంమీద ప్రజామోదం పొందుతుందనేటటువంటి విషయాన్ని మృగ్యం చేసుకుందుకు వీలులేదనే సంగతి వారికికూడా తెలుసును. అందువల్ల కాంగ్రెసువారు అక్కడచెప్పారు, ఇక్కడచెప్పారు, అలా చేయలేదు, యిలాచేయలేదు అనికాదు. ఇదిచేయలేదు, ఇదిప్రజలకు లాభిస్తుంది అని చెప్పవలసినన్యాయం వారికుందిగాని, ప్రతిపక్షంలో వుండి యీపక్షం చేయలేదనేబాధ వారికెందుకు? మనం చేయదలచుకున్న భూసంస్కరణలు చేస్తున్నామా? ఎంతవరకు చేశాము? ఇంకా ఎంత త్వరలో చేయాలి? అనేటటువంటి వ్యవహారం ఇది. ఇదికొంత క్లిష్టమయిన సమస్యయని అందరికీ తెలుసును. భూమికిస్వామ్యం ఎవరిది? దీనిమీద ఎవరుపనిచేస్తున్నారు? దీనిలోంచి వచ్చేఉత్పత్తి ఏమిటి? ఈఉత్పత్తిలో ఎవరిభాగాలు ఎంతెంత? వీటియొక్క సమన్వయమే భూసంస్కరణలు. ఈ సమన్వయాన్ని తీసుకురావడం కోసం సంఘంలో ఆరోజునవున్న అవకాశాలనుబట్టి అసలు దేశంమొత్తంమీద ఉత్పత్తికావలసిన పదార్థ సముచ్చయాన్నిబట్టి మనం నిర్ణయించుకోవలసి వుంటుంది. ప్రపంచం ఉద్భవించినప్పుడు మనకు ఆ చరిత్ర మొదటినుంచీలేదు. ఒకసంగతి మాత్రంతెలుసును. మనిషి అటవికస్థితిలో వున్నటువంటి రోజులలో 25 చదరపుమైళ్ళ విస్తీర్ణంలో అతను ఒక జంతువుక్రింద తిరిగితేనేగాని, అతనికి కావలసిన కందమూల ఫలాదులు లభించేవి కావని చరిత్ర చెబుతున్నది. క్రమేణా మనిషి మనిషై కొన్ని జంతువులు అతనికి స్వాధీనమై దేశంలో సాంకేతికమైన సహాయం, యంత్రం, అతనికి లోబడిన తరువాత ఆ 25 చదరపు

మైళ్ళు రెండు ఎకరాలకు దిగినది. కాని ఈ రెండు ఎకరాలుకూడా ప్రతి మనిషికి - ప్రపంచంలోని అందరు మనుష్యులకు - అనుభవంలోనికి తీసుకువచ్చే పరిస్థితి ఇంకా దక్కలేదు. దేవుడు చేసిన సృష్టిలో ఒక లోపం చేసాడు అనుకుంటాను. జనాభా అభివృద్ధికి ఏర్పాటు చేసాడు, కాని అంత rate లోను భూమి అభివృద్ధి జరగడానికి వీలులేకుండా చేసాడు. అసలు చేయలేదు అంటే ధర్మంకాదు. పురాణకాలంలో వ్యవసాయంలో ఉన్న భూమికంటె ఈ రోజున ఎక్కువభూమి వ్యవసాయంలో ఉన్నది. ఇంకా ఎక్కువ చేస్తున్నాము. ఇంకా ఎక్కువ చేయవలసిన బాధ్యత ఉన్నది మనమీద. కాని భూమి ఎదిగే rate, జనాభా ఎదిగే పరుగుకు పోటీపెడితే జనాభా యుద్ధంలో గెలుస్తోంది. భూమి ఓడిపోతోంది. అందుచేత తమముందు పెట్టిన నాలుగు సమస్యలకుకూడా తీవ్రతరమైన సంఘర్షణ కొంతవరకు ఉన్నది. ఈ సంఘర్షణను మనం తొలగించుకోడంలోనే మన దేశంయొక్క అభివృద్ధి కనబడుతుంది. రెండవ విషయం ఏమిటంటే, ఈ భూమిమీద దాహం హెచ్చుగా ఉన్నది. ముఖ్యంగా మన దేశంలో, ఒకాయన చెప్పాడు - ఎడారిలో ఒక మనిషి వెడుతూ బాగా దాహంగా ఉంటే ఎదురుగుండా ఒయాసిస్ - రెండు కొబ్బరిచెట్లు, నీళ్ళు ఉంటాయనే ప్రదేశం - కనిపిస్తుంటే త్రాగాలని ఎంత ఆదుర్దా ఉంటుందో అంత ఆదుర్దా మన దేశంలో పుట్టిన ప్రతి మనిషికి నాకు ఒక యకరం, అధమపక్షం ఒక సెంటు, భూమి అయినా ఉంటే బాగుంటుంది అనే దృష్టి ఉన్నది. కాబట్టి సంస్కరణలలో ఒక ప్రధానమైన విషయం pride of ownership - నాకు ఇది ఉన్నది అనే భావం విషయంలో మనిషిని సఫలీకృత మనోరథుణ్ణి చేయడం; అందువలననే మొదటి పంచవర్ష ప్రణాళికలో ఉత్పత్తికి ప్రధానస్థానం ఇచ్చి భూసంస్కరణల స్వరూపాన్ని నిర్ణయించారు. రెండవ పంచవర్ష ప్రణాళికలో ఒక ఉత్పత్తి మాత్రమే ప్రధానంకాదు. సాంఘిక న్యాయానికికూడా ప్రాధాన్యత ఇవ్వాలనే విషయం రెండవ పంచవర్ష ప్రణాళిక 9వ అధ్యాయంలో ఉన్న 25, 30 పేజీలలో చాలా స్పష్టీకరించి పెట్టారు. ఈ ప్రభుత్వం ఈ సభవారుకూడా తమ తీర్మానరూపంగా 2 వ పంచవర్ష ప్రణాళికలోనున్నటువంటి సూత్రాలకే పూర్ణమైన ఆమోదం తెలిపారు. అందువలన దానిలో వివరించిన విషయాలను వచ్చే 5 సంవత్సరాలలో సాధించే విషయంలో నిరంతరమైన కృషి చేయవలసిన ధర్మం, బాధ్యత సభమీద, ప్రభుత్వంమీద ఏర్పడి ఉన్నదని నేను వేరుగా చెప్పనక్కరలేదు. ప్రభుత్వం దీనిలో చెప్పినటువంటి విషయాలకు సాధించే విషయంలో భిన్నాభిప్రాయం లేదు. భిన్నాభిప్రాయం లేకపోవడమే కాకుండా దీనిని అనుకూలంగా సాధించేటటువంటి విషయంలో కూడా తమ కార్యక్రమాల ద్వారా పూర్ణమైన యత్నం చేస్తుందని తమకు మనవిచేస్తున్నాను. భూమి, వ్యవసాయం విషయంలో కొంచెం త్రికోణాత్మకమైన సమస్య ఉన్నది. దీనిలో భూస్వాము

లున్నారు. కౌలుదారు లున్నారు. వారి దగ్గర పనిచేసే కూలీలున్నారు. ఈ ముగ్గురి మధ్య జరుగుతున్న వ్యవహారం ఇది. ఈ మూడింటిని సమన్వయపరిచి, నాలుగు సమస్యలతో పాటు సాధించవలసిన ధర్మం మన మీద ఉన్నది. తమకు సూచించినట్లు జనాభా ఎక్కువై దేశంలో పంటభూమి అంత విస్తృతంకాని పరిస్థితులలో దేశంలో నిరుద్యోగసమస్య చాలా హెచ్చుఅవుతుంది. ఈ నిరుద్యోగ సమస్య పరిష్కారంకోసం దేశంలో పరిశ్రమలు, ఇతర వృత్తుల అభివృద్ధినికూడా మనం ఒక రైలును ఒకరైలుమీద నుంచి రెండవరైలుమీదికి తీసికొనివెళ్లేమాదిరి తీసుకెళ్లకపోతే వ్యవసాయాభివృద్ధితోనే ఈ సమస్య పరిష్కారం జరుగదనే విషయం కూడా రుజువుఅవుతున్నది. ఇంకొక విషయం కూడా వచ్చినది. గత 50 సంవత్సరాలలోను అంతర్జాతీయంగా ప్రపంచంలోని అన్ని రాజ్యాల మధ్య ధరవరల విషయమై, ఉత్పత్తి విషయమై, ఉత్పత్తియొక్క వినియోగంవిషయమై కొంత సంబంధం ఏర్పడింది. 200 సంవత్సరాల క్రిందట ఏదైనా ఊరిలో వ్యవసాయదారుడు ధాన్యం కొంచెం హెచ్చుగానో, తక్కువగానో పండించుకుంటే అది తన వినియోగానికి ఎక్కువగా కాని తక్కువగా కాని ఉపయోగించుకునే పరిస్థితి ఉండేది. దానికి ధరలేదు. మా గ్రామంలో కూలీ మగవారికి కుంచెడు ధాన్యం ఇస్తారు అనుకోండి. ఆ కుంచెడు ధాన్యం విలువ ఒకనాడు రూపాయి ఉంటుంది; మరొకరోజున కానీ ఉంటుది. కానీ, 2 కానులు, 3 కానులు ఉన్నరోజులున్నాయి. లేకపోతే గోదావరి ఆనకట్ట 9 లక్షల 32 వేల రూపాయిలతో కట్టిఉండరు. ఈ రోజులలో దానిలో వంద ఇటుకలు వేయడానికి కోటి రూపాయిలు estimate అవుతుంది. అటువంటి పరిస్థితి కాదనలేరు. ఆ పరిస్థితులనుంచి ధరవరలు చాలా ఉన్నతస్థాయిలో వెళ్లాయిఅంటే international influences అన్నీ కూడా మన గ్రామంలో పండించే కుంచెడు ధాన్యం మీద, మీశెడు ప్రత్తి మీద, జొన్నకంకి మీద పడుతోందనే సంగతి మనం గుర్తుంచుకోవాలి. వీటన్నింటి సమన్వయ ఫలితం క్రింద మనం మన వ్యవహారాన్ని చేసుకోవడంలో ఇంకొక విషయాన్నికూడా పునాదిగా దృష్టిలో పెట్టుకోవలసియున్నది. ఒకటి, తమకు మనవిచేసినట్లు, భూస్వామ్యానికి అవకాశం కలిగించాలి. Opportunity for ownership అనేది ఒక basis మన సంస్కరణలో. రెండవది: ఊరికే ఎక్కడో జంచెరాయిని x కో, y కో ఇచ్చినంతమాత్రాన అయ్యో, దేవుడా అంటే పండదు; రోదనంచేస్తే పండదు; గంతులువేస్తే పండదు. చెట్లు కొట్టాలి; పొదలను తీసివేయాలి; దానిని దున్నాలి; దానికి నీళ్లో, వానో, దేవుడో సహాయపడాలి. అపుడు పండుతుంది. అందుచేత pride of ownership తో పాటు assistance కూడా ఆధునికమైన పద్ధతులలో ఒకటిగా ప్రధానమైన స్థానం ఆక్రమిస్తున్నది. అందువలన credit కావాలి. తరువాత మార్కెటింగ్ సౌకర్యాలు, అప్పుపుచ్చుకోవడం, ఇవ్వడం; తయారైన వస్తువులకు సరియైన ధరలు అందుబాటులో ఉండేట్లు అమ్మడం; తరువాత

ఉత్పత్తిని ఎక్కువచేసుకోవడం— మంచి విత్తనాలను వేయడంవలన కాని, ఉదాహరణకు జపాన్ వరిసాగువలన గాని, మరొకరకంగా గాని ఈ వేళ ఒక కుంచెడు పండితే రెండు కుంచాలు ఏ రకంగా పండుతాయి అనే విషయాలను విద్యావిహీనుడైన వ్యవసాయదారునికి సలహాలు ఇవ్వడానికి agricultural advisory services కావాలి. మొత్తంమీద, తనంతతాను కనీసం ప్రభుత్వంవారు ప్రచురించే 'పశుసంపద' అనే magazine ను అయినా చదువుకుని ఈ క్రొత్త పద్ధతులను అలవాటుచేసుకొనేమాత్రం విద్య అయినా దేశంలో వ్యాప్తి కావాలి. ఈ రకంగా సర్వతోముఖమైన organisation ను ఏర్పరిస్తేకాని ఈ సంఘటన రూపంగా తప్ప ఇంకొక రకంగా వ్యవసాయపద్ధతులను కాని మన దేశాన్ని ఎదుర్కొనే వ్యవసాయ సమస్యలను కాని పరిష్కారం చేయలేమనే విషయం కూడా తెలుసుకోవలసిన న్యాయం ఉన్నది. ఇంకొక విషయం కూడా మన దేశంలో అలవాటుపడిఉన్నది. ప్రపంచంలో రెండురకాలైన వ్యవసాయం నడుస్తోంది. ఒకరకమైన వ్యవసాయం 'కోల్కోస్' అంటారు. గ్రామంలోని చేనిగట్లు దున్ని ఊరంతా గ్రామంలోపుట్టిన ప్రజలదే అనుకుని—ఉజ్జాయింపుగా చెబుతున్నాను; ఇదే కాదు correct గా చెప్పాలంటే పనిచేసి, పెట్టుబడులు ప్రభుత్వానికి ఇచ్చే పన్నులు పోగా మిగిలిన పంటను తామందరూ పనిచేసిన గంటల లెక్కప్రకారం లాభాలను పొందడం ఈ పద్ధతి. ఈ రకమైన experiments కొన్ని జరుగుతున్నాయి. రెండవది సహకార సిద్ధాంతం మీద ఆధారపడినది. ఇది రెండురకాలున్నది. ఒకరకం కొంచెం హెచ్చుతక్కువగా ఇప్పుడుచెప్పినదే. రెండవ పద్ధతి, భూస్వామ్యం పోగొట్టకుండా నాకు ఉన్న ఎకరం నాకు అట్టే పెట్టి, చిన్నవారందరిని చేర్చి ఒక సంఘంగా పెట్టి— ప్రతివాడు tractor తెచ్చుకోలేడు కనుక ప్రతివానికి ఎరువు తెచ్చుకోడం కష్టంకనుక— కావలసిన పదార్థాలన్నింటిని సంపుటీకరణచేసి వ్యవహారం నిర్వహించడం, మూడవపద్ధతి; మనదేశంలో అమలులో ఉన్నదీ, ప్రపంచంలోని చాలా దేశాలలో ప్రస్తుతం ప్రోత్సహింపబడుతున్న పద్ధతి ఒకటి ఉన్నది. అదే small peasant, తక్కువ భూస్వామ్యం కలిగిన వ్యక్తిచేత intensive cultivation చేయించి, అనేకరకాలైన ఎక్కువ పురోభివృద్ధికరమైన పంటలు పండించే పద్ధతి. ఈమధ్య చాలా పుస్తకాలు చూడడం తటస్థించింది. Family Farming, అంటే కుటుంబమే ఒక unit గా వ్యవసాయం చేసి ఎక్కడైతే పని జరుగుతుంటుందో, ఆ దేశంలోనే మనం అనుకునే ప్రజాస్వామ్య పద్ధతులకు ఎక్కువ ఆస్కారం ఉన్నదనే విషయం మనలాంటి వెనుకబడ్డ దేశాలలోను, ముందుపడ్డ దేశాలలోను కూడా కనిపిస్తోంది. మొదటి యుద్ధానికి పూర్వం యూరపులోని తూర్పు దేశాలలో ఒకరకమైన భూస్వామ్యపద్ధతి ఉండేది. ఎంత గొప్ప భూస్వామి అని చెప్పుకునేవాన్నికైనా ఇక్కడ ఒకటి రెండువేల ఎకరాలుంటాయి; అట్లాంటివారు రాష్ట్రానికి ఒకరో ఇద్దరో ఉంటారు, కాని

యూరపులో 20 లక్షల ఎకరాలకు ఒకాయన అధిపతిగా ఉంటూ ఉండేవారు. మొదటియుద్ధం తరువాత ఈ పెద్దభూస్వామ్యాలను చిన్నభాగాలక్రింద ఖండాల క్రింద కొట్టి వ్యవసాయం ప్రోత్సహించారు. తరువాత రాజకీయమైన తిరుగు బాటులవలన చాలా దేశాలలో **Collectivist Cultivation** వచ్చింది. రెవిన్యూ డిమాండులో కోలోక్స్ గురించి నేను మాట్లాడదలచుకోలేదు.

కాని ఈమధ్య, వారంరోజులక్రిందట రేడియోలో విన్నాను. దీనికి ప్రధానమైన ప్రోత్సాహంకల్పించిన రష్యాదేశంకూడా, యికపైన కలెక్టివ్ కల్టివేషన్‌కు స్వస్తిచెప్పి, **individual farming** కు ఏవో కొన్ని **conditions** పెట్టి ప్రోత్సాహంఇస్తే బాగుంటుందని ఒకసమయంలో ఒకనిర్ణయానికి వచ్చినట్లు నాస్వంతచెవులతో విన్నాను. కాని రేడియోవార్తలు నిజమో, అబద్ధమో నేను చేప్పలేను. కాని ఒకటి, మనం పత్రికలలో చదివినవిషయాలతోపాటు భావ పరిణామమే కాకుండా భావవిప్లవ ప్రయత్నాలు వస్తున్నాయి. ఒకభూఖండంలో చుట్టూకోటగోడకట్టినాకూడా, అక్కడ కొత్త అభిప్రాయాలు, వెళ్ళకమానవు. వెళ్ళినప్రకారం మార్పుచేసుకోవటములో ఏవిధమైనతప్పులేదు. అందువల్లమనం ఈసమగ్రమైన భూసంస్కరణలు తీసుకురావటంలో నేనుచెప్పిన ఈ సంగతులన్నీ దృష్టిలోపెట్టుకొని చేయవలసివుంది. తమఎదుటజరిగిన చర్చలో కొన్నివిషయాలు తమదృష్టికివచ్చాయి. ఆంధ్రరాష్ట్రానికి సంబంధించినవి రెండు విషయాలు వున్నాయి. ఒకవిషయం ఏమిటంటే తెలంగాణా అనబడే ప్రాంతములో 'హైదరాబాద్ ఎగ్రికల్చరల్ అండ్ టెనన్సియాక్టు' అనేది అమలులోవుంది. ఆంధ్రప్రాంతములో అటువంటిచట్టం యింకాలేదు. యింతేకాకుండా భారత దేశంలో యింతవరకు జరిగిన భూసంస్కరణలు అన్నిటిలోను తెలంగాణాలో వున్న శాసనము, శాసనస్థాయిలో వున్నది. యింకా ఎక్కడా, ఏరాష్ట్రంలోను చేయలేదు.

బొంబాయిలో **Land to the tillers Act** అని 1-4-1956 న వచ్చింది. కాని అక్కడకూడా తెలంగాణాలో వున్నస్థాయిలో లేదు. మిగిలిన ఇతర రాష్ట్రాలలోకూడా లేదనేచెప్పవచ్చు పోతే ఇటువంటిశాసనం కాశ్మీరులో వుంది. కాశ్మీరులో నష్టపరిహారము ఇవ్వవలసిన అవసరంలేకుండా, వారుకొంత భూమితీసుకొని పంపకముచేసి వ్యవసాయాభివృద్ధి చేస్తున్నారు. మిగిలిన రాష్ట్రాల్లో **Present Holdings, Restrictional Cultivation,** ఇలాంటి వ్యవ హారాలమీద బిల్లులు ఇంతవరకువచ్చాయికాని శాసనాలు యింకాఎక్కడాలేవు. "ఇప్పుడు మనం అందరిలోకి **slow**" అని కొందరు అన్నారు, **fast** అని కొంత మంది అన్నారు. **Slow** గా వెళ్ళటానికి తెలంగాణా ప్రక్కనవుంది. **Fast** గా పోవడానికి మనచుట్టుప్రక్కలవున్న అన్నిదేశాలు కావటములేదు. మనమీద గురుతరబాధ్యత పడింది. ఎందుచేతనంటే ఇంతవరకు బ్రిటిష్ సిస్టమ్ ఆఫ్ లాండ్

రెవిన్యూలో ఎదిగినటువంటి ఇక్కడిజాగీర్దారీ ప్లస్ దివాని, మధ్యవచ్చినటువంటి సర్ఫెఖాస్ ఇక్కడ ఎదిగిన భూఖండంవుంది. ఈసందర్భంలో కొంతమంది స్నేహితులు చెప్పారు. "ఇక్కడఅమలుజరిగే విధానంలో లోపం జరుగుతోంది. చాలా అన్యాయాలు జరుగుతున్నాయని" వారు చెబుతున్నారు. "ఇదంతా అప్పుడేతీసుకువచ్చి అన్నిచోట్లాపెట్టకండి. ఉన్నకష్టాలు ఆలోచించండి. ఖమ్మం జిల్లాలో పెట్టారు. ములుగు తాలూకాలో పెట్టారు. కొన్నికష్టాలు ఏర్పడ్డాయి. ఏర్పడినకష్టాలను గుర్తించుకొని ముందు steps తీసికోవాలని" కొందరు చెబుతున్నారు. Act అనేది అమలులోవున్నతరువాత అది లోపభూయిష్టంగా అమలుజరుగుతున్నట్లయితే ఆలోపాలను సవరించుకొనే ధర్మం ప్రభుత్వానికి వుంది. యిదివరకు తెలంగాణాలో భూమి నూటికి నలభైవంతులు రైతుల స్వాధీనంలో వుండేదని కొందరు చెప్పారు. నేనునిన్న ఆఫీసుకువెళ్ళగానే యత్నం చేశాను. ఇదివరకువచ్చిన సెన్సెస్ప్రకారము మొత్తం హైదరాబాద్ స్టేట్‌ను 15% టెనన్సి క్రిందవుండేది. ఇప్పుడు 100 కి 16 వున్నట్లులెక్కలువ్రాశారు. సాంపుల్ సెన్సెస్ ఈలెక్కలు ఆంధ్రలో తీసికొంటే 100 కి 9 లోపుగానే వున్నట్లు తెలిసింది. అందువల్ల భూమిమీద సంస్కరణలు తెచ్చేముందు ఈరెండు దృష్టిలోపెట్టుకొన్నాము. "ప్రభుత్వమువారు ఒకటిచేస్తారనిచెప్పి అది ఆలస్యం చేయటంవల్ల ఇది ఒక వార్నింగ్ క్రిందవెళ్ళి వారిదగ్గర 200 ఎకరాలు ఉంటే ఈ సీలింగు ఉజ్జాయింపున 25, 30, 50 వస్తుంది. దానిలోపలవచ్చే యత్నం చేయాలనే భావంకల్గించి—ఆటోమాటిక్‌గా, ఇప్పుడు ధరవరలవల్ల కన్స్యూమర్ రెసిస్టెన్స్ అంటారే అలాగే—ఇక్కడ భూస్వాములయొక్క రెసిస్టెన్సుకు నేను ప్రోత్సాహం ఇస్తున్నాననే" విమర్శవచ్చింది. దానిగురించి చర్యతీసుకోవలసిన న్యాయంవుంది. దానికి తగినచర్య మనం శాసనం చేసుకొనే సమయంలో ఆలోచించుకోవాలి. ఇక రెండోవిషయం ఏమిటంటే, ఇక్కడ కొన్నిరకాలైన రికార్డులువున్నాయి. నిన్న ఒక సభ్యులు చెప్పారు. "ఖాస్రాఫారమ్ అని కొత్తది వచ్చింది. రికార్డు ఆఫ్ రైట్స్ 20 ఏండ్లవో, 10 ఏండ్లవో లెండి, ఈ రికార్డు ఆఫ్ రైట్స్ ప్రాపర్‌గా లేవు, నోరున్నవాళ్ళు వ్రాయించుకొంటున్నా" రని నిన్న నరసింహారావుగారు చెప్పారు. "తండ్రి కొడుకులు పంచుకుంటే బాగుంటుంది. అది చిరకాలంనుండి చేస్తున్న పనే. కాని కూతుళ్ళకు, మనుమలకు, యింకా ఎవరికో, పుట్టబోయేవారికి కూడా పంచి పెడుతున్నారు, అదిన్యాయం కాదని" చెప్పారు. అసలు అదీ శాస్త్రంలోనే వుంది. ఒక తండ్రికి నల్గురు కొడుకులు వుంటే పంచేటప్పుడు 'జనిష్యమాన భాగం' అని పుట్టబోయేవాడికి ఒక భాగం పెట్టుకొనే హక్కు, సాంప్రదాయము లేకపోలేదు. కాని ఇప్పుడు ఈవేళ ఈ ఆధునిక పరిస్థితులలో ఇవన్నీ సాధ్యమౌతాయా అనే విషయం మనం ఆలోచించుకోవాలి. అందువల్ల 5 పిల్లలుగల కుటుంబానికి ఎంత అట్టే పెట్టాలి అని చూడాలి. సరే ఇక్కడ 3,600 రు॥ సెట్ అని వుంది. 3,600రు॥

నెట్ ఎప్పటి ధరలమీద అనే విషయం ముఖ్యమైనది. దానిమీద కొంత గడబిడ ఏర్పడింగనుకొంటాను. ఈ హైదరాబాద్ యాక్టులో 'on the rates prevailing at the time of imposing the Act,' అని కాబోలు వ్రాశారు. ఇప్పుడు ఒక ఉదాహరణ చెబుతాను. వెస్ట్ గోదావరి జిల్లాలో ఒక గ్రామంలో ఈఏడు కాదు, ఒక ఏడాది, ఏడున్నర్ధం క్రితం పసుపువేసుకొన్న ఎకరమున్నట్లయితే 3,000 రు॥ వచ్చింది. ఇందులో 2,000 రు॥ నెట్. భూస్వామి దానిని 500 రు॥ కౌలుక్రింద ఇచ్చారు. అయితే 3,600 రు॥ లు ఆదాయ గరిష్ట పరిమితి అంటే 2 ఎకరాలవరకు మాత్రమే ఉండాలన్నమాట. ఈ విషయం ఒకరు చెప్పారు కనుక నేను చెప్పుతున్నాను. ఒక period of time పెట్టి average price fix చేయాలి. ఈవేళ మార్కెట్టులోవున్న ధరమీద ఒక్కొక్క వూరికి, ఒక్కొక్కజిల్లాకు ఒక్కొక్క పద్ధతి చేసుకోవటం న్యాయంకాదనే విషయం చెప్పారు. దాన్నిగురించి కూడా మనం చర్యతీసికొనేటప్పుడు ఆలోచించుకోవలసిన ధర్మంవున్నదని ఒకరిద్దరుసభ్యులు చెప్పారు." ఇప్పుడు అమలులో పెట్టిన ఖమ్మం జిల్లాలోను, ములుగు తాలూకాలోను అనుకోని పరిణామాలు కొన్ని వస్తున్నాయి. దానికి కారణాలు ఈ రకంగా చేయటంవల్ల ఈ తప్పు జరిగిందని " చెప్పారు. " ఇది ఇవాళ వచ్చిన ఫలితం, దీనిని దిద్దుకోవాలని " ఒకరు చెప్పారు. ఈ రెండింటిని మనం ఆలోచించుకోవాలి. " దీన్ని గురించి సమగ్రమైన విచారణ చేయాలి. " అని ఒకరు suggest చేశారు. యింకా ఆఫీసర్లు వేసే అంకెలు పూర్తి కాలేదు. ఇదివరకు మాకు offers వచ్చాయి. మీరు కంభం జిల్లాలో జరిపిన సంస్కరణల వల్ల social effect ఏమి వచ్చింది ? అనే విషయాన్ని విచారణ చేయటానికి మాకు ఏదో కొద్ది డబ్బు ఇస్తే మీ economy చూచి చెపతాం " అన్నారు. ఆ రకంగానో, యింకోరకంగానో దానియొక్క విచారణ జరిగింది. కాని అంత మాత్రంచేత pass అయిన Act ను రిట్ వేసి ఆపవలసిన అవసరం వుండదు. దాని వ్యవహారం మనం చేసుకోవచ్చు. యిప్పుడు చాలామంది మిత్రులు చేసిన విమర్శలలో కొన్నిటికి నా దగ్గర సమాధానాలు వున్నాయి.

ఒక విషయం ఏమిటంటే కొల్లేరు సరస్సు రెమిషన్‌ల గురించి అప్పారావుగారు చెప్పారు. కొల్లేరు సరస్సుకు పాతపద్ధతి తప్పితే అసలు నీటివసరు లేదు. నిన్న ముఖ్యమంత్రిగారు చెప్పినట్లు తుంగభద్రలో వున్న నీరును ఉపయోగించుకొనే పరిస్థితి యింకా ఏర్పడలేదుకనుక ఆ నీటిని కృష్ణానదిద్వారా బెజవాడ ఆనకట్టదగ్గరకు తీసుకువెళ్ళి కాలువలద్వారా పల్లంగా వున్న కొల్లేరు ప్రాంతానికి తీసుకుపోయి అక్కడ లక్షా, లక్షా ఏభై వేల ఎకరాలు భూమిలో ఇప్పుడు రెండో పంట చేయిస్తారు. ఆ రెండో పంటకు రెమిషన్ ఇవ్వటంలేదని అంటున్నారు. నేను ఆఫీసులో కనుక్కొంటే తెలిసిన విషయం ఏమిటంటే

18-1-1955 లో పాస్‌చేసిన G. O. ఫలితంగా ఇది ఎవరికో water charge ఇచ్చి తెచ్చుకోవాలి. ఆ విధంగా తెచ్చుకొన్నది ఉచితంగా ఇవ్వటం ఇక్కడ కుదరదు. కాని వారు చెప్పిన రెండవ విమర్శ సబబు అయినది. "ఎవరికి నీళ్ళు ఇస్తారో ముందుగా చెబితే, వారే ఆకుమడి చేసుకుంటారు. వాళ్ళే ఊడ్చు కొంటారు. కనుక ఈ కష్టం తప్పుతుందనే విషయం వారు చెప్పారు. అందువల్ల మనం దానిగురించి యికపైన ఇవ్వదలచుకొన్నదంతా సకాలంలోనే ఇచ్చే ఏర్పాటు చేయటానికి అభ్యంతరం వుండదు. క్లుప్తంగా కాలక్షేపం చేసుకొని, చెప్పినవారే వూడ్చుకొని, ఇవ్వవలసిన పన్ను ఇస్తే ఈ పరిస్థితులు ఏర్పడవని అనుకొంటాను. ఎప్పుడైనా అంత ఉధృతంవచ్చి, తుఫానువచ్చి, గాలివల్ల కొట్టుకుపోయి కొల్లేరులోకి వెళ్ళి, పూళ్ళమీద పడిపోయి పంటలకే ఆస్కారం లేకపోతే దానికి అసాధరణమైన చర్య తీసికోవటం ప్రభుత్వం చేతుల్లో ఎప్పుడూ ఉండనేవుంది.

తరువాత ఒక మిత్రుడు బహుశా ప్రసాదరావుగారు అనుకుంటాను, ఇజారా గ్రామాలను గురించి చెప్పారు. ఈ విషయములో నాకు కారణము దొరకలేదు గాని, వారు చెప్పిన మాటమాత్రము నిజమే. ఇజారా గ్రామాలలో పట్టాలు యివ్వడము మాత్రము ఆపుచేశారు. దానినిగురించి ప్రస్తుతము యీ గంట టైములో నేను information తెచ్చుకోలేక పోయినాను. ఇలాంటివి 286 గ్రామాలో 300 గ్రామాలో ఉన్నవి. వాటికి అనుకున్న ప్రకారము, యింత వరకు చేసిన నిర్ణయము ప్రకారము వాటియొక్క settlement జరిపించవలసి ఉంటుంది. ఒక్క కేసే నా దృష్టికి వచ్చింది. అది రావి నారాయణరెడ్డిగారు తీసుకొనివచ్చారు. కొన్ని గ్రామాలు పాకిస్తానుకు వెళ్ళినవారివి. అది Evacue Property అయింది. Evacue Properties control చేయగలిగిన Legislation, Sec. 34 of the Indian Evacues Act క్రింద రాష్ట్ర ప్రభుత్వాల చేతులలో లేదు. అందువల్ల ఒక అన్యాయము జరుగుతున్నది. ప్రక్క గ్రామాలలో రైతుకు Ryoti హక్కు వస్తున్నది. ఇజారా గ్రామాలలో Ryoti హక్కు లేకుండ భూమి అమ్మివేసి దాని proceeds ను Common Fund అని వున్నది, దానికి జమకట్టవలసి వస్తుంది. ఇది ఒక anomalay ఉన్నది. దీనిని గురించి Government of India వారికి ఏమిచేయటానికి వీలు అవుతుందో చూడవలసి యున్నది.

తరువాత పి. సూర్యనారాయణగారు శ్రీకాకుళంజిల్లా సభ్యుడు- ఆ జిల్లాలోఉన్న భూమిఅంతయు రాజకీయ బాధితులకే ఇచ్చివేస్తున్నారు, పేద వారికి ఏమి మిగలడము లేదని విమర్శించారు. అక్కడ భూమి ఎంతఉన్నదో పరిశీలించి చూస్తే, శ్రీకాకుళం జిల్లాలోఉన్న రాజకీయబాధితులు అందరుచేరి 239 మంది ఉన్నారు. ఇంతవరకు వారికి యిచ్చినభూమి 1502 ఎకరాల

8 సెంట్లు. ఇంకను యివ్వవలసినవారు 26 మంది ఉన్నారు. వారికి యివ్వటానికి 133 ఎకరాలు మాత్రము ఉంటేచాలు. ఇది అక్కడ పరిస్థితి. శ్రీకాకుళం జిల్లాలో భూమేలేదని అంటే, నేను విచారించినంతమట్టుకు. నాకు తెలిసినంత మట్టుకు అటు సాలూరుదగ్గరనుంచి ఇటు ఇచ్ఛాపురంవరకు సుమారు ఈ 1500 ఎకరాలే బంజరుభూమి ఉందా! దీనికి యింకా రెండు మూడు సున్నలు చుట్ట టానికి వీలుఅయినంతభూమి ఉన్నది. అక్కడ భూమిఅంతా రాజకీయబాధితులే తినివేస్తూన్నారని నింపకుగాని, అపవాదుకు గాని న్యాయమైన పరిస్థితిలేదు, అని నేను వారికి సవినయముగ మనవి చేస్తున్నాను.

తరువాత కోటిరెడ్డిగారు, బసిరెడ్డిగారు మాట్లాడుతు Spring Channels గురించిచెప్పారు. అ స్తమానము కొన్ని నదులలో ఎప్పుడుకూడ జలప్రవాహము ఉండదు. సైకత ప్రవాహము ఉంటుంది. అంటే ఇసుకె ప్రవహించాలి. దాని క్రింద నీరు ఉంటుంది. అందువల్ల ఎత్తునుంచి ఒక కాలవను భూమిదాకా త్రవ్వు కునివస్తే, నీరువస్తుంది. ఆనీటివల్ల వ్యవసాయము చేయవచ్చు. వాటికి అనేక పేర్లుఉన్నవి. శ్రీకాకుళంజిల్లాలో బొరడి అంటారు. ఇంకొకచోట యింకొక పేరు ఉన్నది. ఇక్కడకూడా ఈ పద్ధతి ఉన్నది. ఈ రోజున ఎవరో deputation కూడ నావద్దకువస్తున్నారు.

ఒక గౌరవ సభ్యుడు : వాటిని పర్రెకాలవలు అని అంటారు.

శ్రీ కె. వెంకటరావు : సరే. ఈ పర్రెకాలవలద్వారా వ్యవసాయము చేసిన భూములకు కూడ యిప్పుడు వేసేశిస్తు ఇప్పుడు వేసేటటువంటి స్థాయిలో ఉండకూడదు. దీనిని తగ్గించాలని అంటున్నారు. దాని విషయములో వారు చెప్పేది ఏమిటంటే "మీరు ఎప్పుడో రెవిన్యూ మంత్రిగా ఉన్నప్పుడు ఒక జిల్లాకు తగ్గించారు. మిగిలిన జిల్లాలకు కూడ తగ్గించకపోతే It goes against the Constitution అనేమాటగా బసిరెడ్డిగారు విసిరివేశారు. సరే. Constitution మాట, అది అంతయు ఏమైనప్పటికినీ, అది సమగ్రంగా చూచుకోవలసిన విష యము. ఒక చోట ఒకపద్ధతి, యింకొకచోట యింకొక పద్ధతి ఉండకూడదు. ఇప్పుడు రామచంద్రారెడ్డిగారికి కోపమురావచ్చు. అనంతపురం జిల్లాలో ఉన్నరేటును పైకిఅయినా పీకాలి, లేకపోతే మిగిలిన జిల్లాలలో ఉన్న రేటును క్రిందకు అయినా తగ్గించాలి. అందువల్ల యీ విషయమును గురించి మరల యిప్పుడు సమగ్రంగా విచారించి తీసుకోవలసిన చర్య తీసుకోవడము జరుగుతుంది. అసలు యిందులో ఉన్న కష్టములు కోటిరెడ్డిగారు చెప్పారు, అందువల్ల నేను మరల ఆ విషయములను చెప్పడములేదు. అసలు యీ కాలవల ద్వారా వచ్చే నీరు ఎవరిది? భూమిమీద ప్రవహించే నీరు, వానవల్ల వచ్చే నీరు అంతా ప్రభుత్వానిదే. దేవుడు సృష్టించిన భూమిఅంతా ప్రభుత్వానిది. అందులో

నుంచి హక్కులు తయారైనవి. దేవుని దగ్గరకు పుష్పమో, ఫలమో తీసుకుని వెళ్లితే గాని, ఆయన యొక్క అనుగ్రహము రాదన్నట్లుగా ప్రభుత్వానికి ఏదో కొంచెము సొమ్ము చెల్లించుకుంటే గాని, యీ నీరుగాని, గాలిగాని, ఇసుకగాని మనకు రావడానికి లేదు. అందువల్ల ఇవి అన్నీ ఆలోచించి, Taxation తప్పదు. కాబట్టి యీ పన్ను వేయడములో ఏవిధముగ చేస్తే న్యాయముగా, equitable గా ఉంటుందో అది అంతా ఆలోచించి చేస్తామని మనవిచేస్తున్నాను.

ఎక్కువమంది సభ్యులు Minor Irrigation గురించి మాట్లాడారు మాట్లాడినవాటికి వివరాలన్నీ వారే చెప్పారు గనుక, యిక నేను మరల వాటిని గురించి చెప్పనవసరములేదు. ఆంధ్రలో ఒక పద్ధతి ఉన్నది. తాలూకాకు ఒక Minor Irrigation Overseer ను వేశారు. జిల్లా మొత్తముమీద ఒక ఇంజనీరు, యింతమంది Supervisors అనే ఏర్పాటుతో యీ Minor Irrigation వ్యవహార మంతా జరుపబడుతున్నది. కాని పనిమాత్రము జరుగుతూనే యున్నది. ఇప్పుడు ఉన్న వ్యవహారాలన్నీ సభ్యులకు మనవిచేశాను. కాని ఇక్కడ తెలంగాణలో పది ఎకరాలకు పైగా ఉన్న చెరువులు అన్నీ P. W. D. వారి క్రింద ఉన్నవి. ప్రథమ పంచవర్ష ప్రణాళికలో కొంత అభివృద్ధి కన్పించలేదు. ఎందువల్లనంటే 575 Minor Irrigation Tanks, Plan ప్రకారము వాటికి గట్లువేయడమో, లేక చెరువులు త్రవ్వడమో జరగాలి. ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో 1275 చెరువులు ఉన్నవి. మొత్తముమీద 1800 చెరువులు ఉంటాయి. ఇక మిగిలినవి చేయటానికి మనకు యీ ప్రణాళిక కాలము నాలుగు సంవత్సరములు ఉన్నది. గనుక ఆ లోగా ఆ పనిఅంతా పూర్తిచేయాలనే విషయము నడుస్తున్నది. ఈపని రెవిన్యూ డిపార్టుమెంటు చేయాలా, లేకపోతే P. W. D. వారు చేయాలా, లేకపోతే అక్కడ పద్ధతి అక్కడ, ఇక్కడ పద్ధతి యిక్కడ అనే విషయము ప్రభుత్వము విచారిస్తున్నది. ఇంతకు మన కళ్లకు కన్పించే తేడా ఏమిటంటే. ఆంధ్రలో Minor Irrigation Tanks కు నూటికి 11 రూపాయిలు establishment charges తెలంగాణలో నూటికి 28 రూపాయలు చార్జిచేయడము జరుగుతున్నది. ఈ తేడాలు అక్కడో, ఇక్కడో సమన్వయముచేయవలసిన ధర్మము ప్రభుత్వముమీద ఉన్నది. ఏదోవిధముగ Minor Irrigation కు ప్రత్యేక ప్రాధాన్యత ఇవ్వవలసిన న్యాయము ఉన్నది. అదిమాత్రము ప్రభుత్వము నిర్వహిస్తుందని అంటున్నాను.

ఇంతేకాకుండా శ్రీకాకుళం జిల్లాకు అసలు Minor Irrigation కొరకు డబ్బే యివ్వడములేదని, ఒకరో యిద్దరో సభ్యులు చెప్పారు. ఆ విషయమునకు సంబంధించిన లెక్కలు నా వద్ద ఉన్నవి. 1953-54 వ సం. నుంచి ఆరంభించి యీ రోజువరకు శ్రీకాకుళం జిల్లాకు యివ్వవలసిన హాటాధనం తగ్గడము లేదుగదా ! పైగా యీ సం. ములో అన్ని జిల్లాలకంటే ఎక్కువ మొత్తము

శ్రీకాకుళం జిల్లాకే ఏర్పాటు అయినది. అంటే, గత సం. ము ఖర్చుచేసినది యీ సం. ము Budget figure అనేది విడదీయలేము. 1956-57 వ సం. లో శ్రీకాకుళం జిల్లాకు ఇచ్చినది 7,73,100 రూ.లు. ఖర్చుచేసినది 7,72,952 రూపాయలు. అంటే మొత్తము అంతా ఖర్చుఅయిపోయినదన్నమాట. దానికి ఎక్కువగ కావలసిఉంటే మనకు ఉన్న Financial Resources ను బట్టి దానికి మనము సహాయము చేయవలసివస్తుంది. నేను యిప్పుడు మనవిచేసేది 'కస్రా, పహానీపత్రక్' విషయము. ఈ కస్రా, పహానీపత్రక్ record of rights legal అవునా, కాదా అనే విషయము కూడ discuss చేశాము. దీనికి legal opinion ప్రకారము ఏదో ఒక particular తేదీన ఆ భూమి యజమాని ఎవరైనప్పటికినీ అది ఎవరి possession లో ఉన్నది అనే రికార్డు కాస్రాపహానీ అంటారు. అందువల్ల అది limited హక్కు create చేస్తుంది కాని, కరణము బుక్కులలో కళా వెంకట్రావు పేర వ్రాయించుకున్నంత మాత్రాన, ఆ భూమి వెంకట్రావుకు చెందదు. Legal గా ఆలోచిస్తే యీ రోజున ఉన్న law అది. మరి ఎక్కడైన అటువంటిది ఉంటే మాత్రము, అన్యాయము జరిగిందని అంటే, వాటిని అన్నింటిని సరిదిద్దుకోవాలి. బొమ్మకంటి సత్యనారాయణగారు మాట్లాడుతూ కొంత మంది legal గానే చేసుకున్నారని, కాని రిజిస్ట్రేషను ఫీజు మాత్రం ఒకటిన్నర రూపాయ స్టాంపుమీదనే వ్రాసుకున్నారని, దానివల్ల ప్రభుత్వానికి రావలసిన ఆదాయము పోయిందని అన్నారు. ఏ విధముగ జరిగినను, ఆ డబ్బు వసూలు చేసే దృష్టిలోనే ప్రభుత్వము ఉన్నది. అది వదిలివేసి వెంకయ్య, పుల్లయ్య ఇద్దరుకలిసి ఒక కాగితము వ్రాసుకుంటే, ప్రభుత్వానికి రావలసిన డబ్బు అంతా రాకుండ చెడగొట్టి "నా హక్కు maintain చేయమని అడగడము మంచిదికాదు. దానికి ఏ విధమైన స్వరూపము కల్పించాలో ఆలోచించి చేస్తాము.

కొంతమంది Integrated Estate Revenue Officers, కొంతమంది Regular Revenue Officers ఉన్నారని చెప్పారు. అందులో తేడా ఏమీలేదు. అందరు కూడ regular రెవిన్యూ ఆఫీసర్లే. కాని వారుచేసే పనిలో, వారికి సమర్థత, అనుభవము ఉన్నది గనుక కొన్నింటికి వారిని అక్కడ ఉంచారు. Survey and Settlement అంతా పూర్తిఅయిన తరువాత villages create అయినట్లు Notification అయిపోగానే వారందరు ప్రభుత్వములోనికి తీసుకోబడుతారు. ఇప్పటికప్పుడే తీసుకోవడము మొదలుపెట్టారు. ఈ సం. ము నాల్గవవంతుకు పైగా Settlement పూర్తిఅవుతుంది గనుక, అంతవరకు వారిని తీసుకొనిరారు. తీసుకువచ్చినవారినిమిగిలిన Ryotwari Village Officers మాదిరిగానే వారికి తగిన జీతాలు కల్పనచేయడము జరుగుతుందని మనవిచేస్తున్నాను.

Andhra Tenancy Act ను తీసుకొచ్చి జమీందారీ tenant కో, లేకపోతే non-taken over esate లోనో apply చేస్తున్నారు. కొంతమంది తాహశీల్దార్లు,"

అని అప్పారావుగారు complaint చేశారు. అది చాల పొరపాటు. అలా జరుగకూడదు. అటువంటి cases ఎక్కడైనా ఉంటే వాటిని సరిదిద్దేటటువంటి orders pass చేయడానికి అభ్యంతరం ఉండదు. బొబ్బిలి ఎస్టేటులో కొన్ని చోట్ల ఎక్కువ పన్ను, కొన్ని చోట్ల తక్కువ పన్ను పడిందన్నారు. Reserve Bank లెక్క ప్రకారం Madras Rent Reduction Act క్రింద మొత్తం జమీందారీ areas లో 100 కి 45 రూపాయల చొప్పున పన్ను తగ్గింది. Abolition కు ముందర బెట్టిన బిల్లు అది. కాని కొన్నిచోట్ల settlement లో ఎక్కడైనా వదలి పెట్టడం జరిగింది. నా దగ్గర list లోనే 5, 6 cases ఉన్నాయి. వానపల్లి వగైరా గ్రామాలు. అక్కడ పొరపాటున notification జరిగిపోయింది. Notification ను alter చేసేటటువంటి అధికారం ప్రభుత్వానికి లేదు. కనుక ఒక instruction ను issue చేశాము. "జిల్లాలో ఉన్న highest rate ను మించి వెళ్ళకూడద" ని, అందువల్ల బొబ్బిలి estate లో కూడా అది apply చేయవచ్చు. వాటికి సంబంధించిన applications ఇవ్వమని అప్పారావుగారిని కోరాను. అవి రాగానే వాటిని గురించి విచారణ చేసి చర్యతీసుకొంటాను.

నిన్న చర్చలో కొంచెము హెచ్చుతగ్గుగా అందరు కూడా land assignment ను గురించి మాట్లాడారు. ఆంధ్రలో ఉన్న land assignment rules గురించి నిన్న సూక్ష్మంగా చెప్పాను. తెలంగాణాలో కూడా rules ఉన్నాయి. అవే ఇక్కడ Laoni rules అంటారు. ఈ Laoni rules ప్రకారం కొన్ని committee ల సహాయం ఇచ్చి వ్యవసాయానికి సానుకూలమైనటువంటి భూములను ఆ గ్రామాలలో ఉన్నటువంటి పేదవాళ్లకు పంచిపెట్టవలసిందని ఒక నిర్ణయం చేశారు. ఈ పని చేయడంలో ఏదో పొరపాటు ఉన్నదని సూర్యాపేట మెంబరు గారు కొన్నివిషయాలేమో చెప్పారు. Sri. K. L. Narasimha Rao Garu వగైరా అనుకొంటాను కొంతమంది representation ఇచ్చారు. దీనిని గురించి అదంతా విచారణలో ఉన్నది. మిత్రుడు సుందరయ్య గారితో వచ్చేటటువంటి ఒక deputation వారితో కూడా చర్చించి ఉన్న rules అమలులో పెట్టడానికి ప్రభుత్వానికి అభ్యంతరంలేదు. మేము వచ్చి క్రొత్తగా policy ని change చేయలేదు. దానిని అమలులో పెట్టి వ్యవహారం చేసుకోవచ్చు. కాని విమర్శనమాత్రం న్యాయమైనది కాదు. 10% బంచరాయి ఉండాలని శాసనంలో పెట్టారు. ఎక్కడో తగ్గింది. అన్ని ఊళ్ళల్లో తగ్గించమనే దానికంటే 10% బంచరాయివద్దు 8% బంచరాయి వుండాలని పెట్టుకోండి, ఏదో ఒక rule క్రింద వెడుతుంది. లేకపోతే ఈ discrimination తప్పదు. ఒక ఊళ్లో 10% వుండాలని ప్రక్క ఊళ్లో ఎవరో occupy చేసుకొన్నారు. గనుక 10% ఒప్పుకోము అనడం మంచిదికాదు. ఇందుకు తెలంగాణావారు చెప్పిన కారణాలు కొన్ని ఉన్నాయి. హెచ్చు పంటలు కావలెనన్న కోరికతో భూమి హక్కును

గురించి ఇవన్నీ గమనించి 10% అక్కర్లేదు. 8% చాలుఅనేటటువంటి నిర్ణయం తీసుకొంటే ఈ discrimination చాలవరకు తగ్గుతుందేమోనని నాకు తోచింది. అది దృష్టిలో పెట్టుకోవలసిందని నేను కోరుతున్నాను. దాని ప్రకారం నడుస్తుంది.

నిన్న నరసింహారావుగారు రెండు Circulars గురించి చెప్పారు. ఒక Circular నాకు దొరికిందిగాని రెండో Circular Board నుంచి ఇంకారాలేదు. అదికూడా ఈ సందర్భంలో ఆలోచిస్తానని మనవిచేస్తున్నాను.

శ్రీ సి. రామబ్రహ్మంగారు District Councils అంటే చిన్న శాసనసభల వంటివి జిల్లాకు ఉండాలని చెప్పారు. అది చాల పెద్ద సమస్య. అంత సూక్ష్మంగా తేలేది కాదు.

Loans, Land-holders కు ఇచ్చేటప్పుడు ఎవరైనా హామి తీసుకోవాలి. హక్కు లేనటువంటివాళ్ళకు ఇచ్చేస్తున్నారు. ప్రభుత్వానికి డబ్బు నష్టం వస్తుందని చెప్పారు. ఇలాంటి దండుగలు రాకుండా చూసుకునేటటువంటి ఏర్పాటు చేస్తాము. "కుప్పం" Taluq Head Quarters అవుతుందా లేదా అని అడిగారు. ప్రభుత్వం ఈ బీదతనంలో ఏమీచేయలేక మాదగ్గర ఉన్నటువంటి ప్రొపోజల్స్ నెల్లూరు, చిత్తూరు, శ్రీకాకుళం జిల్లాలలో అమలు పెట్టడం లేదు. కొద్దికొద్దిగా పెడుతున్నాం. ఎప్పుడైనా ఒక stage లో Taluq Head Quarters అయ్యే టటువంటి అవకాశం ఉన్నది కాని ఇవేళే చేయమంటే చేయడానికి వీలులేదని మనవిచేస్తున్నాను. పున్నయ్యగారు Minor Irrigation Works గురించి చెప్పారు. దానినిగురించి అప్పుడే చెప్పేశాను.

శంకరయ్యగారు, యమ్. సత్యనారాయణరాజుగారు Inam Legislation గురించి మాట్లాడారు. Inam Legislation గురించి చెప్పాలంటే ఒక పూట పడుతుంది. మళ్ళీ రెండు బిల్లులు తమ ముందుకు రానున్నాయి. ఆ వేళ ఎలాగు వాటి వివరాలు చెప్పకతప్పదు. కొన్ని విషయాలలో litigation ఉంటుంది. దానికి ఒక schedule వేస్తే పరిపోతుందని చెప్పారు. అది సాధ్యమయ్యే పనేనా ? ఆలోచించవలసిందని కోరుతున్నాను. ఆయన? Impartiable Estate Act ను quote చేశారు. అది ఆ concerned people దరఖాస్తు పెట్టు కోవడంవల్ల వేసినటువంటిదిగాని Impartiable Estate Act అనేది absolute Act కాదు. ఒక్క విషయం మనం ఆలోచించాలి. నేను ఈనాందారుని అనుకొంటే లాభములేదు. ఈనాందారు అనే పదానికి రెండుఅర్థాలు ఉన్నాయి. ఒక్కటి పన్ను వసూలుచేసుకొనే హక్కు ఉండేటటువంటి భూములు ఎవరో ఎప్పుడో gift or deed గా వీరికి transfer చేశారు. రెండవది రైత్వారీ గ్రామా లలో ఉండేటటువంటి ఈనాందారు పెద్దవాడే అనుకోండి. ఆయనకు 100

ఎకరాలు భూమి ఉన్నది. ఆయనను ఈనాందారు అన్నారు. కనుక ఆయన క్రింద ఉన్న **tenant-at-will** ను కూడా **occupancy tenant** గా **Estates** లో చేసినట్లు చేయమనడంలో తేడా ఉన్నది. ఈ రెండింటిని కలిపిచెప్పడం న్యాయం కాదు. రెండో **Legislation** లో అతను 6 సంవత్సరాలో 3 సంవవత్సరాలో కౌలుక్రింద ఉన్నట్లయితే అతనికి **protected tenant** క్రింద హక్కు కల్పించవచ్చు. అది వేరే సమస్య, కాని ఆ ఈనాందారుపేరుపెట్టి ఈ ఈనాందారుకు కూడా అదే రకమైన హక్కు, ఆయన **tenant** కు ఇంకో రకమైన హక్కు కల్పించడం కష్టం అవుతుందేమో మనం ఆలోచించవలసి ఉన్నది. భూమి దున్నడం వల్లనే హక్కురాదు. ఇంతవరకు ఉన్న **law** ప్రకారం ఒక రకంగా భూమి దున్నితే హక్కుఉంది. ఇంకోరకంగా దున్నితే లేదు. అది ఇప్పుడు రాబోయేటటువంటి సంస్కరణలలో ప్రధానమైన అంశము అవుతుంది. ఈ **schedule** వేయడంలో ఫలానిఊళ్లకు ఈ **Act apply** అవుతుందని వ్రాయడం సాధ్యంకాదు. శాసనసభ యొక్క ధర్మం ఒక పద్ధతిని కలుగజేయడం. ఆ పద్ధతి క్రింద వచ్చేవారంతా వస్తారు. **Estate** అంతా **litigation** క్రింద ఖర్చుపెట్టిన పెద్దమనుష్యులు లేకపోలేదు. నే నెరుగుదును పేర్లు కూడా. ఇంకో రకంగా రక్షణను **Act** లోనే కలుగచెయ్యాలి గాని **schedule** ద్వారా చేయడం కష్టం అవుతుందని నేను మనవిచేస్తున్నాను.

**Andhra Tenancy Act** ను గురించి కొంతమంది మాట్లాడారు. దానిని అమలుజరపడంలో కొన్ని కష్టాలు వచ్చాయి. 15-6-1957 తేదీ నాటికి **special staff** ను ఇచ్చి, ముఖ్యంగా **section** 13 క్రింద వచ్చిన **applications**, ఎవరు భూమి దున్నుతున్నారనే విషయాన్ని గురించి- కౌలు ఉన్నదా, లేదా అనే విషయాన్ని **settle** చేయవలసిందని కోరాను. **Telegram** లు ఇచ్చినా ఎన్ని జిల్లాలలో ఎన్ని **applications** ఆ **section** క్రింద ఉన్నాయి, ఎన్ని లేవు, అనే విషయం ఇంతవరకు తెలియలేదు. ఒక్క విషయం మాత్రం తెలుసును. అనంతపురంలో కర్నూలులో ధరఖాస్తు ల్లేనేలేవు. మిగిలినవాటిని గురించి నాదగ్గరకు సమాధానం రాగానే సభవారికి చెప్పడానికి వీలుఅవుతుంది. దాని మీదే కేంద్రీకృతమైన దృష్టిపెట్టుకొని కృషిచేస్తున్నాము.

**Land assignment** కు ఇక్కడ పంచాయితీ యొక్క శివాయిజమా ఎలా ఉందో, ఆ వైపున కూడా బరచిరారు. కాకపోతే ఇంకోరకంగా పైగా శివాయిజమా చెరువులలో, కాలవలలో, పుంతలలో, పోరంబోకులలో, ఇంకోళ్ల పొలాల్లో అనేక రకాలుగా ఉన్నది. బంజరు భూముల గురించి కొన్ని **policies** గవర్న మెంటు నిర్ణయించేశారు. ఇప్పుడైనా మార్పుచేయిస్తే బాగుంటుందని. అంటే తప్పకుండా చేస్తాము. మొన్న నేనో ప్రశ్నకు జవాబిస్తూ **rules** అన్ని పునర్గ్రహించేసేందుకు 2 నెలల కాలవ్యవధి కావాలని చెప్పాను. ఆ రకంగానే

laoni assignment rules మొదలైనవాటన్నింటికి ఒకే పద్ధతి నిర్ణయించేసి ఎవరికి హక్కు ఉన్నచోట వారికి పట్టా ఆలస్యంలేకుండా ఇచ్చేటట్లు చూస్తాము. ఇలా చెపితే ఎన్నైనా చెప్పవచ్చు. ఆఖరువిషయం ఒక్కటి మనవిచేస్తాను.

Village Officers గురించి మాట్లాడుతూ Revenue Department తల్లి వంటిది అన్నారు D. V. Subbarao గారు మొట్టమొదట. కొంతసేపు ఉపన్యాసం అయ్యేటప్పటికి తల్లి అత్తగారైపోయింది. ఆయన చేసిన విమర్శనను బట్టి, District administration ను గురించి చెప్పారు. ఇది చాలకాలం బట్టి ఉన్న సమస్య. ఇది ఎలా బాగుచేయాలో మనమందరం ఆలోచించి, ఏదైనా చర్య తీసుకోవలసినటువంటి బృహత్తరమైన విషయము. దీనివల్ల public చాల బాధ పడుతున్నారు. తాబేదార్లు బాధపడుతున్నారు. Village Officer లు బాధ పడుతున్నారు. లేకపోతే petitions ఇచ్చుకొనేవాళ్లు బాధపడుతున్నారు. మా రామారెడ్డివారు "ఎవరో వెళ్ళి రెండురూపాయలు ఇచ్చి order వేయించు కొంటాడు. M. L. A. వెళ్ళి దానికే సిఫార్సుచేస్తే లేదంటాడు. ఆయన రెండు రోజులలో పట్టుకొస్తే మాకందరికి అవమానంఅవుతోంది" అని కూడా చెప్పారు. ఇలాంటి cases ఉండవచ్చు. ఎంత percentage ఉన్నదనేటటువంటి విషయం ఒకటి, రెండవది ఎంత percentage ఉన్నా, 1% ఉన్నా, 0.999% ఉన్నా కూడా అది తప్పైన విషయమే. దానిని అరికట్టి తీరాలి.

జూన్ 3వ తేదీన Village Officers నన్ను కలుసుకున్నారు. ఆవేళ చర్చ జరిగింది. ఆ చర్చకు నాపరిచయస్తులు కొందరు కూడ వచ్చారు. "మీరు జీతాలు కావాలని అడగుతున్నారు. న్యాయాన్యాయాలు ప్రభుత్వ విచారణలోనున్నవి. ప్రభుత్వానికున్న ఆర్థిక లోటువలన జీతాలు పెంచలేకపోవచ్చు, పెంచవచ్చు. ఆ విషయం తరువాత ఆలోచిస్తాము; కాని జమాబందికీ, జీతాలు పెంచడానికీ సంబంధం ఏమిటని" నేను ముందుగా వారిని ప్రశ్నించాను. "మీరు జీతాలు పెంచితేనేగాని జమాబందులకు వెళ్ళ"మనేటట్లయితే ఇక చర్చించవలసిన అవసరమే లేదు. ప్రభుత్వానికి శక్తిఉంటే జమాబందీ చేయించుకొంటుంది, లేకపోతే పన్ను (ఆదాయం) పోగొట్టుకుంటుంది. "నేను జమాబందికి రావా లంటే, Account తయారు చేయాలంటే నాకు ముందుగా జీతం హెచ్చించాలి, హెచ్చుచేస్తేనే నేను జమాబందికి వస్తాను" అనే పరిస్థితి పరిపాలనలో కలిగితే అతను Village Officer అయినా, N.G.O. అయినా, Minister అయినా అది మాత్రం సాధ్యమయ్యేపనికాదు. ఈ విషయమే నేను వారితో చెప్పినాను. సరే జమాబందికి, జీతాల సమస్యకూ సంబంధంలేదని చెప్పారు. అయితే జమాబందికి వెళ్ళకపోవడానికి కారణాలు చెప్పమన్నాను. Accounts తయారు చేయడానికి కొన్ని ఫారములున్నాయి. ఆ ఫారములను మాకు supyly చేయుట లేదు అని ప్రధాన కారణంగాచెప్పారు. అనేకదఫాలు అడిగినప్పటికీ మాకు ఫారాలు

యివ్వడంలేదు. ఫారాలులేకుండా, accounts వ్రాయడం ఎట్లాగ, జమాబందీకి వెళ్ళడం ఎట్లాగ, అని ప్రశ్నించారు. తరువాత concessions విషయం చెప్పారు. "జమాబందీకి వెడితే తాలూకా కేంద్రానికి 5 మైళ్ళకంటే దూరం ఉన్నవారికి కొంత T. A. ఇస్తున్నామని చెబుతున్నారు కాని రెండు, మూడేళ్ళనుంచీ చాలా మంది తహశీల్దారులు మాకేమీ ఇవ్వడంలేదు" అన్నారు.

Education, Medical concessions గురించి చెప్పారు. చాలా schools లోనూ, hospitals లోనూ N. G. O. లకు ఇస్తున్న concessions మాకు రావడంలేదు, అని చెప్పారు.

అయితే, "అటువంటి concessions మీకు ఎక్కడ అందుబాటులోలేవో, ఆవిషయం ప్రభుత్వ దృష్టికి తీసుకువచ్చినట్లయితే enforce చేసి ఆ concessions ఇప్పిస్తాము. ఎక్కడైనా తహసీల్దారులు ఇవ్వకపోయిన T. A. లు బాకీలేమైనా ఉంటే వెంటనే ఇచ్చేందుకు ఏర్పాటు చేస్తాము, 'ఇస్తాము' అని చెప్పినతరువాత మళ్ళా 'ఇవ్వవద్దు' అనే ఉద్దేశ్యం ప్రభుత్వానికిలేదు. ఇంకో కాగితాలు supply కావడంలేదని చెబుతున్నారు. ఆఫారములన్నీ సప్లయి చేయడానికి వెంటనే ఏర్పాటుచేస్తాము. ఫారములు అందినతరువాత accountsతయారుచేసుకోడానికి వీలుగా జమాబందీ తారీఖులుకూడా ముందుకు నెట్టుతాము" అని చెప్పాను.

వారు ఇంకొకవిషయంకూడా చెప్పారు. Standardisation of Land Revenue, Wet rates గురించి ఒక Act పెట్టారు. వీటినిమేము అమలులో పెట్టాలి; ఒక రిజిష్టరువున్నది. ఆరిజిష్టరులో కళావెంకటరావు రు. 6 లు యిచ్చేపన్ను కొత్త Act ప్రకారం రు. 6-10-0 లు చెల్లించాలి అనీ వ్రాయాలి. ఆ మార్పు రెవిన్యూ ఇనస్పెక్టరు చేయాలి. అట్లాకాకుండా నేనే రు. 6-0-0 ఉండేచోట రు. 6-10-0 లు అని వ్రాస్తే, ఇదేసరైనదని (this is true) అంటే ఇది మాకు హక్కులేని విషయం. రేప్రొద్దున్న ఎవరైనా కోర్టుకుపోయి ఇదంతా మామీదపడితే మేమేమిచేయాలి అన్నారు. ఇంకా Act ను గురించి ఏవేవో చెప్పారు. "రెవిన్యూబోర్డు సభ్యులు, ఉన్నిత్తంగారు ఇక్కడనే ఉన్నారు. మీలో తెలివైనవారు ఇద్దరో, ముగ్గురో వెళ్ళి ఈవిషయంలో ఏవిధమైన మార్పులు జరిగితే పనిజరుగుతుందో వారితోచెప్పండి. ఆప్రకారం మేము ఉత్తరువులు జారీచేస్తాము అన్నాను.

జీతాలవిషయమే కాకుండా దానికి సంబంధించిన సమస్యలు చాలా ఉన్నాయి. గ్రామాలలో Land records maintain చేయాలి. 24 రిజిష్టరు లున్నాయి. వారిమీద క్రొత్తపన్నులు భారంఎక్కువవుతున్నది. ఇందాకఎవరో సభ్యులు "తిమ్మారెడ్డిగారు అప్పులుఇస్తారు. వాటిని కళావెంకటరావుగారు

వసూలు చేయాలి'' అని చెప్పారు. ఈసంగతి వారికే తెలియదు, వసూలు చేయాలని నాకూ తెలియును. కాని చేయవలసిన బాధ్యత ఉన్నది.

ఇంకా అనేకమైన వ్యవహారాలున్నాయి. కష్టాలున్నాయి. ఈ విషయం అందరికీ తెలుసు. మన ముఖ్యమంత్రిగారు కొన్నాళ్లు మునసబ్ చేశారు. నేను మున్సబుగారి అల్లుడను. మా బావమరిది యింకా మునసబే. అందువల్ల ఈ Houseలో ఉన్న వారిలో చాలమందిమున్సబు, కరణాలకుటుంబాలనుంచి వచ్చిన వారమే. సాధారణంగా ఇపుడున్న educated people నూటికి 90 మంది మున్సబు, కరణాల కుటుంబాలనుంచి వచ్చినవారూ, ఆ కుటుంబాలకు సన్నిహితమైన కుటుంబాలనుంచి వచ్చినవారే. సొసైటీకి important section అది. అందుచేత, వారితో దెబ్బలాట పెట్టుకోవాలనే కోరిక ప్రభుత్వానికి లేదు. వేయి సంవత్సరాలనుంచి మున్సబు ఉద్యోగాలు చేస్తూ, నిద్రలోంచి ఎవరో మేల్కొన్నట్లుగా ఈనాడు అనవసరంగా నిద్రలేవడంవలన పెద్ద పరిణామం తీసుకురావడం న్యాయంకాదు. "Committee లో ఇద్దరు వారి ప్రతినిధులను కూడా వేస్తాము, ఇద్దరు యం. యల్. ఏ. లను, Departmental Officersను వేస్తాము. విచారణచేసి రిపోర్టు ఇవ్వండి'' అని చెప్పాను. ఇందుకు 2 ఏండ్ల time కావాలన్నారు. అట్లాలేదు, 2 నెలల్లో పూర్తిచేయడానికి నేను అంగీకరిస్తున్నాను, దానిప్రకారం ఒప్పుకొని త్వరలో పేర్లుఇవ్వవలసిన'' దని చెప్పాను. వారుకూడా అంగీకరించారు.

తరువాత, గ్రామోద్యోగుల సంఘాలని నేను చెప్పను, ఆ సంఘాలకు అధీన సంఘాలనుకునేవి, లేక గ్రామోద్యోగుల సంఘం అని పేరు పెట్టుకొన్నవీ "జమాబందీలకు వెళ్ళకూడదు, రాజీనామాలు వ్రాసి సంఘానికి పంపాలి, ఆ సంఘంనుంచి తహశీల్దారులకుపంపాలి'' అని ప్రతిరోజూ పేపర్లలో పడుతూండేది. ఈ విషయాలన్నీ పేపరుచదివేవారందరికీ తెలుస్తాయి. అయితే, రాజ్యాన్ని ప్రభుత్వం పరిపాలిస్తున్నట్లా, మా నేసినట్లా ! 'ఆకాశంకేసిచూస్తూ ఊరుకున్నావేమయ్యా' అని నా మిత్రులు కొందరు నన్నడగడంమొదలుపెట్టారు. 'వారూ, మనం ఏదో అనుకొన్నాము. సర్లే, ఈ fulfilment ఎంతవరకూ జరుగుతుందో చూడాలి' అని నేను అన్నాను. ఈ విషయాలు పేపర్లలో ఎక్కువగా రావడం మొదలుపెట్టాయి. ప్రభుత్వానికి పోలీసుశాఖ ఉన్నదికదా ! ఈ విషయమై ప్రతిరోజూ radio messages వచ్చేవి. 'ఫలానచోట ఫలాన కోటిరెడ్డిగారి అధ్యక్షతన సమావేశమై తీర్మానం చేయడమైనది'' అని పేపర్లలోకంటె ముందుగా మాకే radio messages వచ్చేవి.

రెండు పెద్ద bind books కు సరిపోయే కాగితాలొచ్చాయి నాదగ్గరకు. ఈ విషయం Cabinet లో ఆలోచించి, ఒక నిర్ణయం చేయవలసివచ్చింది.

"ఎవరైనా జమాబందికి వెళ్ళనన్నట్లయితే వారిమీద చర్య తీసుకోవలసినదని జిల్లా కలెక్టర్లకు ఉత్తరువులు పంపాలని" నిర్ణయించాము. అసలు జిల్లా కలెక్టరులకే 1874 వ చట్టంక్రింద అట్టి చర్య తీసుకొనే అధికారం ఉన్నది. ప్రభుత్వం వారు దానికి ప్రోత్సాహం కల్పించారు. దానిమీద గ్రామోద్యోగులు అక్కడక్కడ సమావేశాలవుతూ 'జమాబందికి వెళ్ళకూడదు, 31-7-1957 లోపున జీతాలు హెచ్చుచేస్తేనే పనులు చేయాలి. లేకపోతే, రాజీనామా పత్రాలు వారివారి సంఘాలద్వారా ప్రభుత్వానికి అందజేయాలి' అనే నిర్ణయం వారు తీసుకున్నారు. ఇది అసలు పరిస్థితి. సంభాషణలో అనేక విషయాలు జరుగుతున్నాయి. "వారు అట్లా చేయడం తప్పే, కాని మంత్రిగారు వారిని కరుణతో చూడాలని" సభ్యులు సలహాచెప్పారు. "ఈ సంవత్సరం 34 లక్షల రూపాయల Land Revenue ఎందువల్ల వసూలు చేయలేదు" అని సభ్యులే ప్రశ్న వేస్తారు.

Accounts లేవు. Accounts ఎందుకులేవంటే prepare చేయలేదు అని, ఎందుకు prepare చేయలేదు అంటే ఈ రకంగా ఇందులో కష్టాలున్నాయి అని సమాధానాలువస్తాయి. ఈ మధ్య మద్రాసు రాష్ట్రంలో, ఆ ప్రభుత్వంవారు రు. 7, 6, 5, 4 పెంచామన్నారు. అది మన గ్రామోద్యోగులు దృష్టిలో ఉంచుకొని 'మద్రాసువారికి పెంచినారు. అయ్యో మనకు ఏమీ హెచ్చించలేదే' అని కంగారు పడుతున్నారు. మద్రాసు రాష్ట్రంలో నాగార్జున సాగర్ ప్రాజెక్టు లేదు. సంవత్సరానికి 6 కోట్ల రు.లు దానిమీద పెట్టుబడి ఖర్చులేదు. 24 లక్షల రు.లు వడ్డీ అవుతుంది. 122 కోట్లు అయ్యేటప్పటికి 48 కోట్ల రూపాయల వడ్డీ ఇచ్చుకోవాలి. వారికి ఇర్రిగేషన్ ప్రాజెక్టులు లేవు. Sales Tax ఎక్కువ ఉన్నది. ఆ ప్రభుత్వంవారు ఏమనుకొన్నారో, కొంచెం జీతాలు పెంచారు. "మేము ఎప్పటికీ హెచ్చించము" అని మన ప్రభుత్వం అనలేదు. ఎప్పటికీ చేయము అని ఇంతవరకూ Government announcement ఉన్నదా? ఇంకా ఆలోచనలో ఉన్నది. ఇంతలో కేరళ ప్రభుత్వం ఒకటి వచ్చింది. 'మనవాళ్ళు ముందుగానే papers లో వేశేస్తారు. వారు 52 రు॥లు చేశామన్నారు.

దానినిచూసి, మన స్నేహితులు 'మనకు లేకుండా పోతున్నాదే' యని కంగారుపడుతున్నారు. కేరళనుంచి, సెక్రటరీనుంచి, మంత్రిగారినుంచి సమాచారం తెప్పించాను. ఇప్పుడు నాదగ్గరనే ఉన్నది. అక్కడి పరిస్థితికీ, ఇక్కడి పరిస్థితికీ సంబంధమే లేదు.

"In Travancore-Cochin recruitment to the posts of Village Assistants and Village-men is made by the Public Service Commission and Village Officers are appointed by promotion from the rank of Village Assistants by the Public Service Commission. The members of the village staff are full-time Government servants on time scale of pay."

ఈ పద్ధతి మనకూ ఉంటే కేరళకంటే మనంకూడా ఎక్కువ జీతాలు యిస్తామని నేను paper లో చెప్పాను. ఎందుకంటే అక్కడ మనవలె యిన్ని గ్రామాలు లేవు. చదరపుమైలుకు 10 మొదలు 11 వేలవరకు జనాభాగలిగిన area అది.

మొత్తం Villages ఆంధ్రలో 16 వేలు, తెలంగాణాలో 8 వేలు, మొత్తం 24 వేలు. ఇప్పుడు 23 రూ.లు కరణంగారికి యిస్తున్నాం. కేరళలో ఉన్నట్లు అయితే 10 మంది కరణాలకు బదులు 5 మందే అవుతారు. గ్రామాధికారులకు జీతాలు ఎక్కువచేసే విషయం ఆలోచించవలసి యున్నది. ఉన్నది యివ్వడానికి మేము వెనుకాడ్డంలేదు. అందుచేత ఒక్కొక్క ప్రదేశంలో ఒక్కొక్క పద్ధతి ఉంటుంది. Madras Government ఈ Medical and Education Concession అక్కడఉన్న Officers కు యివ్వడంలేదు. మొన్న నేను అక్కడకువెళ్ళి మాట్లాడితే 'పోనీ' మేముగూడా యిస్తాం అన్నారు. అటువంటి difficulties యిందులో involve అయి ఉన్నవి. ఎవరినో బాధపెట్టాలని Village Officer లను యితర చిన్న ఉద్యోగస్థులను, వాళ్ళకు అవమానం కలుగజేసి, వాళ్ళ పురోభివృద్ధికి అడ్డురావాలని, వాళ్ళమీద దండెత్తాలని ప్రభుత్వం ఉద్దేశంకాదు. గ్రామోద్యోగులు British Government నాటినుంచి ప్రతి record ప్రకారమూ వారు part time servants. వారికియిచ్చేది జీతం కాదు, honorarium. వారితో చేయించుకొనే సేవ సర్వకాలజనితమైనదికాదు. కొంతకాలానికే పరిమితమైనది. ఇతరవృత్తుల్లో కాలక్షేపం గడుపుకొనే అవకాశంకూడా వారికి ఉంది. కాని కాలంకూడా మారిందని తెలుసు. ఇదివరకు ఊళ్ళోకి Revenue Inspector ఎప్పుడో 15రోజులకొకసారి వచ్చేవాడు. ఇప్పుడు మనకు Planning Extension Officers ఒక్కొక్క Group లో 9 మంది ఉన్నారు. ఎవరోఒకరు ప్రొద్దున్నే సైకిలుమీద తిరుగుతూనే వుంటారు.

భారతదేశంలోపుట్టిన యే మనిషీ తనయింట్లో పిల్లలకు భోజనంపెట్టకపోయినా వచ్చినఅతిథికి మాత్రం భోజనంపెట్టకుండా ఉండడు. ఇదివరకు ఎవరైనా ఓగుమ్మడికాయో, మజ్జిగో, 'ఒరే! కరణంగారింటికి ఎవరోవచ్చారని' వెంటనే పంపించేవారు. ఇప్పుడెవరు అలా చేయడంలేదు. నిన్న ఒకరు అన్నారు; 'వాళ్ళకు జీతాలు యివ్వకపోతే వాళ్ళను లంచాలు తీసుకోమని ప్రోత్సహించడమే అవుతుందని.' అసలు ఈ రెండూ ఒకసారే సృష్టించబడ్డాయేమో, ఏదో సంప్రదాయంగా వ్యవహారం వడుస్తున్నది. ఈనాడు ఉన్నటువంటి అనేక కారణాలవల్ల ప్రభుత్వంవారి కోరికలను సహృదయంతో ఆలోచించలేకపోవచ్చు కనుక వారు ప్రభుత్వ పరిస్థితులనుకూడా గ్రహించవలసి యున్నది.

నిన్న ఒక గౌరవసభ్యులు చెప్పారు. ''ఇవి బెదిరింపులు కావు, తండ్రిమీద కొడుకు అలిగినట్లు'' అని. అలిగింది అలిగినట్లుగా ఉండి, ప్రొద్దున్నే లేవగానే కొడుకు పొలం వెళ్లి పని చేసుకుంటుంటే ఏ గొడవలూ ఉండవు. కాని నేను అలిగానుకాబట్టి పొలం వెళ్ళనుఅంటే, అది పంతను అంటుంది. Village Officers తమ నిర్ణయాన్ని మార్చుకొనితీరాలి. వారు వెంటనే జమాబందీకి రావాలి. ఆ తరువాత ఉన్న కష్టసుఖాలను ఆలోచించుకోవచ్చును. మన ముఖ్యమంత్రి గారు దీనికోసం ఒక Committee ని వేయాలనుకుంటున్నారు. పేర్లు వారివద్దనే ఉన్నవి. మొట్టమొదట యిచ్చిన వాగ్దానాన్ని మేమింకా భంగపరచదలచుకో లేదు. Village Officers Association నుంచి రాయలసీమనుంచి ఒకరిని, కోస్తా జిల్లాలనుంచి ఒకరిని దానిలో నియమించాలనుకుంటున్నాం. నిజంగా అలిగారేమో వారిని త్రోసివేస్తే మళ్లీ ఎవరిని నియమించవలసివస్తుందో, ఎందుకులే, అని కొంత మనస్సులో వున్నా దీన్ని ఆరికట్టాము. ఇవ్వాళ సాయంత్రమో, రేపు ప్రొద్దునో వారుకలిసివస్తే వారితోనో, కలిసిరాకపోతే యింకొకరితోనో Committee వేసి విచారణ జరుగుతుంది. అందులో Village accounts, grouping, వారియొక్క హక్కులు, వారియొక్క హయాం, యివ్వవలసిన జీతం యివన్నీ సమగ్రంగా చర్చించి, ఆచరణలో తీసుకురావాలని ప్రభుత్వం ప్రయత్నం చేస్తున్నది. ఆ మధ్య war days లో పగలు ఆఫీసుకు వెళ్ళడానికి భర్తకో పంచ, సాయంత్రం వీధిలో పేరంటానికి వెళ్ళడానికి భార్యకు ఒక చీర యిటువంటి బీదస్థితిలో వున్నది మనదేశం. ఆ బీదతనాన్ని పారద్రోలి, సమన్వయం చేసుకొనడానికి, అందరికీ కట్టుకొనడానికి పంచదగ్గరనుండి కప్పుకోడానికి దుప్పటి వరకు అందరికి ఉండేట్లు చేయాలని యత్నంచేస్తున్నది. దీనిలో village officers పాల్గొనాలి. వారి కష్టసుఖాలు, ప్రభుత్వం మనస్ఫూర్తిగా దగ్గరకు తీసుకొని, పరిష్కరిస్తుంది. ఎవరైనావారిని అవమానపరిస్తే ప్రభుత్వంఊరుకోదు. ఎంతమాత్రం సహించదు. ప్రభుత్వ నిబంధనను సడలించకుండా ఎవరైననుసరే దానిప్రకారం వ్యవహరించి ముందుకుతీసుకురావాలి. ఇందుకు village officers గాని, తలయార్లు గాని, ఎవరైననుసరే, ఈనాడు అమలులో వున్న పద్ధతిని అనుకరించడంలో వారికి ఏ విధమైన అమర్యాద గాని, నష్టంగాని కలుగకుండా ఉండాలనే దృష్టితో ప్రభుత్వం ఉంది. అందుకు ఈ పద్ధతిని సక్రమంగా అనుకరించేందుకు ప్రభుత్వం ఒక Committee ని నియమిస్తుంది. సభ్యుల దగ్గరకు village officers సోదరులు వచ్చిఉంటారు. సభ్యులకు కూడా ఈ విషయాలన్నీ తెలుసుగనుక, యిక్కడ సలహాలుయిచ్చిన మిత్రులందరూ వారికికూడా సలహా చెప్పి, వారు జమాబందీకి హాజరుఅయ్యేట్లు, డబ్బు వెంటనే వసూలు అయ్యేట్లు చేయాలని సభ్యులందరికీ మనవి చేస్తున్నాను. ఆ విధంగా accounts అన్ని జరిపోయి, వారికి యిచ్చిన instructions ప్రకారం ఆ జమాబందీ అమలుజరిగినట్లయితే దేశానికి, సంఘానికి, అందరికీ క్షేమంగా ఉంటుంది.

ఇవాళ యింతమంది సభ్యులు తమతమ సూచనలు యిచ్చారు గనుక నా మనసులో ఉన్నది వివరంగా తమకు తెలియజేశాను. రాజ్యాంగం సక్రమంగా నడవడానికి అందరూ తోడ్పడాలి. ముఖ్యంగా గ్రామోద్యోగులు యిందుకు సహకరించాలి. ఆ తరువాత వారికి ఎంత కావలసింది మనం నిర్ణయించేసుకోవచ్చు. శాసనసభకు మించిన ప్రభుత్వంలేదు. ప్రభుత్వమేమీ ఆకాశం నుంచి దిగిరాలేదు. గ్రామానికి head గ్రామ మునసబు. కనుక ఈవిషయాన్ని తమరందరూ కూడా ఆలోచించవలసియున్నది. ఈ విషయాన్ని గురించి 35 మంది స్నేహితులు మాట్లాడినప్పటికి ఎక్కడా ఏవిధమైన ఉద్రేకంలేకుండా తమ తమ నిర్మాణాత్మకమైన సలహాలు యిచ్చారు. దాన్ని కృతజ్ఞతతో తప్పించుకుందామనే ఉద్దేశంతో కాకుండా వాటిని పాటించాలనే యత్నంతో ప్రభుత్వం చేస్తుందని, మళ్లీ హామీ యిస్తున్నాను. కనుక సభ్యులందరూ విషయాన్ని తిరిగి ఆలోచించి, cut-motions withdraw చేసుకొని ఏకగ్రీవంగా దీన్ని pass చేయాలని కోరుతున్నాను. జమీందారులకు రు. 20 లక్షలు ఈయడం గురించి చెప్పారు. అందులో 50% మనం deposit చేయాలి. ఆ విధంగానే deposit చేస్తున్నాం. దానిలో వస్తున్న లాభం కూడా నేను మనవిజేశాను. 85 లక్షలు ప్రభుత్వానికి ఆదాయం వస్తున్నది. దానిలోనుంచి 20 లక్షలు interim payments, మిగిలింది అంతా compensation క్రిందికి పోతుంది. ఇప్పటికి 35 కోట్ల రూపాయలు యిచ్చారు. ఇంకా ఇవ్వవలసింది ఉన్నది. క్రమేణా tribunal యిచ్చిన తీర్పు ప్రకారం పరిష్కారం అవుతున్నది గనుక దాన్నికూడా మనవి జేస్తున్నాను.

Inams Abolition Act అమలుపెట్టడంలో Planning Commission వారు కొన్ని సవరణలు కోరారట. వాటిని గురించి విచారణ జరుగుతున్నది. త్వరలో దానిలో సవరణలు కావలిస్తే చేసేట్లు, అవసరంలేకపోతే అమలు చేయడానికి చూస్తున్న విషయంకూడా మనవి జేస్తున్నాను. సభ్యులందరూ యింతసేపు కూర్చున్నందుకు వారికి నా వందనములు.

మిస్టర్ స్పీకర్ : శ్రీ కె. అప్పారావుగారు నా దగ్గర వ్రాతమూలకంగా permission తీసుకున్నారు. ఇప్పుడు వారు కొంత personal explanation గా కొల్లేరు భూములగురించి చెబుతారు.

శ్రీ కె. అప్పారావు (కైకలూరు) : నిన్న నేను కొల్లేరు భూముల గురించి మనవి జేశాను. కైకలూరు తాలూకా కొల్లేరు ప్రాంతంలోని రెండవ పైరు వరి సాగుచేయని భూమిమీద శిస్తులు వసూలు చేస్తున్నారు. అదే భూమిలో మొదట పైరు చేసుకొన్నా పంటలు పోయిన కారణంచేత remission వచ్చి ఉంది. ఆ కారణంచేత అక్కడ భూమిలో రెండవపారి ఉడ్వకపోయినా, సాగుచేయకపోయినా శిస్తులు వసూలు చేస్తున్నారు. ఆయకట్టు localise చేసి

ప్రాంతాల్లో వర్తించే G. O. localisation చేయనటువంటి మా ప్రాంతాల్లో కూడా వర్తింప చేస్తున్నారు. ఆయకట్టు localise చేసిన తరువాత అలా చేయించేట్లు, ఈలోపల ఆ విధంగా పన్నులు విధింపబడకుండేట్లు ఉత్తర్వులు జారీ చేయవలసిందని మంత్రిగారిని కోరుతున్నాను.

శ్రీ కె. వెంకటరావు : ఏక్‌సాల్ కౌలుగురించిన G. O. ప్రకారం యిది condition precident. నేను సాగు చేసుకుంటానని చెప్పి సాగు చేసుకోక పోయినా యివ్వవలసిందే. అందుకొరకు యింకొక Bill ను pass చేశాము. తుంగభద్రా ప్రాజెక్టుక్రింద కూడా నీరు పుచ్చుకుంటున్నారని నిర్ణయం అయిన తరువాత 4 సం॥ లు అయిపోయిన తరువాత కూడా వారు నీరు పెట్టుకున్నా, పెట్టుకోకపోయినా పన్ను యివ్వవలసిందే. వీటిమీద calculate చేసుకొనే వడ్డీ లెక్క కట్టారు. లేనిచో బాధ వస్తుందని ఆ నిర్ణయం చేశారు. ఏదైనా ప్రత్యేకమైన కష్టం individual cases లో వుంటే పరిశీలించడానికి యే విధమైన అభ్యంతరము లేదు.

శ్రీ పి. గోపాలురెడ్డి (తిరుత్తని) : గత సంవత్సరం ఎన్‌హాన్స్‌మెంటు ఆఫ్ వెట్ ఎసెస్‌మెంటు అనే పన్నును విధించినపుడు అది చిత్తూరు, శ్రీకాకుళం, విశాఖపట్టణం, కడప, కర్నూలు, అనంతపురం జిల్లాలకు అన్వయించదని మంత్రిగారు చెప్పారు. ఐతే ఇప్పుడు అందుకు భిన్నంగా జరుగుతున్నది. ఎప్పుడో తాతలనాటి కాలంనుంచీ ఏటికాల్వ ఉన్నదనే కారణాన రివర్ సప్లయి ఛానలు ఉన్నదని మాజిల్లాల లోని చెరువులక్రింద సాగుఅయ్యే భూములపై రూపాయకు 3 అణాలు హెచ్చుగా వసూలుచేస్తున్నారు. అందువల్ల రైతులు చాలా బాధ పడుతున్నారు. యీ చట్టాన్ని పాస్ చేసినప్పుడు మంత్రిగారు మా జిల్లాల విషయం ఆలోచిస్తామని హామీ యిచ్చారు. కాని ఇప్పుడు అలా చేయకుండా హెచ్చు శిస్తు వసూలు చేస్తూ ఉండడంవల్ల రైతులు చాలా బాధపడుతున్నారు.

శ్రీ కె. వెంకటరావు : అప్పుడు యీ ఫ్లోర్ లేదు. ఆ విషయం ఇంకొక ఫ్లోర్‌లో జరిగిఉండవచ్చు. అప్పుడు నేను అట్టి హామీ యీయలేదు. కాని అప్పటి ప్రభుత్వం ఏదో చెప్పిఉండవచ్చు, ఏ బిల్లులోనూ శ్రీకాకుళం, చిత్తూరు, అమలాపురంలకు ఎక్సుక్లూజన్ ఇవ్వబడదు. అది మొత్తముమీద వస్తుంది. ఏ రకమైన భూములకు పన్నులు ఇవ్వాలి అనే విషయం ఆ బిల్లులో ఉన్నది. చెరువులకు హెచ్చు పన్నులు లేవు. రివర్ ఛానల్సునుంచి వచ్చేవాటికి హెచ్చు పన్నులు లేవు. నూతులదగ్గర హెచ్చు పన్నులు లేవు. కాని నదియొక్క ప్రవాహాము వల్ల నిండిన చెరువులక్రింద సాగయ్యే భూములకు యీ హెచ్చుపన్ను వర్తిస్తుందని దానిలో వ్రాసిఉన్నది. అది క్రొత్తగా వ్రాసినది కాదు. ఇందులో ఎవరినీ దగా చేయడానికి ఏమీ చేయలేదు. నాకు ముందు రివిన్యూ మినిష్టరుగా

ఉన్న మిత్రులు చంద్రమౌళిగారు యీ బిల్లు ఫలానా జిల్లాలకు వర్తించదని చెప్పి ఉండరు. ఆ వేళ నూతులకు, చెరువులకు పర్ర కాలువలకు ఎగ్జంప్షన్ ఇచ్చారు. వాటిక్రింద ఉన్న భూములకు పన్ను హెచ్చిస్తే దానిని తగ్గించడానికి వీలుంటుంది.

శ్రీ పి. గోపాలురెడ్డి : ఆ చట్టంలో 'other than river' అన్నారు. 'రివర్' అనే దానికి డిఫినిషన్ సరిగాలేదు. అందువల్ల ఈ చిక్కులన్నీ వస్తున్నాయి. కాబట్టి రివర్ అనేదానికి సరిఅయిన అర్థము యిప్పించవలెనని కోరుతున్నాను.

శ్రీ కె. వెంకటరావు : ఆ చట్టంలోని మాటలకన్నిటికీ అర్థం ఏమిటో గౌరవ సభ్యులకుకూడా తెలిసేఉంటుంది. అది పాస్ చేయడంలో ఆయనకూడా ఉన్నారు.

శ్రీ జి. యలమందారెడ్డి : కంచెల విషయంలో రైతులకు ఇబ్బందులు కలుగుతున్నాయి. యీ టేకెన్ ఓవర్ ఎస్టేట్సులో కంచెలపై ఫారెస్టు డిపార్టుమెంటువారు పుల్లరి వసూలుచేస్తున్నారు. అదేగ్రామంలో రివిన్యూ డిపార్టుమెంటువారుకూడా యీ కంచెలపై విడిగా గత రెండు సంవత్సరములనుంచీ పన్నులు వసూలుచేస్తున్నారు. ఇది రైతులకు ఇబ్బందిగా ఉంది కాబట్టి ఏదో ఒక విధమైన పన్నును మాత్రమే విధించేటట్లు చేస్తారా ?

శ్రీ కె. వెంకటరావు : వెనుకటి జమీందారీ ప్రాంతములలో ఉండే సాంప్రదాయములు కొన్ని ఇప్పుడుకూడా ఉండిఉండవచ్చును. ఐతే ఈ విషయములన్నిటినీ గురించి తిమ్మారెడ్డిగారు విచారణచేస్తారు. దానిని గురించి త్వరలో ఆర్డర్సు వస్తాయి. డిపార్టుమెంటు నాదే అయినా దానికి సంబంధించిన ఇతర శాఖలతోకూడా సంప్రదించవలసి ఉంటుంది. 6 అడుగుల చెట్టు ఉన్నా కొన్ని కొన్నిచోట్ల అది ఫారెస్టు అవుతుంది.

*DEMAND No. I - Land Revenue — Rs.* 1,42,22,800

*Mr. Speaker:* The question is

"To reduce the allotment of Rs. 1,42,22,800/- for Land Revenue by Rs. 100/-"

(లంకభూములను పేద ప్రజలకు దక్కకుండా వేలము వేస్తున్నందుకు, బంజరు భూములనుండి పేదప్రజలను తొలగించడము, విపరీతమయిన పెనాల్టీలు చేస్తున్నందుకు, కౌలుదారీ రక్షణచట్టాన్ని సరిగా అమలుజరుపక, భూస్వాములను అనుకూలంగా కౌలుదారులను బేదఖలు చేస్తున్నందుకు, పేద ప్రజలకు భూములివ్వడానికి భూసంస్కరణల చట్టం తేనందుకు)

The motion was negatived.

*Sri P. Sundarayya* (*Gannavaram*)*:* I demand a division sir.

The House then divided.

Ayes—36 ; Noes—104

The motion was negatived.

*Mr. Speaker :* The question is

"To reduce the allotment of Rs. 1,42,22,800/- for
Land Revenue by Rs. 100/-"

(నెల్లూరు జిల్లా కోవూరు తాలూకా వూటుకూరు గ్రామములోని దామరమడుగు అను ప్రదేశమును సర్వేచేయించి, తగాదాలు లేకుండాచేయమని పదేపదే పెట్టుకొన్న దరఖాస్తులను మన్నించనందుకు)

The motion was negatived.

*Mr. Speaker :* The question is

"To reduce the allotment of Rs. 1,42,22,800/- for
Land Revenue by Rs. 100/-"

(నెల్లూరు జిల్లా కోవూరు తాలూకా తరువాయి గ్రామ సర్వే నెం.345 లో సుమారు 600 యెకరాల భూమిని పేదలకు పంచుటలో జాప్యము జరుపుచున్నందులకు)

The motion was negatived.

*Mr. Speaker :* The qeustion is

"To reduce the allotment of Rs. 1,42,22,800/- for
Land Revenue by Rs. 100/-"

(సమగ్రమైన భూసంస్కరణ చట్టము తెచ్చుటలో కాలయాపనము చేయుచున్నందుకు).

The motion was negatived.

*Mr. Speaker :* The question is

"To reduce the allotment of Rs. 1,42,22,800/- for
Land Revenue by Rs. 100/-"

(భూస్వాములు సాగుచేయుచున్న ప్రభుత్వ బంజరుభూములనుండి వారిని తొలగించి సదరు భూములను వ్యవసాయ కూలీలకు యివ్వనందుకు)

The motion was negatived.

*Mr. Speaker :* The question is

" To reduce the allotment of Rs, 1,42,22,800/– for
Land Revenue by Rs. 100/-"

(పెద్ద భూస్వాములకు లోగడ కవులకు యివ్వబడివున్న ప్రభుత్వ భూముల నుండి వారిని తొలగించి వ్యవసాయ కూలీలకు యివ్వనందున)

The motion was negatived.

*Mr. Speaker:* The question is

"To reduce the allotment of Rs. 1,42,22,800/- for Land Revenue by Rs. 100/-"

(3645మంది సర్వే ఉద్యోగస్థులను ఖాయముచేయకుండా వున్నందుకు)

The motion was negatived.

*Mr. Speaker:* The question is

"To reduce the allotment of Rs. 1,42,22,800/- for Land Revenue by Rs. 100/-"

(నీళ్ల పన్ను తీసుకొనవందుకు)

The motion was negatived.

*Mr. Speaker:* The question is

"To reduce the allotment of Rs. 1,42,22,800/- for Land Revenue by Rs. 100/-"

(జమాబందీలో అవినీతిపైన చర్చించుటకు)

The motion was negatived.

*Mr. Speaker:* The question is

"To reduce the allotment of Rs. 1,42,22,800/- for Land Revenue by Rs. 100/-"

(మంచి గైరయిన భూమిని స్వాధీనపరచుకొని యేదో చెడుభూమిని గైరాన కొరకు యిచ్చుదానిని ఆపనందులకు)

The motion was negatived.

*Mr. Speaker:* The question is

"To reduce the allotment of Rs. 1,42,22,800/- for Land Revenue by Rs. 100"

(ఆదాయము లేని వ్యవసాయముపైన పన్ను మినహాయించమని కోరుటకు)

The motion was negatived.

*Mr. Speaker:* The question is

"To reduce the allotment of Rs. 1,42,22,800/- for Land Revenue by Rs. 100"

(కౌలుదార్ల తొలగింపుకు ముధోల్ తాలూకాలో ప్రభుత్వము ఆపుదల చేయనందుకు)

The motion was negatived.

*Mr. Speaker:* The question is

"To reduce the allotment of Rs. 1,42,22,800/- for Land Revenue by Rs. 100"

(ఖారిజఖాతా పోరంబోక్ గైరాన భూములు హరిజనులకు పంపకము చేయనందుకు)

The motion was negatived.

*Mv. Speaker:* The question is

"To reduce the allotment of Rs. 1,42,22,800/- for Land Revenue by Rs. 100/-"

(పటేల్, పట్వారీలకు మరియు నీరదీలకు, సేత్ సింధీలకు వేతనములు పెంచనందుకు)

The motion was negatived.

*Mr. Speaker:* The question is

"To reduce the allotment of Rs. 1,42,22,800/- for Land Revenue by Rs. 100/-"

(గిర్దావర్లకు పర్వాప్తమైన బత్తెము కరువు బత్తెం యివ్వనందులకు)

The motion was negatived.

*Mr. Speaker:* The question is

" To reduce the allotment of Rs. 1,42,22,8 00/- for land Revenue by Rs. 100/-"

(తెలంగాణాలో కౌలుదార్లను భూములనుండి తొలగించుటగురించి)

The motion was negatived.

*Mr. Speaker:* The question is

"To reduce the allotment of Rs. 1,42,22,800/- for Land Revenue by Rs. 100/-"

(తెలంగాణాలో పటేలు పట్వారీల వారసత్వ హక్కును రద్దుపర్చుటను గురించి)

The motion was negatived.

*Mr. Speaker:* The question is

To reduce the allotment of Rs. 1,42,22,800/- for Land Revenue by Rs. 100/-"

(తెలంగాణాలో ప్రభుత్వ భూములు, బంచరాయి, ఖారిజుఖాత పోరంబోకు, షికిమ్‌తాలిద, నద్దిమన్‌జ్మ ఈ భూములను సేద్యముచేస్తున్న రైతాంగము పేర పట్టా హక్కు యివ్వకుండా తావాను పెనాలిటీ వసూలు గురించి)

The motion was negatived.

*Mr. Speaker:* The question is

" To reduce the allotment of Rs. 1,42,22,800/- for Land Revenue by Rs. 100/-"

(తెలంగాణాలోమాగాణి భూమిశిస్తును తగ్గించుతూ ఆంధ్రప్రాంతముతో తెవెలు చేయుటగురించి)

The motion was negatived.

*Mr. Speaker:* The question is

" To reduce the allotment of Rs. 1,42,22,800 for
Land Revenue by Rs 100"

(To discuss the differences of Land Revenue rates being collected in the Srikakulam District for the same Taramwar Lands.)

The motion was negatived.

*Mr. Speaker:* The question is

To reduce the allotment of Rs. 1,42,22,800/- for
Land Revenue by Rs. 100/-"

(To advocate the abolition of Revenue Board.)

The motion was negatived.

*Mr. Speaker:* The question is

"To reduce the allotment of Rs. 1,42,22,800/- for
Land Revenue by Rs. 100/-"

(To impress upon the Government to levy agricultural wealth tax.)

The motion was negatived.

*Mr. Speaker:* The question is

"To reduce the allotment of Rs. 1,42,22,800/- for
Land Revenue by Rs. 100/-"

(రెండవ పంచవర్ష ప్రణాళిక సూచనల మేర భూసంస్కరణలు, అమలు జరుపనందుకు ప్రభుత్వం చర్యను విమర్శించుటకు.)

The motion was negatived.

*Mr. Speaker:* The question is

"To reduce the allotment of Rs. 1,42,22,800/- for
Land Revenue by Rs. 100/-"

(తాలూకా ఆఫీసులలో సిబ్బంది చాలడంలేదు కావున పెంచవలెనని, కోరుటకు.)

The motion was negatived.

*Mr. Speaker:* The question is

"To reduce the allotment of Rs. 1,42,22,800/- for
Land Revenue by Rs. 100"

(గ్రామోద్యోగస్థులకు గుమాస్తా జీతంతో సమానంగాయిచ్చుటకు వారికి తగిన సౌకర్యాలు కలిగించవలెనని ఉన్నవాటిని అమలు జరుపవలెనని ఇంతవరకు వారికివ్వబడిన సౌకర్యములకు సంబంధించిన జీతాలన్నింటిని ప్రత్యేకంగా ప్రకటించవలెనని.)

The motion was negatived.

